శ్రీరస్తు.

విచిత్ర

# మైరావణవచనము

బ్రహ్మశ్రీ:

పురాణం. పిచ్చయ్యశాస్త్రిగారిచే వ్రాయంబడినది.





చెన్నపురి

ఎస్. వి. గోపాల్ అండు కంపెనీవారిచే
ఆనందభారతి పవర్ ముద్రాక్షరశాలయందు
ముద్రించి ప్రకటింపబడినది.

1940

# భట్టి విక్రమాదిత్యుని కథ.

(50 చిత్రపటములతో)

దీనిలో భోజరాజు జననము మొదలుకొని విక్రమాదిత్యుడు ముప్పదిరెండు సింహాసన మెక్కినది, అడవియందు దారునెలలు, యింటియందు దారునెలలు గడపిన నియు భేతాళుడు చెప్పిన యిరువదినాలుగు కథలును, ప్రతిమలు చెప్పిన ముప్పది నాలుగు కథలును చాలాకాలము రాజ్యముచేసిన విధమును గలవు. ప్రతికథయు బహువిచిత్రముగా చెప్పబడియున్నది. ఒక్కొక్క కథకు తగినట్లు చిత్రమైన పట ములతో అచ్చొత్తింప బడియున్నది. సుమారు 500 పుటలుగల గ్రంథము.

వెల **2-0-0**

# శ్రీ రామ వన వా స ము

ఇది శ్రీరామచంద్రుని వనవాస వృత్తాంతమును విపులముగా సులభశైలిని వ్రాయఁబడిన నూతనమైన వచనగ్రంథము. ఇదివరకును ప్రత్యేకముగా ఈవిషయ మునుగూర్చి వ్రాసినగ్రంథములేదు. ఇది స్త్రీలును పురుషులును చదివి సులభముగా తాత్పర్యమును తెలుసుకొనుభంగి రచింపఁబడినది. చదువుట కింపుగానుండును. శ్రీరామచరిత్రంబు సర్వజనాదరణీయంబును, ప్రసిద్ధంబును నగుటచే యిందువిషయ మైవిశేషించి వ్రాయవలసినదియేలేదు. అందమైన చిత్రపటములు సందర్భానుసార ముగా చేర్పించి సొగసుగా తయారుచేయఁబడిన గ్రంథము. అందరును చదువఁదగి నది. ఎల్లరును కొనిపఠించుట కనువుగా నుండునటుల స్వల్పక్రయమును నిర్ణయించి యున్నాము. శీఘ్రముగా ఆర్డరు యిచ్చిన వారికి మాత్రమే పుస్తకము లభించును.

వెల **0-12-0**

# నవనీతారిష్టము (తెనుగుతాత్పర్యము.)

జాతకున కెన్నియోగములున్నను ఆయురారోగ్యములేనియెడల నవియన్నియు నిష్ప్రయోజనములగును. గనుక మొట్టమొదట ఆయుర్దాయనిర్ణయ మత్యావశ్యకము. అందును జనవాదిగా పదిరెండుసంవత్సరములోపల బాలురు తల్లిదండ్రులయొక్క దోషములచేతను బాలగ్రహమువల్లను నశించుటచేత ఆయుర్జ్ఞానము తెలియుట దుర్లభము, అట్టిగండాంతరములను కనిపెట్టి తద్దోషనివారణార్థమై యథావిధిగా శాంతులను జరుపుటచేత ఆయుర్వృద్ధిని సౌఖ్యమును పొందును. **0-8-0**

## యన్. వి. గోపాల్ అండుకో.,

[redacted] కృష్ణప్పనాయకన్ గుంటవీధి, జి. టి. మదరాస్.

# దైవ ప్రార్థనము.

శా॥ శ్రీకల్యాణ గుణాకరున్ శుభకరున్ - శేషాద్రి వాసున్మనో
జ్ఞాకారున్జలజాతలోచనుని మం - గాబావిభున్భావనన్
లోకారాధ్యున నంతుమౌనిజనహృ - ల్లోలుం గృపాపూర్ణుసు
శ్లోకున్ శాంతుని వేంకటేశ్వరుని నా చిత్తంబు లోనెంచెదన్.

మంగాంబా స్తుతి.

క॥ తలఁచెదను భక్తిమీఱఁగ - దలఁపునఁ గరుణాంతరంగఁ - దరళలసత్కుం
తలజిత భృంగన్ పావని । నలఘుతరక్లేశ భంగ - నలమేల్మంగన్.

బ్రహ్మ స్తుతి.

క॥ తోయజభవునినుతించెద । నాయుల్లములో సదాఘ - నంబగుభక్తిన్
శ్రేయము నారోగ్యముదీ । ర్ఘాయువును నొసంగికరుణ - నారసిబ్రోవన్.

సరస్వతీ స్తుతి.

క॥ అరవింద సుందరాస్యను । దరశరశరదిందుతుల్య - తనుకాంతియుతన్
పరమదయాకరి భారతిఁ । పరగన్ వాక్సిద్ధినొసఁగఁ - బ్రస్తుతిఁజేతున్.

ఈశ్వర స్తుతి.

క॥ భావుకఫలదాయశుభ - స్తావనుని సుశీలునిర్జ - రాశ్రయునభవున్
భావించెద నెల్లప్పుడును । నావాంఛార్థంబునొసఁగి - ననురక్షింపన్.

పార్వతీ స్తుతి.

క॥ గౌరిన్ భూధరరాజకు । మారిన్ సుకుమారిసర్వ - మంగళ నెదలో
కోరిభజించెదనెంతయుఁ । గూరిమిమీఱంగ నాదు - కోర్కులొసంగన్.

గణపతి స్తుతి.

క॥ గజవదనుని లంబోదరు । నజముఖ్యసమస్తదేవ - తారాధ్యుహరా
త్మజునినుతించెద విఘ్న । వ్రజము నడంగించికృతిని - వర్ధిలఁజేయన్.

కవి వంశక్రమము.

(సీసమాలిక.)

సరససంపదనొప్పు - సరళమౌఫక్కిని - క్రమముగా పెక్కుగ్రం - థములువ్రాసి
పేరుఁబొందినవాఁడఁ - బిచ్చయాహ్వయుఁడసా - విత్ర్యంబకును మహావిజ్ఞుఁడైన
క్షితిసురమౌళిల - క్ష్మీనృసింహాఖ్యున - కును బుత్రుఁడనుసర్వ - జనసఖుండ
నిఖిలసద్గుణగణా - న్వితమహాలక్ష్మి - యను సాధ్వివిభుఁడవి - ద్యాప్రియుండ
శ్రీవత్సగోత్రరా - జీవనార్కుండ - సురుచిరాపస్తంబ - సూత్రయుతుఁడ
సన్నుతోత్తమయజు - శ్శాఖీననూనపం - చార్షేయుఁడను సత్క్రి - యానిరతుఁడ
సంతత వేంకటేశ్వర పాదచింతనా - సక్తుండ నిరుపమా - చారపరుఁడ
విశ్రుతాద్భుతచతు - ర్విధకవిత్వప్రౌఢి - గడునొప్ప విఖ్యాతిఁ - గన్నవాఁడ.
గీ॥ ఇపుడు మైరావణచరిత్ర - మింపుగాఁగ నవ్యశైలి దనరగద్య - కావ్యమేను
వ్రాయఁబూనితి పండిత - వర్యులార యాదరింపుఁడు దీనిని - యలఁతిఁగనక.

# పీఠిక.

---

మహాశయులారా, శ్రీమద్రామాయణములో నెచ్చటనుం జెప్పఁబడని యీ మైరావణచరిత్ర యెచ్చటనుండియో, యెట్లో ప్రభవించి లోకమునఁ బ్రబలి యంపటివల పఠింపఁబడుచున్నది. ఈ కథ నిజమైనను, కాకపోయినను వింతగను నింపుగను నుండుటచేత సర్వజనులును దీని నాదరించి చదివి యానందించుచుండెదరు. దీనిని మర్దయనెడి కవి పద్యకావ్యముగా వ్రాపియున్నాఁడు. గద్యముగ వ్రాసినవారు పెక్కండ్రు గలరు. పద్యకావ్యమునకంటె గద్యముగా వ్రాయఁబడినవి సంగ్రహించి వ్రాయఁబడియున్నవి. ఇంతకు పూర్వ మీ మైరావణ చరిత్రము నేనే యక్షగాన నాటకముగను, వచనకావ్యముగను వ్రాసియున్నాఁడను. అవి ముద్రితములై ప్రచురింపఁబడియున్నవి. ఈచరిత్రమును మదీయ మిత్రులగు శ్రీ. యన్, వి. గోపాల మొదలియారుగారు క్రొత్తపద్ధతి ననుసరించి వ్రాయవలసినదని కోరి నాతో చెప్పిరి. ముద్రణాదులకయ్యెడి ప్రయాసములు తామే భరించుకొని ప్రచురించునట్లు చెప్పినందున సమ్మతించి యింతకు మున్ను వ్రాసియున్నట్లు గాక యేకవిధమైన నూతనమగురీతిని ననుసరించి యీగద్యకావ్యమును రచించితిని. ముందు నేను వ్రాసియుండు వానికిని దీనికినిఁ గల భేద మేమనఁగా, ఇందు కథాసరణిద్వారా పాటయును కీర్తనలును, సందర్భానుసారముగా పద్యములును జేర్పఁబడి చదువరులకు మిక్కిలి యానందము గలిగించులాగున నొప్పుచున్నది. ఇట్టి పద్ధతి నిదివర కెవ్వరును వ్రాసియుండలేదు.

ఈ పుస్తకమును పఠించిన వారి కంతటితో తనివి గలుగక, మరల మరల జదువవలయు ననెడి యపేక్ష గలుగుచుండు ననుటకు సంశయింపవలసినదియేలేదు. మర్దన పద్యకావ్యమునకును, నేనును, యితరులును వ్రాసియున్న తొల్లిటి గ్రంథములకును నొక కథయందు దప్ప మఱిరచనవిషయమున నెట్టిసంబంధమును నుండదు. సర్వజనాదరణీయమై యాహ్లాదకరమై యుండవలయు ననెడి యుద్దేశము గలవాఁడనై, నేను యీపద్ధతి ననుసరించి వ్రాసితిని, సహృదయు లీపుస్తకమును చదివి యానందింపఁగలరని నాయాశయము. బుద్ధిమంతు లిందు గనుపట్టు మదీయ లేఖన ప్రమాదజనితదోషంబులను మన్నింపవలయుననియు, దీనిని ప్రియముతో నాదరించి మఱియు నిట్టి గ్రంథములు వ్రాయుటకు నాకు ప్రోత్సాహము గలిగింపవలయుననియు, నేను వ్రాసిన గ్రంథములెల్లను తన ఖర్చుతో నచ్చొత్తించి ప్రచురించుచుండు. శ్రీ గోపాల మొదలియారుగారి ప్రయత్నము నిరంతరాయముగా జరుగునట్లు వారి కుత్సాహము గలుగఁజేయవలయుననియు మిక్కిలి ప్రార్థించుచున్నాఁడను.

ఇట్లు గ్రంథకర్త,

పురాణం-పిచ్చయ్యశాస్త్రి.

# విచిత్ర మైరావణ చరిత్రము.

## పూర్వకథ.

శ్రీమదఖిలాండకోటి బ్రహ్మాండ నాయకుండును, సకల చరాచరాత్మకుండును, పరాత్పరుండునగు జనార్ద్దనుండపుడపుడును నానావిధ రూపంబులతో భూలోకమున నవతరించి దుష్టశిక్షణమును శిష్ట సంరక్షణమునుంజేసి ధర్మమును నెలకొల్పుచుండును. అవ్విధంబున భగవంతుఁ డవతరించిన యవతారములలో పదింటిని మహాత్ములు ముఖ్యముగాఁ బేర్కొని యందును శ్రీరామావతారము నెక్కుడైనదిగాఁ జెప్పి శ్లాఘించియున్నారు. ఈరామావతారమును గూర్చి వివరించునదియే వాల్మీకి మహర్షి కృతమైన శ్రీమద్రామాయణము. అందు చెప్పఁబడియున్న విషయమునే యీమైరావణ చరిత్రమునకు పూర్వకథగాఁ గొని వివరించుచున్నాను.

త్రిజగత్పతి యగు శ్రీమన్నారాయణుండు లోకంబున సత్పురుషులను బాధించుచున్న దుర్మార్గులగు రాక్షసులసంహరించి సుఖవర్తనుల సంకటములు నివారింపఁ దలంచి యవతరించుచుండునని ముందు చెప్పి యుంటిమి గదా? అటులనే రావణాది రాక్షసులు ప్రబలి తపోబల సంపన్నులై దేవతలను మునులను, పతివ్రతలను పలుతెఱంగుల వెత లొందించుచున్న సమయమున వారిని హాత మొనరించుటకునై ధర్మపరుండును, సకలసద్గుణ పూర్ణుండును, సత్యసంధుండును, పుణ్యశీలుండును, రాజకులశ్రేష్ఠుండును, జగద్విఖ్యాతకీర్తి సంపన్నుండును నైన యయోధ్యానాథుండగు దశరథమహారాజునకు పుత్రుఁడై కౌసల్యాదేవి పావనగర్భంబున భగవంతుఁడు జన్మించెను. దశరథునకు ముప్వురు భార్యలు గలరు. పట్టమహిషి కౌసల్య. ఆమెకు గలిగిన సుపుత్రుఁడే శ్రీరామచంద్రుఁడు. మఱియు కైక, సుమిత్ర యనెడి యిరువురు భార్యలలో, కైకకు భరతుఁడను కుమారుఁడును, సుమిత్రకు లక్ష్మణ శత్రుఘ్ను లనెడి యిరువురు పుత్రులును గలిగిరి. చిన్ననాటనుండియు వీరిలో లక్ష్మణుండు శ్రీరాముని, శత్రుఘ్నుండు

భరతుని ననుసరించి యెడబాయక వర్తించుచుండిరి. సకలశుభలక్షణ శోభితులై చతుర్వేదములవలె నలరారుచుండెడి నలువురు పుత్రులను జూచి దశరథుండు పరమానంద సాగర మగ్నుండై, క్రమముగా వారికి జరిగింపవలసిన యుపనయనాది క్రియలు నిర్వర్తించి వసిష్ఠాది గురువులయొద్ద సకల విద్యలును జెప్పించి మహాప్రవీణులను గావించెను. నవయౌవన శోభితులై యొప్పుచున్న యా కుమారులకు విశ్వామిత్ర మహర్షి ప్రోత్సాహంబున జనక మహారాజ పుత్రికలగు సీత, యూర్మిళ యను వారలను రామలక్ష్మణులకును, నతని తమ్ముని కూతుండ్రైన మాండవి శ్రుతకీర్తులను భరతశత్రుఘ్నులకును, ఇచ్చునట్లు తీర్మానించి దశరథ మహారాజు వివాహములు జరిగించి, కుమారులను కోడండ్రను దోడ్కొని యయోధ్య కరుదెంచి సంతోష చిత్తుండై యుండెను.

కొంతకాలము జరిగి నంతట దశరథుండు తనకు వార్ధకదశ సంప్రాప్తించుటం దలంచి, పెద్దలతో నాలోచించి, సర్వ శుభలక్షణ కలితుండై యొప్పుచున్న శ్రీరామ చంద్రునకు పట్టాభిషేక మొనరించి రాజ్యభారము నతనిపైనిడి తాను శాంతచిత్తుండై యాముష్మిక చింతతో కాలము గడుపనెంచి యాకార్యమునకై మహాడంబరముగా సకల ప్రయత్నములును గావించెను. కాని యతని యుద్దేశము నెఱవేఱినది కాదు. కైక వలన పట్టాభిషేకమునకు భంగ మేర్పడెను. అంతియ గాక నార చీరలు దాల్చి రామచంద్రుండు పదునాలుగేండ్లు కానన వాసముం జేయవలసినట్లు కైక నిర్ణయించెను. సుగుణాకరుండైన రామచంద్రుం డామె యాజ్ఞ భక్తితోఁ దలఁ దాల్చి యరణ్యవాసమునకు ప్రయాణమయ్యెను. కైక కొసంగి యుండిన వరంబునకు బద్ధుండై, సుకుమారుండైన తన పుత్రుం డడవుల కరుగుట సమ్మతము గాకున్నను, దశరథుండు మాటాడలేక మిక్కిలి వందురుచుండెను.

తండ్రి కిచ్చ లేకున్న దెటింగియు ధర్మజ్ఞుండగు రాఘవేశ్వరుండు చవతి తల్లి కోరికను నెరవేర్పఁబూని, విడిచి యుండలేక తనవెంట నడచుటకుఁ దయినమైన సీతాలక్ష్మణులం గూడి, తాపస వేషముతో నరణ్యమున కేగెను. భార్యా సోదర సహితుండైన యారాజ కుల

మణి యందందు కానన వాసులైన మహర్షుల దర్శించి వారివలన దీవనలం గొనుచు పోయి పోయి చిత్రకూట పర్వతంబునొద్ద పర్ణశాల నిర్మించుకొని కందమూల ఫలాదుల నాహరించుచు, ప్రాణతుల్యయైన పత్నియు, పరమ భక్తుండగు తమ్ముఁడును సేవించుచుండఁగా నిర్విచార చిత్తుండై కాలమును గడపుచుండెను.

అట్టి కాలమున తపస్వులను బాధించుచుండిన ఖరదూషణ త్రిశరాదులైన పెక్కండ్రు దుష్ట రాక్షసులను సంహరించి వారివలన తాపసులకు గలుగుచుండిన మహోపద్రవమును నివారించెను. ఖర దూషణాదులు మడియుటయును, వారికిని, లంకాధిపతికిని చెల్లెలగు శూర్పణఖయను రక్కసి రామచంద్రుండున్న పర్ణశాల యొద్దకుఁబోయి సర్వాంగ సుందరుండై యతనిని మోహించి పరిగ్రహింపుమని తొందర అపెట్టుటయు, సీతావల్లభుండు లక్ష్మణునిఁ బిలిచి దాని ముక్కు చెవులుం గోయించి విరూపిణిం జేసి వెడలఁగొట్టెను. ఆ దురాత్మురాలు తన పగఁ దీర్చుకొనుటకు దలంచి యేడ్చుచు లంకాపురమునకుఁ బోయి జరిగిన వృత్తాంతంబంతయు నెఱింగించి, "రాముని భార్య మిక్కిలి చక్కనిది దానిని నీవు పరిగ్రహించి భార్యగాఁ జేసికొను"మని బోధించెను.

రావణుం డామాటలకు లోఁబడి, మారీచుఁడను వాని సహాయముతో దండకారణ్యమందలి పర్ణశాలకు వచ్చి రామలక్ష్మణులు లేని సమయమున సీతాదేవినిఁ గొనిపోయి లంకలోని యశోకవనమున నునిచి, యా పతివ్రతా రత్నమును తనకు వశురాలగునట్లు చేయుటకై రాక్షసస్త్రీల నామెయొద్ద నుండునట్లు నియమించెను. పిమ్మట రామ లక్ష్మణు లరుదెంచి సీతనుగానక చింతాక్రాంతులై వెదకుచు, ఋష్యమూక పర్వతమునొద్దకు వచ్చి యచ్చటనుండిన సుగ్రీవుండను వానర రాజుతో సఖ్యముఁజేసి, యతని యన్నయైన వాలినిఁ జంపి, వానర రాజ్యమున కతని నధిపతినిఁ గావించెను.

సుగ్రీవుండు రామ కార్యార్థియై సీతను వెదకుటకై పెక్కండ్రు వానరులను బంపుటయును మహా సమర్థుండగు హనుమంతుఁడు లంక కరిగి సీత వృత్తాంతమును గనుఁగొని వచ్చి యెఱింగించెను. అంతట రామ లక్ష్మణులు సుగ్రీవుని సహాయముతో డెబ్బదిరెండు వెల్లువల

వానర సైన్యముం గొని రావణ సంహారమునకై వెడలి సముద్ర మునకు వారిధిగట్టుటకై ప్రయత్నించుచుండెను. అపుడు రావణు తమ్ముఁడు విభీషణుండనువాఁడు తన యన్నచే నవమానింపఁబడి రామ చంద్రుని యొద్దకువచ్చి శరణుఁజొచ్చి యా మహావీరుని కరుణకు పాత్రుఁడై మహా భక్తితో సేవించువాఁడయ్యెను. పిమ్మట వాన రులచే సేతువుఁగట్టించి రామచంద్రుండు కోతిగుంపులతో సముద్ర మును దాటిపోయి లంకాపట్టణమును ముట్టడించెను. రావణుండెటెంగి యెదిరించి సైన్యయుతుండై వచ్చి మహా ఘోరముగాఁ బోరఁ దొడంగెను. ఆ సమరంబున, రావణుని కొడుకులును, తమ్ములును, బంధువులును మిత్రులును మరణించి. యల్పమగు మూలబలముతో నొక రిద్దరు మంత్రులతో రావణుం డొక్కడుమాత్రము మిగిలి యుండెను.

అపుడు దశకంధరుం డనన్య సామాన్య బల పరాక్రమ సంప న్నులైన రామ లక్ష్మణులను, వానరులను జయించుటకు శక్యముగా కుండుటయు, వారిచే తన బంధు మిత్ర పుత్రానుజులును, ననంతం బైన సైన్యమును నాశమగుటయునుం దలంచి, కాల విపర్యయమును గూర్చి యాలోచించి యధిక చింతాక్రాంతుఁడై నిరాశంజెంది కర్త వ్యము తోఁచక, తనకు జయంబు గలుగఁబోవునది లేదనెడి నిశ్చయ నొక యేకాంత స్థలంబునఁ గూర్చుండి, ప్రహస్తుండనెడి మంత్రిని రావించి తన దుర్దశను గురించి పరితాపం బతిశయింపగా దీన ముఖుఁడై యతనితో నిట్లనియె.

ఇది మైరావణ చరిత్రము ప్రారంభమగుటకు పూర్వము జరి గిన సంగ్రహమైన రామాయణ కథ. ఇంకమీఁదట పాతాళ లంకాధిపతియగు మాయారావణుని చరిత్రమును వివరించెద.

పూర్వకథ సంపూర్ణము.

# విచిత్ర మైరావణ చరిత్రము.

కథా ప్రారంభము.



క॥ శ్రీకర సద్గుణ గణ ర
త్నాకర కరుణాలవాల – యలమేల్మంగాం
బాకాంత శేషగిరి వా –
సా, కంజదళాక్ష భక్త – జన సంరక్షా!

వ॥ దేవా! అవధరింపుము.

పూర్వోక్త ప్రకారంబున, శ్రీరామ చంద్రుని సంగరమునకుఁ దొడరి లంకా నాథుండైన దశవదనుండు బంధు, మిత్రా, మాత్య, సుత, సోదరులను, సకల సైన్యములను యుద్ధరంగంబునఁ గోలు పోయి మిక్కిలి చింతాక్రాంతుండై మంత్రి యగు ప్రహస్తునితో తన దుర్దశను గూర్చి దీనవదనుండై యిట్లనియె.

కథా సరణి–డౌరా

శ్రీకాంతా కాంతా సర్వేశ్వర – శేషాచల ధామా
లోకారాధ్య పరాత్పర తాపస – లోల భవ్యనామా—దేవా
అకటా యిప్పటి నాదుర్దశను ప్ర – హస్తా చూచితివే?
సకల విధంబులఁ జెందితి మహాక – ష్టములకు లోనైతి
నాకుం గల బలగంబు నెల్లమా – నవులు వానరులును
వీక మీరనని లోన వధించిరి – విధికృత మిట్లయ్యె.

ప్రహస్తా! నావారు సామాన్యులా? ఒక్కొక్కఁడే లోకమంత యును జయింపఁగల పరాక్రమ వంతులైయు, కాల విపర్యాసమున నల్పులైన నరవానరులచేఁ జిక్కి ప్రాణంబులు దొఱంగిరి. కుంభకర్ణుం డెంతటివాఁడు? ఇంద్రుని బంధించి తెచ్చి చెఱసాలలోఁ బెట్టిన మహాబల వంతుఁడు నాకుమారుం డింద్రజిత్తు సామాన్యుఁడా? నీ వెఱుంగనివాఁడవా? అతికాయ, మహాకాయ, విరూపాక్ష ధూమ్రాక్ష ప్రముఖు లల్పు లనఁదగిన వారలా? అంత వేసి వీరాగ్రేసరులు దుర్బలుల చందం బున సత్వంబు చెడి పోలికలనులో గూలిరి.

మఱియుం బేరు పొందిన వారైన, సర్వరోమ, వృశ్చికరోమ, నరాంతక, దేవాంతక, శుంభ, ప్రఘస, భాసకర్ణ, శుక, సారణ, శద, వికట బ్రహ్మశత్రు, ధ్వజగ్రీవ యుద్ధోన్మత్త, మత్త, రక్తరోమ, ఖరాస్య, శోణితాక్ష, పిశాచముఖ, ఘోర, యజ్ఞధ్వంసి, భయంక, రాగ్నివర్ణ, ఘాతుక, ద్విశిర, పంచహస్త, భీషణ, దుర్మద, శంకుకర్ణ, చండ, ప్రచండ, యుద్దండ, ఖడ్గరోమ, మహాబల, యూర్ధ్వనాస, సూకరానన, కుంభ, నికుంభ ప్రభృతులగు మహాశూరులు ససైన్య సవాహనులై సంగర భూమియందు గూలిరి. దైవబల సంపన్నులైయుండు శత్రువులను విపరీతకాల వశులమైన మనము జయించుట కలవి గాకున్నది. నేనన్నో త్రిలోక భయంకరుండను గదా? నాప్రతాప మెట్టిది. యివ్విధంబు నేను దీనదశను బొంది ప్రాణములను గోల్పడుట సంసిద్ధుఁడనై శోకించుచున్నాను. నావంటివాని కిటువంటి దుర్దశ గలుగవలసినదేనా? ఏవిషయంబునైనను నన్ను గూర్చి తక్కువగాఁ బలుకుటకు సాధ్య మగునా? చెప్పుము. ఉత్తమ మగు బ్రహ్మ కులములో బుట్టినాఁడను. ధన సంపత్తి లేని వాఁడనా? నాయన్నయైన కుబేరుఁడు నవనిధులుం గల వాఁడు. కావలసినంత ద్రవ్య మొసంగుచుండును. లోకమునొక్కమారుగా దిగ్రమింగ గలవాఁడైన కుంభకర్ణుఁడు నాకుతమ్ముఁడు. కుమారుఁడన్ననో మన యింద్రజిత్తు శక్రునిఁబట్టి బంధించినవాఁడు. నేను లోకులవలె గాక, పది తలలును, నిరువది చేతులుంగల మహా బలవంతుఁడను. నారథాశ్వములు శత్రువులకు జయింప నలవిగాని, నా యొద్దనుండు రాక్షసులు, మాయా రూపధారులై చరించుచు, యెంతటి బలవంతులనైనను నిముషములో నిర్మూలింప గలవారు. సమర్థులు. నా నివాసస్థాన మన్యులు ప్రవేశించుటకు సాధ్యముగాని సముద్ర మధ్యము. అయ్యో! ఎన్నివిధములఁ జాలి యుండినవాఁడ నయ్యును నన్నియు నిరుపయోగములై నాస్థితి యిటుల నేర్పడినది. ఎం... వలన? నాకు దైవబలము లేదయ్యె. ఎంతటి స్వబలము గలిగి యున్నను దైవబలము గలుగనియెడల ప్రయోజనము లేదని పెద్దలు బలుకుదురు. అది యిపుడు నా విషయమునఁ దార్కాణమైనది.

మంత్రివర్యా! ప్రహస్తా! ఇంక నేనేమిచేయుదును. శ్రీరాముడు యుద్ధ సన్నద్ధుండై నా రాకకై వేచియున్నాఁడు. కావున

నతనితో సంగరముచేసియే తీరవలయును. సమర మొనరించిన యెడల నమ్మహా వీరాగ్రేసరుని జయింపఁ గలననెడి నమ్మకము లేకున్నది. యుద్ధముఁ జేయకుండుట శూర ధర్మముగాదు. మఱియు యందఱును నన్ను పరిహసించి నవ్వుదురు. మిక్కిలి గౌరవముతో లోక భయంకరుండనై వర్తించిన నేనిపుడు హేళనకు పాత్రుఁడనై ప్రాణముల నాసించి వెన్నుజూపుటకు నాయుల్ల మొల్లకున్నది. దుర్మతియై విభీషణుండు నన్ను విడిచిపోయి పగవాని శరణుంజొచ్చి తన యుసురుల రక్షించుకొనుటయే గొప్పగానెంచి యిచ్చోటి మన రహస్య వర్తనంబంతయు విరోధికిఁ దెలుపుచున్నాఁడు. అందువలననే యింతటి చేటు వాటిల్లినది. ఇదియంతయు నా దురదృష్ట ఫలము గాని వేఱుగాదు. వినుము.

కథాశరణి – ఢోరా.

దుర్మతియైన విభీషణుండు పగ–తుని మరుగునఁజేరి
మర్మంబులు సర్వంబును దెలుపుచు–మనకు చేటుదెచ్చె
వారివీరి ననవేటికి ? వాఁడే–కారణ మింతకును
వైరముఁగొనినను వీడిపోయి యప–కారమునకుఁ దొడరి
కంకణమును గట్టెను ననుజెరుపం–గాక్రూరుండగుచు
సంకల్పము సిద్ధించువరకు నా–జడుఁడు కడఁకవిడఁడు.

పెద్దవాఁడను గదా? ప్రభుండను గదా? ఒకవేళ నుంత కోప గించి నంత మాత్రముననే, యన్నననెడి ప్రియంబును, రాజు ననెడి మరియాదయు నెంచక యలిగి మన జాతికి పరమ శత్రుండై యెత్తి వచ్చిన మనుష్యమాత్రుని, యారాముని శరణు జొచ్చుటకై తెగించి పోయిన యాఖలుని వివేకముననే మనవచ్చును? గొప్ప వంశమునఁ బుట్టి గొప్పవానికి తమ్ముఁడైన తాను సామాన్యునివలె నల్పుఁడైన వాని నాశ్రయించుటకుఁ బోవఁదగునా? సిగ్గుల చేటగుననుట యా బుద్ధిహీనునకు దోఁచక పోయినది. వాని నననేల నాకు చాలని కాలమగుటచే నందఱకును చెడుబుద్ధులు గలుగఁ దొడంగెను. తుది మెట్టుకు వచ్చినంతట పరితపించుటచే నేమి ప్రయోజనము గలుగును. కర్తవ్యమును మెలఁకువతో విచారించి యింకపై జరుగవలసిన విధానము నెఱింగి, మేలో, కీడో, యందువలన నేమిఫలము గలుగునో దాని

ననుభవింప వలయును. ఇదియే నా కడపటి సిద్ధాంతము—ప్రహస్తా! ఇంతకు మిక్కిలి యీస్థితిలో నేమిగలదు? చెప్పుము?'' అని కన్నుల నీరునించి దీనుండై పలికెను.

ప్రహస్తుండు రావణునకు నీతిఁ జెప్పుట.

లంకేశ్వరుండు దుఃఖాక్రాంతుఁడై పలుకుచున్నంత వరకును ప్రహస్తుం డట్టె యూరక వినుచుండి చెప్పి యైనంతట నించుక తడవు యోచింపుచున్నవాఁడై, తలయూఁచి, సమయ సందర్భంబుల నెఱిం గిన బుద్ధిమంతుఁ డగుటచే నయ్యసురేశ్వరునితో, తనవివేకం బేర్పడు లాగున నిట్లనియె.

ద్విపద.

దనుజేంద్ర కాలంబు-దప్పినవేళ। యనువుగా నెంచి కా-ర్యంబు లొనర్ప
వలయునుగాని తాఁ-ద్వరపడరాదు। తెలియక నెవఁడు వ-ర్తించినఁజెడును
అనరొప్పతరినల్పుఁ-డధికుఁడౌటయును। ఘనుఁడల్పుఁ డగుటయుఁ-గాల భేదమున
గలుగుచుండును గాన-గలఁగంగ తగదు। తలపునని ష్లైల తల్లడించెదవు
యిప్పటికర్తవ్య-మేర్పడనీకుఁ। జెప్పెద వినుము నీ-చింత యడంగు
''దశకంధరా! యీవ్య-థాకష్టదశకు। వశుఁడవై యివ్విధివందురవలదు,

రామచంద్రుండు సామాన్యమానవ మాత్రుండని నీవు తలఁచి యతనితో పోరొనరింపఁ గడంగితివి. ఆమహనీయుండు రాక్షస సంహా రార్థముగా నవతరించిన శ్రీమన్నారాయణుం డని బుద్ధిమంతులు చెప్పుచుండగా నేను వినియున్నాను. యీవిషయమును గూర్చి యప్పు డపుడును నీతోడ వచించుచుంటిని. కాని నామాటలు నీచెవులఁ జొరవయ్యెను. అహంభావమే నిన్నింతకుఁ దెచ్చినను, రాముఁడు మనుజుడే యైనయెడల నతం డొనరించిన పనుల నాలోచింపుము? నీవైనను మనుష్యులు చేయగల పని యొకటి యైనం గలదా? ఖర దూషణ ప్రముఖులను జంపెను. మహాబలశాలియగు వాలిని గూ ల్చెను. కోతులగుంపులను జేర్చుకొని సముద్రమునకు వారిధిఁ గట్టించి దాటి వచ్చి ప్రబలులైన నీసుత సోదర బంధు మిత్రులను రూపు మాపెను. యీపనులు మనుజుఁడు చేయ గలవియే యగునా? చెప్పుము? మహానవుఁ డిట్టి కార్యము లొనరింపఁ గలఁడు? ఇది

దలతోఁ బోరినను ప్రయోజనము లేకపోయినది. ఆవింతను దలంచిన నాశ్చర్యము గలుగుచున్నది. లోకంబుల నెందును నెదురులేనికడిమి మెఱసి ప్రతివీరభయంకరులై, నిరంకుశముగా వర్తించు మహాయోధులు మహాపరాక్రమవంతులు—కుంభకర్ణ, మేఘనాధ, అతికాయ, మహాకాయ, ధూమ్రాక్ష, యూపాక్ష, శుక, సారణ, సర్పరోమ, వృశ్చిరోమాదులు—వేయేల నెవరు పరాక్రమవంతు లని పేరెన్నికకెక్కి యుండిరో వారలందఱును మడిసిరి. సేనలన్ననో, సర్వంబును నడంగెను. నేనును, యీప్రహస్తుండును, మంత్రులగు మఱి కొందఱును, నల్పంబగు మూల బలంబును మిగిలి యుండెదము. తక్కంగల వారెల్లరును సమరాంగణంబునఁ గూలిరి. వింటివిగదా? జరిగిన చరిత్రమును. ఇంతటి యుపద్రవము గలుగుటకు మూలకారణమైన మఱియొక విషయమును జెప్ప మఱచితిని. అదియే యన్నిటిలోనను ముఖ్యమగు విశేషము దానిని సయితము నీకెఱింగించెద నాకర్ణింపుము.

నేను సీతను గొనివచ్చినంతట నాతమ్ముఁడైన విభీషుండు వచ్చి, మైధిలినిఁ గొని వచ్చుట యనర్థక మగుననియు, నయ్యువిదను గొని పోయి రామునకర్పించి యతనిని శరణుఁ జొరవలసినదనియు, నింకను నేవేవియో వెడనీతులు నాకు బోధింప నారంభించెను. అతనిపలుకులు విన్నంతట నాలో నాగ్రహము జనియించి యుగ్రుండనై, పాదతాడితుం జేసినాఁడను. ఆకారణంబున వాఁడు నాపై నలుకఁబూని రోషించి నన్ను విడిచిపోయి నాకు పగవాఁడైన యీ రామునికి శరణాగతుం డయ్యెను. అచటఁజేరి యిందలి మర్మంబులు రామునకెఱింగించుట కారంభించెను. ఆకారణంబున నెంత బలవంతుఁడనై యుండినను, యెన్నివిధంబులఁ బ్రయత్నించినను, రామలక్ష్మణులను, కపివీరులను జయించుటకు శక్యముగాకపోయినది. మహాసంకటమునఁ దగుల్కొని, నావారి నెల్లరను యుద్ధభూమి కర్పించి దారిగానక, శోకసాగరములో మునింగి తల్లడిల్లుచున్నాను. ఇంక రేపటి యుద్ధములో నేనును, రాముఁడును బోరాడవలసి యున్నది. జయాపజయములు భగవధాధీనములు. అయినను రోషముచే పోరవలసినదియే గాని గెలుపుగలుగు ననెడియాస నాలో నిసుమంతయైనను లేనేలేదు,

కథాసరణి-ద్విపద.

ఈ లంకారాజ్యమునేఁ గూలిన-నెవ్వరిపా లగునో
పాలించుటకై యెవ్వఁడు దీనికి-బ్రభుఁడై రాఁగలఁడో
యువనికి నామేడలు మనగళ్ళును-నిక్కవయగు నౌక్కో
యెవఁడెక్కునో నాసింహాసనమును-నింకమీఁద తాను
ఏపుణ్యాత్ముని లంకేశ్వరుఁడని-యెల్లరుఁ గొలిచెదరో
ప్రాపనిదిగ ధీశులు యేధన్యుని-ప్రస్తుతి సేయుదురో
యకటా! భోగాఁగన లెవ్వనిఁనిక-నాశ్రయింప గలరో
ఈకొఱలేని మహాభాగ్యంబున-కేఘనుఁడధి పతియో
ఎపుడును నేవిహరించు వనంబుల-నెవఁడు దిరుగునేమో
విపరీతంబుగ నాపిమ్మట నే-విధమున జరిగెడినో.

సఖా! మైరావణా! రాక్షసు లందఱును నశించిరి. అమరావతిని మించఁదగి, సమస్త భోగభాగ్య యుతమై యొప్పుచుండిన యీ లంకాపట్టణము పాడుపడి కాంతి విహీనమైనది. కాలము విపరీతమై మారిపోయినది. చూడుము—అధములు—మనుజులు—మనకాహారముగాఁ దగినవారు—ఔరా! కోతిగుంపులం గూర్చుకొని, సముద్రమును గట్టి, శత్రు భయంకరమైన యీ మహాపురంబును—ఈలంకను—ప్రతాప లంకేశ్వరుం డనఁ బ్రఖ్యాతిఁ గాంచిన నేనుపాలించుచుండెడి మహానగరంబును ముట్టడించి, పాడుచేసి, వీరాగ్రేసరులగు రాక్షసులననాయాసంబుగఁ బొరిగొనిరి. ఇది సామాన్యమగు కార్యమగునా! విపరీతకాలముగాక నిది మఱియేమగును? అయ్యో! ఏమి బ్రతుకు—ఇంక నెక్కడి సంతోషము?—జీవములుండియుం జచ్చినవాఁడనైతిని. పరితపించిన నేమి ఫలము గలుగును? నాస్థితియు, గతియు నిటుల నేర్పడినది. ముందు నేనుండిన రీతియును, నీవుండెడి విధంబునుం జూచి యెఱింగి యుండువాఁడవుగదా? ఇప్పటి నాదుర్దశ, యెట్టిదియో నీవు బుద్ధిమంతుఁడ వగుటచే గ్రహించియే యుందుదువు. ఆప త్సముద్రమున మునింగి, యసహాయుండనై యున్న యీసమయమున సాయ మొనరించి యుద్ధరింపుదువనెడి యాశతో—నమ్మకముతో—నిన్ను దలంచి, రావించి, నీకు ప్రయాసఁ గలిగించితిని. నీకై మన్నింపుము.

చ॥ చతురుఁడ వెట్టికార్యమునకుఁ-జాలినవాఁడవు యుక్తిశాలివా
తతబలశౌర్య యుక్తుఁడవు-ధైర్యయుతుండవు మాయకాఁడవ
ద్భుతములు నీదుకృత్యములు-పూనిననెంతటి కార్యమైననే
వెతయును లేకచేయఁగల-వీరుఁడ వెన్నఁగ శక్యమేనినుౝ.

నీవు నాదగు నమ్మిన మిత్రుండవు. అభిజ్ఞులు "మిత్రుండు నంబయు-మెలఁతయు సుతుఁడు"—అని లోకంబున వీర లీవరుస క్రమంబున నాదరుపుగా నుండువారని చెప్పియున్నారు. అటుల బలుకుటలో మొదట మిత్రునిఁ బేర్కొనిరి. ఏల? తన ప్రాణముల నైనను నర్పించి సన్మిత్రుండు చెలిమికానిని రక్షించువాఁడని దీని భావము. పాతాళ లంకాధిపా! నామైత్రిని చులకనఁ జేయక కరుణామతివై యీ విపత్సమయంబున నన్ను రక్షింపుము—పుణ్యముఁ గట్టుకొనుము--ప్రసిద్ధి కెక్కిన నావంశమును నింకనుం గొంతకాలము నశింపక నిలువరింపుము". అని శోకభాష్పంబు లిరువది కండ్లనుండి యు జొటజొటగా దీనముఖుండై, మానసముగరంగులాగున భోరున నేడ్చుచు, తటాలున లేచి మైరావణుని పదంబులపై వ్రాలెను.

వర్తమానం బంతయును మారు బలుకక వినుచుండిన యీ మైరావణుండు తన పదంబులపై దశాస్యుఁడు పడినంతట నతని యెడల మిక్కిలి జాలిఁబొంది, దిగ్గున గ్రుచ్చి లేవనెత్తి యోదార్చి గద్దియమీఁద గూర్చుండజేసెను. కాని, రావణునకు తాను చేయఁదగిన సహాయ మెట్టిదియో తోఁచక యాలోచనఁ జేయఁ దొడంగెను. బుద్ధిశాలియగు మైరావణునకుఁ, దశముఖుం డొనరించిన కార్యము యోగ్యమైనదని తోఁచలేదు. గొప్ప యపరాధ మొనరించి మహోపద్రవమును బొందుటకు పాలయ్యెనని స్పష్టముగా తెలిసికొని యెను. ఎంత జరుగవలయునో, యంతయును జరిగినది. కార్యము మించి వచ్చినది. యంత్య దశలోనున్నది. మిత్రుఁడు--బోరాని చుట్టము--మహా ప్రభుండై యుండినవాఁడు--నిరంకుశముగ వర్తించిన ఘనుండు--అతనికి సహాయముఁ జేయఁదగిన రీతి యెయ్యది? రక్షించు టెట్లు? డోలాం దోళిత చిత్తుండై యాలోచనఁ జేయఁ దొడంగెను. ఎంత యోచనఁ జేసినను, యుక్తమగు యోచన గుదురలేదు. మిత్రుని రీతిం గనిన నెక్కుడు జాలి బుట్టుచున్నది. చేసినపని యక్ర

మయ్యైనది. హీనస్థితిలో నున్నాఁడు. ఉద్ధరించుటకు దారి దోఁచ కున్నది. నిరాకరించుటకు మానసం బొప్పకున్నది. పాపము! అతం డేమి చేయును? కొంత తడ వాలోచించి తనలో "ఇతనికి జయము గలుగబోవునది లేదు. రామునిచేఁ జచ్చుట నిశ్చయము. యిప్పటి కైనను బుద్ధిఁ దెచ్చుకొని యా మహాపురుషుని నాశ్రయించినయెడల మేలు గలుగనే గాని వేఱువిధంబున నితండు మనఁజాలఁడు. నావలన నైనవరకును నితనికి నీతి బోధించి రామచంద్రు నాశ్రయించునట్లు చేయుటకుఁ బ్రయత్నించెద. నా యుపదేశంబును విని చేసెనేని సుఖ మొందఁగలఁడు. లేదేని దైవ సంకల్ప ప్రకారము జరుగఁగలదు. దాని కెవ రేమి చేయుదురు?"—అని నిశ్చయించి యిట్లనియె.

మైరావణుండు దశముఖునకు నీతిఁ జెప్పుట.

"పంక్తికంధరా! నీవు తెలిసిన వాఁడవయ్యుఁ దెలియని వాని చందమునఁ బ్రవర్తించి గొప్ప తప్పుజేసి కులమున కంతటికినిఁ జేటుఁ దెచ్చితివి. ఇది నీకెటుల యుచితమని తోఁచెనోగాని, నాకుఁ గాని, మఱి నావంటి వారికిఁగాని యోగ్యమగు పనిఁ జేసితివని చెప్పఁ దగి యుండలేదు. ఆ మహా పతివ్రతను—ఆ జనక రాజపుత్రుని—ఆసీతను గొనివచ్చి పురంబునఁ జేర్చుటయే నీకింతటి యనర్థము గలుగుటకు కారణమయ్యెను. నిప్పుక లోడిఁ గట్టినచో కాలకుండునా? చెట్టునెక్కి కూర్చుండిన కొమ్మనే నరుకుటకుఁ గడంగిన వానివలె నొనరించి నీకు నీవై యాపదఁ దెచ్చుకొంటివి. రామచంద్రుండు సామాన్య మను జుండనియు సీత సామాన్య స్త్రీయనియు నెంచి, రఘువర్యునిఁ బరిభ వించుటకై పరమ సాధ్వీ రత్నమైన యతని ధర్మ పత్నిని గొనివచ్చితి వని తోఁచుచున్నది. నీవు చేసిన కార్యము కొఱవితో తల గోకికొ నిన చందముగా నున్నది.

రావణా! రాముఁడు మానవుండు గాఁడు. అతండు దేవ హితార్థముగ దుష్టులగు రాక్షసులను సంహరించుటకై, మనుష్య రూ పంబున దశరథ నందనుండై యవతరించిన శ్రీమన్నారాయణుండు. సీతాదేవి మహాలక్ష్మి లక్ష్మణుఁడ నంతుఁడు. భరత శత్రుఘ్నులు శంఖచక్రములు. రాజచంద్రుఁడై యుదయించిన రాముని జయించు టకు నీ కకాదు. లోకంబులన్నియు నొక్కటిగా కూడి యెదిర్చినను

నతని జయింపజాలరు. పరంధాముని గెలుచుట కెవ్వరికి తరమగును? అజ్ఞాన వశుఁడవై యమ్మహానుభావునితో వైరము సాధింప నెంచితివి. ఎట్లు జయింపగలవు. కపులు సైనికులగుటయు, వారిధిఁ గట్టుటయు, మనుజు లాకోతులను గూడివచ్చి, లంకను, లంకలోని నీవారలనందఱను నాశమొనరించుటయు, సామాన్య కృత్యములా? మనుష్యులు చేయఁగల కార్యములా? ఇట్టి పనులను జూచియైనను నీవు దెలిసికొనలేవైతివి. అహంకారముతో ప్రవర్తించి చెడితివి. వివేకముగలవాఁడు యెదిరి బలంబును తన శక్తియును బరికించి తరంబని తోఁచిన నేయుద్ధమునకుఁ గడంగవలయును. త్వరపడి పోరాటమునకు దొడరిన యెడల దుఃఖ భాజనుండు గాక తప్పదు. దీనికి నీప్రవర్తనమే తార్కాణము. రాఘవేశ్వరుని చరిత్రంబును నేను మున్నేవిని యెఱింగియున్నాను.

అసురనాయకా! నీ తమ్ముఁడైన విభీషణుండు నీవలె గాక బుద్ధిశాలి యగుటచేతనే, దశరథ నందనుండు భగవంతుఁడనియు, నతనితో విరోధించుట హానికర మగుననియు నీకు బోధించెను. ఆ మాటల నాదరింపక పోవుటయు గాక యతని నవమానించితివి. తత్కారణంబున నింక నిచ్చట నుండిన చేటు దప్పదని తెలిసికొని యతండు పోయి రామచంద్రుని శరణుఁజొచ్చి యామహాత్ముని కరుణకుఁ బాత్రుఁడయ్యెను. నిన్ను విడిచిపోయి పగతుని మరువునఁ జేరెనని యిపుడతనిని నిందించెదవు. అతఁ డొనరించిన నేరమెయ్యది? చెప్పుము? చేసినదంతయు నీవే చేసి పరులయందు నేరము నారోపించెదవేల? రాముఁ డల్ప మానవుఁడనియు, నతని జయింప వచ్చుననియు దలంచెదు. అది కానిపని యని తెలిసి కొనుము. కాలము తప్పి వచ్చినపు డల్పుఁ డధికుడును, నధికుఁ డల్పుఁడు నగుచుండును. విధికృతంబు వేఱుగా నుండినపుడు హెచ్చు తక్కువలం గూర్చి యాలోచించుటచే ప్రయోజనము లేదు. నీళ్ళను తెగఁగొట్ట బూనిన సాధ్యమగునా? కార్చిచ్చును నోటితో నూదిన చల్లారునా? గాలినిపుడిపటఁబట్టి నిలుపుటకు శక్యమగునా? యికార్యము లెట్లు చేయుటకు కరముగాని వగునో యటులనే శ్రీరాముని నీవు జయింప బూనిన వృథా ప్రయాసయేగాని యీపని నెఱవేఱునది కాదు. అహంకృతిచే

బద్ధుండవై కులము నీరు గావించితివి. విభీషణుండు చెప్పిన
మంచి బుద్ధిని వినవైతివి. తుదకేమైనది. అందఱును యుద్ధభూమి
కర్పించి యల్లాడుటకు పాలైతివి.

ఇంతట నేనియు, పరమ మిత్రుఁడను, నీమేలును సదా కోరు
చుండు వాఁడను నగు నాసదుపదేశంబును నిరాకరింపక పాటింపుము.
పోయినవారు పోయినను, నీవైనను సౌఖ్యమొందఁ గలవు. ఇపుడు
చేయవలసిన దేమనఁగా, పతివ్రతా రత్నంబగు సీతాదేవిని కానుక
సహితంబుగాఁ గొని పోయి రామచంద్రున కర్పించి, తప్పిదమును
మని ప్రార్థించి యమ్మహాత్ముని నాశ్రయింపుము. "పగతుఁడుగదా?
ఏమి చేయునో" యని వెఱపును బొందవలదు. అతఁడు శరణాగత
వత్సలుఁడు. పరమశాంతుఁడు. దయాస్వరూపుడు. ఎంతటి యప
కృతిఁ జేసిన వానినైనను శరణుఁ జొచ్చిన వానిని రక్షించు
సుస్వభావము గలవాఁడు. దైత్యవల్లభా! అతనితో వైరముఁ బెట్టు
కొనవలదు. నీకు మేలు గలుగదు. ఆశ్రయించి బ్రతుకుము. నాప
లుకులు మన్నింపుము. ఇది నీవు క్షేమ మొందుటకుం దగిన యుత్తమ
మార్గము." అని పలుతెఱంగుల నుపదేశించెను.

రావణుండు మైరావణుని మాటలు నిరాకరించుట.

గుణవంతుఁడైన మైరావణుండు చెప్పిన మాటలు దశముఖునకు
రుచింపవయ్యె. కర్ణశూలములై తోఁచెను. ఆపలుకులయం దనాద
రమును, విసుగును నతిశయింపఁ దనలో "ఓహో! ఇదియా యితఁడు
నాకొనరించెడి సదుపదేశము. దీనికొఱకా? యితని రావించితిని.
ఏదైన సహాయముఁ జేయఁగలఁడని యెంచి తలంచి రప్పించిన వచ్చి
ధర్మంబులును, నీతులును బోధించుట కారంభించెను. ఈధర్మంబులు
యీనీతులు నేనెఱుంగ కుండెదనా? పగవాని నాశ్రయించి బ్రతుకు
మని చెప్పి తన యశక్తతను వెల్లడించెను. బాగు బాగు! ఇటుల
చేయఁ దలంచిన యెడల నితఁ డేమిటికి? నే నే యొనరింపఁ జాల
నైతినా? ఇసీ! ఈ పలుకులు నావంటి పరువు గల జగద్విఖ్యాత
చరితుండు వినఁదగినవి కావు. ఈ రావణుండు—ఈత్రిలోక కంటకుఁ
డైన దశముఖుండు—ఈ యద్వితీయ పరాక్రమోపేతుఁడగు లంకే
శ్వరుండు—దుర్బలుం డగువాఁడు చెప్పిన పేద మాటలు విని వెఱచి

యశక్తునివలె నరిగి రాముని నాశ్రయింపఁ దలఁతునా? సూర్యచంద్రులు గతిఁ దప్పినను నానిశ్చయమునకు విరోధముగా ప్రవర్తించువాఁడనుగాను" అని తలంచి, యమితమైన రోషంబును, నాగ్రహంబునుం గదిరి కలఁతనొందిన చిత్తముతో మైరావణునిపై రూక్షవీక్షణంబులు సారించి ముఖంబులు జేగురింపగా, వికటంబుగా నవ్వి తలయూఁచుచు యుగ్రభాషణంబుల నిట్లనియె.

"బళీ! మైరావణా! ఏమి చెప్పితివి? నీపలుకులు విన్నంతట నాలో నాశ్చర్యంబు జనించినది. నీవంటి పరమమిత్రుండైనవాఁడు కష్టసమయమున నిటువంటి మాటలేనా? చెప్పఁదగినవి. ఈలాగునఁ బలుకుదువని నేను తలంపనేలేదు. లోకపాలురను నిర్జించి, దేవతల నోడించి మునుల నలంచి యెందును నెదురు లేని పరాక్రమంబున త్రిజగద్భయంకరుండనై, ప్రతాప లంకేశ్వరుండ ననెడిబిరుదువహించి విఖ్యాతిఁ జెందిన వాఁడను—ఇట్టి నేను—అవక్ర విక్రమ వంతుఁడనగు నేను—పగతురకు గుండె గాలమై వర్తించు నేను—నావారికిని, నాకును, నపయశంబు గలుగునట్లుగ నధముఁడైన యొక్క మనుష్యునకు వెఱచియుం బేదచందమునఁ బోయి శరణాగతుండ నగుటయా చేయవలసిన కార్యము.. నన్ను జూచి పదుగురును నవ్వకుందురా? ఛీ! ఛీ! అది యేమి బ్రతుకు? పరాక్రమ వంతుఁడగు రణశూరుఁడు, ప్రాణములున్నంత వరకును బోరాడవలయును గాని, పిరికిపందయై పగవానియొద్ద కరిగి ప్రాణభీతిచే పాదాక్రాంతుడుగాఁ దగునా? ఇది నావంటి శౌర్యవంతునకుఁ జెప్పవలసిన పద్ధతిగాదు. ఈపనిని నేను చేయదగినదియును గాదు. మైరావణా! నేను మూఢుఁడననియు, నెవరెట్లుచెప్పిననువిని యవ్విధంబునఁ జేయువాఁడననియు ఇపు డాపదలోఁ దగుల్కొని యున్నందునభయమొంది నీ మాటల నాదరింతుననియు నెంచి కాఁబోలు తోఁచినట్లెల్లనుం జెప్పితివి. ఎంతటి సక్షోభఁ జేసినాఁడవు?

శా॥ న్యాయాన్యాయములన్ వచించుటకు నై-ధ్యానించిరావింపలే
దోయీ! నిన్ను;—మహావిపత్సమయమై-యుంటన్ సమర్థుండవౌ
మాయావేదివిగాన యీతరిని నామైత్రిన్ మదిన్ నిల్పియే
సాయంబైన నొనర్తువేమొ యని యూ-సంజెంది రప్పించితిన్,

ఉ॥ నీవెఱింగించి నట్టివగు-నీతులు గీతులు నేనెఱుంగనే ?
వావిరినోరు నొవ్వఁ దెగి-పల్కెదవట్టె వినంగఁ జాలమై
రావణ ! యీదశాననుఁడు-రాముని వేడునె ? నిన్నువంటిమే
ధావిసిగా నటంచిపుడె-దండలపోసి యుపన్యసించెదే ?

చాలు చాలు. ఇంక నీప్రసంగమును జాలించి, నేర్పుగలదేని యేదైన సహాయముఁ జేయుము. లేదేని యింత దూరము నీవు వచ్చినందున బొడమిన ప్రయాసను దలంపక యరుగుదెంచిన దారిం బట్టిపొమ్ము. మిత్రుండవును, చుట్టమును నగుటచే మన్నించితి గాని. నీవు గాక మఱి యెవ్వఁడైన నాతో యిటువంటి మాటలుబలికి యుండినచో వాని శిరంబును నాచేతి వాలున కెరఁ గావించి యుండు దును. ముల్లోకములును తల్లక్రిందులైనను, నా మేన ప్రాణము లుండు వరకును నేను రామచంద్రునకు సీత నొసంగనొల్లను. ఇంక నాశ్రయింపఁ జాలనని వేఱుగఁ జెప్పవలయునా ? నా దృఢనిశ్చయమును జెప్పితిని. నీ మాటల నాదరించి చెప్పినట్లు చేయఁ దలంపనైతినని నీలో వగపుగాని నాయెడలనూయగాని చెందవలదు. నీకు ప్రయాసఁ గలిగించినందుకై చింతించుచున్నాను. ఇంక బొమ్ము పొ''మ్మని తిరస్కరించి కోపంబుతోఁ బలికెను.

రావణుండు చెప్పిన కడపటి మాటలను విన్నంతట పాతాళ లంకేశున కతని మూర్ఖపు పట్టుదలను గూర్చి మిక్కిలి వ్యాకులము గలిగెను. అతఁడు తనలో ''ఓహో ! ఇతని కిది చెడుకాలము, మంచి మాటల నెవరు చెప్పినను విననొల్లడు. కార్యాకార్యవివేచనా శక్తిలేనివాఁడు తనకుఁ దోచినట్లు చేయునేగాని హితోక్తులట్టివానికి రుచింపవు. వ్యాధిగ్రస్తున కపథ్య దోషంబునుం బోలె యితనికి దుర్బుద్ధులు బుట్టి విడువకున్నవి. చెడ నుండువానికి మంచి జెప్పినను విరోధంబుగాఁ దోఁచును. ఇటువంటివాఁడు వర్ధిల్లునా ! కీటకము వేరుఁ దొలఁచి తరువును నొందించిన లాగున, వీని దుర్గుణంబులు ప్రాణహానిం గలిగింప నున్నవి. ఈమూఢుం డింకనుం దనకు గలుగఁబోయెడి కీడును దెలిసికొనలేక, యహంకారముతో వర్తించుచున్నాఁడు. ఎన్నివిధముల సద్బోధఁజేసినను నేమి ప్రయోజనము మేలు కీడుల నాలోచించు వానికి గదా ? సదుపదేశమువలన ఫలము

గలుగును. చచ్చుటకు కాలము తటస్థించి యున్నవాని నెవఁడు రక్షింపఁగలఁడు. అయ్యో! ఈరావణుండు జీవింపఁజాలఁడు. సాక్షాంతకుఁడై యవతరించిన రఘుకులేశ్వరుని నితఁడా? జయింపగలవాఁడు? ఇటువంటివారు వేయిమంది రావణులైనను నమ్మహానుభావునకు లెక్కలోని వారలగుదురా? ఇంక నితఁడు రామచంద్రునిచేఁ జచ్చుట నిశ్చయము తప్పదు. ఇంక నాకు కర్తవ్యమెయ్యది? ఈ దశాననుం డన్ననో పరమ మిత్రుఁడు. దగ్గఱచుట్టము. ఇపుడు గొప్ప విపద్దశను జెందియున్నాఁడు. ఏదేనియుం దనకు నేను సహాయముఁ జేయుదునని తలంపున నన్నుఁ దలంచి రావించినాఁడు. ఇతఁడు బ్రతికినను చచ్చినను, నావలన నైనంతవరకు నేదైన నుపకారమును జేసెదను. నాశక్తి కొలందిని నితని నుద్ధరించుటకుఁ బ్రయత్నించి చూచెదను గాక. సన్మిత్రుండు తన చెలికాని కొక యాపద బొసఁగినపుడు జీవములనైన మారొడ్డి మిత్రుని రక్షించుట ధర్మమగును. చేయవలసిన ప్రయత్నమంతయును జేసినంతట దైవానుకూలము లేక కడఁకు ఫలింపదయ్యేనేని యది మన దోషము గానేరదు. బ్రతుకఁడని విడువక రోగికి ప్రాణములు పోవువరకును నౌషధము నుపయోగింప వలయునని యభిజ్ఞులు చెప్పుదురు. కాఁబట్టి యితఁడు నిహతుఁడగునని విడువకూడదు. ఇంతదూరము వచ్చి యేమి చేసినట్లు? నేనొనరించిన మహాత్కార్యమెయ్యది? ఈరావణునకు నాపై కోపము గలుగనేమిటికి? దైవ సంకల్పప్రకారము జరుగును గాక. నాకుఁ దోఁచిన సహాయముఁ జేయుదు గాక" అని యాలోచించి దశవదనునిం జూచి యిట్లనియె.

"దనుజేశ్వరా! పంక్తివదనా! నాపలుకులు విన్నంతట నీకు నాపై కోపమును, ననాదర భావమునుం గలిగెనని నీ చూపులవలనను, మాటలవలనను నాబుద్ధికిఁ దోఁచుచున్నది. ఇవ్విధంబున నేనేలఁ జెప్పితినో గ్రహింపలేక యాగ్రహించినచో ప్రయోజన మేమి గలుగును? నీవు దుర్బలుండవనియు, నసమర్థుఁడవనియు నెంచి, నిన్ను గూర్చి యీరీతిని జెప్పినవాఁడను గాను సుమీ! మఱి యేల నందువా? బలీయుండైన రఘునందనుండు నీకు బ్రతి వీరుఁడై యున్నాఁడు. అతనితో సమరముఁ జేసి యింతవరకును మిక్కిలి నష్ట కష్టములు

బొందియున్నాఁడవు. కావున నింకమీఁదట యుద్ధ మొనరించు విషమున పట్టుదలయు ధైర్యమును గలిగి యుండెదవో, భీతిల్లి నిరాశ నొంది యెట్లైనఁ బ్రాణములు దక్కిన చాలునని సంగర విముఖుండవై యుండెదవో, దృఢముగా నీతలంపును దెలిసికొన వలయున నెడి యుద్దేశముతో యీతీరున నీకు వెఱపు బుట్టించు మాటలు బలికితిని. అసహాయ శూరుండవు గదా? యిటువంటి నుడువులకు నీవు చలింతువా? నీ దృఢబుద్ధియు, శౌర్య ధైర్యములును, కార్యమునందలి పట్టుదలయును నిపుడు బాగుగాఁ దెలిసికొంటిని. నాసంశయము తీరి పోయినది. జయాపజయంబుల మాటవేఱు. ఆ విషయమును మన మిపుడు నిర్ణయింపఁ జాలము. అది దైవాధీనము. తలంచిన పనిని పూర్తి విడువక నేరవేర్పఁ గడంగుటయే మనకు ముఖ్యము. నీవు దృఢసంకల్పముతోడనే యున్నావు. ఇది నాకు మిగుల సంతోషకరము. నాబోటివార మెందఱమో నీకు బంధువులుగను, మిత్రులుగను, నాప్తులుగను నున్నారము. ఇంక నీకు బలంబునఁగాని, సహాయమునఁగాని, మఱి యే విషయమునఁగాని యేల కొఱఁతగలుగును! ఆనరులను, వానరుల గెలుచుట యొక గొప్ప కార్యమగునా? అది యట్లుండనిమ్ము. ఆప్తుఁడననియు, మిత్రుఁడననియు తలంచి నన్ను రావించి నా సహాయమును గోరి, నీకుఁ గలిగిన కష్ట సుఖములన్నియు దెలియఁ బలికితివి. నేను సహాయ మొనర్తునని దృఢముగా నమ్మితివి. యిటువంటి నిష్కళంక చిత్తుఁడైన సఖునకు సంకటము గలిగినపుడు తోడ్పడి నివారింపఁ గడంగకుండినచో యీజీవిత మేమిటికి? "శరీర మాద్యంఖలు ధర్మ సాధన" మ్మనియును "పరోపకారార్థ మిదంశరీర" మ్మనియును ధర్మశాస్త్రములు బలుకుచున్నవి. ఒకరి కుపకరింపలేక దేహమును బెంచుకొని బ్రతుకువాని జీవితము నిరర్థకమైనది, కాఁబట్టి నాశక్తి కొలందిని నీకు సహాయము జేయుటకు నిశ్చయించినాను. నామేన ప్రాణము లున్నంతవరకును రాముడు జయించుననుట కల్ల. అతని ప్రాణములను దక్కించుకొనిన పిమ్మట గదా? జయము మాట. నేను పూనినంతట రామలక్ష్మణులు బ్రతికి యుండుటయును, సంగరముఁ జేయుటయును, నిన్ను జయించి సీతను గొనిపోవుటయును జరిగెడి పనులు గావని నీలో గట్టిగా నమ్ముము.

ఇంక సంశయముగాని భయముగాని తలంపున నిడవలదు. అన్నటి కిని నేనున్నాఁడను. జయము నొందినట్లే భావించి వ్యాకులంబు విడిచి నిబ్బరంబున నుండుము. దశాననా! నేను చేయఁబోయెడి కార్యంబు తెఱంగును దెలుపుచున్నాను వినుము" అని యతనికి ధైర్యంబును సంతోషమును గలుగునట్లు బలికి యిట్లనియె.

మైరావణుండు రామలక్ష్మణులఁ జంపుటకుఁ బ్రతిజ్ఞఁ జేయుట.

కథాసరణి-ఢోరా.

రాక్షసవల్లభ! వినుమా! నేనీ-రాత్రి నెటుల నైన
వృక్షచరులను విభీషణు నెంతయు-వింత గగికురించి
రాజసుతుల పాతాళ పురమునకు-రయమునఁ గొనిపోయి
యోజనచట నుండెడి కాళికి రవి-యుదయమునకు మున్నె
బలిగావించెద నిక్కంబిది నా-ప్రజ్ఞను గనుగొనుము
కలఁగక ధైర్యంబున నుండుము దశ-కంధర యికనీవు
నిను గెలిపించెద నెట్లైనను నే-ననుమానింపకుము
నను నీవెఱుఁగని వాఁడవె? తెలియదె?, నా నేరుపు నీకు.

రామలక్ష్మణులను బొరిగొని నిన్ను గెలిపించుట నాకొక గొప్ప కార్యమని తలంపకుము. నా మాటలు నమ్ముము. ముమ్మాటికిని నమ్ముము. ఇదిగో! ప్రమాణముఁ జేసి చెప్పుచున్నాను"—అనిగట్టి గాఁజెప్పి చేతిలో చేయిఁబెట్టి ప్రమాణ మొనరించెను. అపుడు సంతోషము మించి దశకంఠుని ముఖంబులు వికసించెను. మైరావణుండు చేయఁబూనిన కార్యము తప్పక నెరవేఱఁగలదనెడి నమ్మిక రావణునకు దృఢముగాఁగలిగెను. కావున నతం డుత్సాహమునుబొంది, అపుడే తాను రామచంద్రుని జయించి, ధరాసుతను తనవశముఁ జేసి కొనినట్లు విశ్వసించుకొనెను. తటాలున ధరించియున్న వెలలేని తన రత్నహారమును దీసి, మైరావణుని మెడలో వైచి యతని నెంతయు గౌరవించి "పాతాళ లంకేశ్వరా! మిత్రుఁడనదగిన వాఁడవుగాని యన్యులుగారు. నా స్నేహమును పాటించి యీ యాపదవేళ కరుణామతివై, నన్ను రక్షించుటకు యత్నించి వాగ్దాన మొనరించిన పుణ్యవంతుఁడవైన నీకు నేనేమి మరుమేలు చేయఁగలను? ఏమి

చేసి నీ ఋణముఁదీర్పు కోఁగలను ? నారాజ్య మంతయును నీకొసంగి ననుం జాలదని తలంచుచున్నాను. బహుమతు లొసరించి నిన్ను తృప్తిఁబొందించుటకు తరముగాదు. కాని, నీయందుగలభక్తికి గుఱుతుగా, నిదె నీపాదంబులకు మ్రొక్కుచున్నాను" అని చెప్పి ప్రణమిల్లి కౌఁగలించెను.

పరమానందంబును బొంది, దశముఖుం డవ్విధంబునకుఁ గల ప్రియంబు నెఱింగించుటయు, మాయ రావణుండు సంతసించి "దశవదనా ! నేఁటిరాత్రి దశరథ నందనులం బొరిగొని, రేపటిదిన మిచ్చటికి వచ్చి యాశుభవార్తను నీకుఁ జెప్పెదను. నా ప్రయత్నమునకుం దగిన పన్నుగడలను నిశ్చయించుకొనవలసియున్నది. ఇంక నేను బోయివచ్చెద ననుజ్ఞ యొసంగు మనుటయు "మిత్రమా! నిన్ను పూర్ణముగా నమ్మియున్నాను. ప్రయాసయనక యేవిధముననైనను, నన్ను రక్షింపుము. ఇంతకు మిక్కిలి నేనేదియును నీకుఁ జెప్పఁ జాలను. నీయత్నంబు సఫలమగును గాక. పోయిరమ్ము. గడియ లెన్నుచు నీశుభమైన రాక కెదురుచూచుండెదను" అనియనుమతించుటయు, యతని వీడ్కొని, కార్యాలోచన మగ్నమానసుండై మైరావణుండు తన పురంబునకుఁ బోయెను.

అతఁ డరిగినంతట దశాస్యుఁడు మంత్రినిఁ జూచి "ప్రహస్తా! మాయావర్తనంబున నసమానుఁడగు మైరావణుండు తనవాగ్దానమును చెల్లింపఁగలడఁని నమ్ముచున్నాను. ఈపని యతనికి పెద్దదిగాదు. తలంచిన నెంతటి పనినైనను నెరవేర్పఁగల శక్తిమంతుఁడు గదా! ఏమనెదవు? నీ బుద్ధి కెటుల దోఁచుచున్నది?" యనిన, ప్రహస్తుండు తలయూఁచుచు "ఔను! సామాన్యుఁడుగాఁడు పట్టుదలయును, సామర్థ్యమును గలవాఁడు. నీపట్ల నతని కెక్కుడైన ప్రియంబును గౌరవమును గలిగియుండును. చెప్పినంతయుం జేయక విడువఁడు. నీకు మంచికాల మొనగూడినట్లు తోఁచుచున్నది. అధైర్యమును విడిచి, శాంతచిత్తుండవై సంతోషముతో నుండు"—మని పలికి యతనికి సంతుష్టిఁ గలిగించెను. అంతట నయ్యసురపతి యతనిఁ బోవఁ బనిచి, తాను తన యంతఃపురంబున కరిగెను.

యుద్ధభూమిలో విభీషణుఁడు సుగ్రీవాదులతో సంభాషించుట.

రావణునియొద్ద ననుమతిగొని మైరావణుఁడటఁ బోయిన పిమ్మట కొంత తడవునకు బ్రొద్దు గ్రుంకినది. పక్షులు తమ తమ గూండ్లకుఁ జేరుచుండెను. అంతంతకుఁ జీకటు లతిశయించి, ప్రపంచము గాఢాంధకార బంధురంబైనది. మింట నక్షత్రములు వజ్రములవలె మెఱయఁ దొడంగెను. ఆ సమయంబున సమరభూమిలో, వానరయోధులు విశ్రాంతినొంది, యొండొరులునాఁడు రావణుండు సంగరమునకు వచ్చి, రామచంద్రుని శరంబుల ధాటికి నిలువలేక పాఱిపోయి లంకాపురంబులోఁ జొచ్చుటయు, నతఁడు మరల రాకుండుటయుం బ్రస్తావించి మాటలాడుకొనుచు "ఎట్లును రేపటిదినము రాఘవేశ్వరుండు దశముఖునిఁ జంపుట నిశ్చయము. అతనికాలము నేఁటితోనే చెల్లిపోయినది" అని ప్రసగించుకొనుచుండిరి.

తత్సమయమున, మేధావియు, గుణవంతుఁడగు విభీషణుండు, సుగ్రీవాంగద జాంబవత్ప్రముఖులున్న కెడకు వచ్చుటయు, వార లతనిం జూచి, సగౌరవముగా, "విభీషణా! రమ్ము! నేఁడు నీ ముఖంబున దైన్యలక్షణంబులు గనుపట్టుచున్నవేల? ఉత్సాహము లేకుండుట కేమి కారము? ఏదైన విశేషము గలదా?" అని యడిగిన కపివరులతో దీనంబుగా విభీషణుం డిట్లనియె.

ద్విపద.

వినుఁడు నేనొక గొప్ప-విషయంబు నొకటి। విని నామదినిఁ జాల-వెఱఁ [గొంది యిపుడు
చెచ్చెర నదిమీకుఁ జెప్పుటకొఱకు-వచ్చితిఁ గష్టంబు-వాటిల్ల గలదు
అదియెట్టిదనిన నేఁడవ నిజాభువిని। నెదిరిపోర లే-కెంతయు నొచ్చి
పరుగెత్తిపోయి యా-పంక్తిముఖుండు। పురములోఁ జొచ్చియా-పుత్రలను [మంత్రులను
రావించి తనకు నే-ర్పడిన బన్నంబు। భూవర సుతులను-బొరిగొనరామి
నసహాయుఁడై చావ-నైయుంటఁ దెలిపి। ఈసమయంబున-నినకులోత్తముల
నేనెట్లు గెలువఁగా-నేర్తునుజెపుడ। యేవెరవును దోఁచ-దేమిసేయుదును.

అని దుఃఖాక్రాంతుఁడై పలికి, యందఱను పొలికలనికర్పించి, యొంటరివాఁడనై యున్న నాకుం దగిన యోచనఁ దెలుపుఁడని యడిగెనట. అపుడు ప్రహస్తుండు "మాయలాఁడైన మహా సమర్థుఁడును పాతాళ లంకాధిపతియు నగు మైరావణుని రప్పించి యతనిం బ్రార్థింపుము నీకతండు పరమ మిత్రుండు గాన, నెటుల నేనియు నీకష్టమును నివారించి యుద్ధరించు"—నని యుపాయంబు జెప్పెనఁట. దశముఖుండు మైరావణుని ధ్యానించెనఁట, అతండు ప్రత్యక్షుండై, రావించిన కారణము నడిగిన రావణుండు తనకు సంభవించిన యుపద్రవమును వివరించి, "రామలక్ష్మణుల వలన గలుగు కీడును దప్పించి రక్షింపు" మని పాదంబులపైఁబడి ప్రార్థించెనఁట. వాఁడు కనికరించి, ఈరాత్రి మనల నేమరించి దాశరథులం గొని పోయి, తన నివాసంబగు పాతాళ లంకలోని భద్రకాళికి సూర్యోదయ మగుటకు పూర్వము సంహరించి బలిసేయునట్లు వాగ్దానముఁ జేసి చేత చేయిడి ప్రయాణ మొనరించి పోయెనఁట. ఈ వృత్తాంత మంతయును, నలయనెడి నాపుత్రిక మఱుగున నుండి వినుచుండి, భయంబుఁజెంది, యన్యులకు దెలియకుండు విధంబున నాయొద్దకు పరుగున వచ్చి యెఱిగించి యిపుడే పోయినది. ఈ సమాచారము విన్నది మొదలు నాలో నధికమగు వ్యాకులము చింతయును నతిశయించి, యేమిచేయుటకును నుపాయంబు మీతో నాలోచనఁజేసిగాని, నిశ్చయించుటకు వలనుగాదని యెంచి వచ్చినాఁడను.

వానరోత్తములారా! ఆమైరావణుం సామాన్యుఁడు గాఁడు. మాయాప్రవర్తమున వానికి సమానులులేరు. ధైర్యశౌర్య, బలంబులందు మిక్కిలి యధికుండు. తలంచిన కార్యమును నెరవేర్పక విడువఁడు. రావణునకు ప్రాణసఖుండగుట వలన నతనికి తానొసంగిన వాగ్దత్తమును చెల్లింపక మానఁడు. వానిశక్తి యసదృశమగుటను నేనెఱుందును. కావుననే యింత భయమును బొంది కర్తవ్యమును యోచనఁ జేయుటకై వచ్చితిని. ఆదుర్మార్గునివలన పుణ్యావర్తనులగు రామలక్ష్మణులకు కీడు గలుగకుండు లాగున మనము కడుజాగరూకులమై కాచి యుండవలయును. పగలెల్లను సమరం బొనరించువారగుటచే దశరథనందనులు శ్రమ పరిహారణార్థముగా శయనించి నిద్రించు

చున్నారు. చూచి వచ్చితిని. వారినిద్రకు భంగము గలిగింపక మనము కన్నిడియప్రమత్తులమై గాచికొని యుండవలయును. పెక్కు టక్కు లొనరించి మనల నేమరించి రాజపుత్రులను గొనిపోవును. వారు వాని బారిం జిక్కకుండునట్లు చేయజాల మైతిమేని మహోపద్రవము గలుగుట నిశ్చయము. రామలక్ష్మణులం గోల్పోయిన వారమగు దుము'' అని చెప్పెను. దాశరథులకునుం దమకునుం బ్రాణతుల్యుం డైన విభీషణుండు భయభ్రాంతుండై యవ్విధమునం బలుకుటయు విని, సుగ్రీవాది వనచర వీరులు మిక్కిలి భీతిల్లి, కర్తవ్యము దోంచక తత్త ఱింపం దొడంగిరి.

జాంబవంతుండు విభీషణుని నుపాయంబడుగుట.

అవ్విధమున విభీషణుండు నుడివిన విని యందఱును దిగులొంది యుండగా, పెద్దవాండైన జాంబవంతుం డాయసురోత్తముని జూచి "సుగుణభూషణా! విభీషణా! ఇంకనెట్లు? మాయావియగు మైరావ ణునకుం జిక్కనీయక, నిద్రాభంగముం జేయక రఘువీరులను మన మేలాగున రక్షింపంగలము. దీనికిం దగిన యుపాయము మాకుం దోంచకున్నది. కార్యాకార్య వివేచన సమర్థుండవును, రామలక్ష్మ ణులకు పరమ భక్తుండవునైన నీవే యామహాత్ములకే కీడును గలుగ కుండునట్లు తగిన యుక్తిం జింతించి తెలుపుము. మేమెల్లరమును నీయాజ్ఞాబద్ధులమై యేవిధంబున నొనరింపుం డనెదవో యాలాగున గావించెదము. ఎన్నికష్టము లొదవినను దశరథ పుత్రుల కెట్టి కష్ట మును వాటిల్లకుండునట్లు చేయవలయును. ఆలోచనం జేసి తగిన వెర వును జింతించి శీఘ్రముగా నెఱింగింపు''మని యడిగెను. అపుడయ్యా సురవరశేఖరుం డాలోచించి యిట్లనియె.

కపివరులారా! టక్కరియైన మైరావణుండు రావణునకుం జెప్పిన మాటం జెల్లించుకొనుటకై, యేసమయమున, నేవిధంబున వచ్చి మనల నేమరించి రామలక్ష్మణులం గొనిపోవునో చెప్పుటకు శక్యముగాదు. సూర్యోదయ మగునంతవరకును మనము రామలక్ష్మణులంగాచి యుం డవలయును. ఈ మహాత్కార్యమును మనలో నంజనీపుత్రుండు దక్క మఱి యెవ్వరివలనను గానేరదు. సమర్థుండును, బలవంతుండును, పుణ్యుండునగు నతండు పూనెనేని యికార్యము కొనసాగగలదు.

మన మందఅమును హనుమంతునకు సహాయులమై యుండి, యాదు రాత్మునకు రాజపుత్రులుచేఁ జిక్కకుండులాగున రక్షింపవచ్చును. అతండు సమ్మతింపఁడేని , మనకు సాధ్యముగాదు. కార్యము చెడిపో వును. పిమ్మట నెంత చింతించినను ప్రయోజనము లేదు. కాఁబట్టి వాయునందనుని ప్రార్థించి పురికొల్పుఁడు. శుభంబు చేకురును'' అని చెప్పెను.

ఈప్రకారము విభీషణుండు వలుకుట నగచర వీరులెల్లరు నొక్క మొగంబై హనుమంతుని సమీపించి, వృత్తాంతము సర్వము నతని కెఱింగించి. ''ఆంజనేయా ! నీవు రామచంద్రునకు పరమ భక్తుం డవు. అమ్మహాత్ముని కార్యములను మిక్కిలి శ్రద్ధతో నిర్వహించి ప్రఖ్యాతి నొందినవాఁడవు. బలమునను, సామర్థ్యమునను, నీకు నీవస మానుఁడవు. సీతాన్వేషణమునకై వెడలి సముద్రమునుదాటి లంకఁ జొచ్చి పతివ్రతా శిరోమణియైన జనకనందనను బొడఁగని, యక్ష యాదులగు పెక్కండ్రు రాక్షసులంజంపి యప్పురంబును గాల్చి రావ ణునికి భయము బుట్టించి వచ్చిన మహా సమర్థుండవు. యుద్ధరంగ మునఁ బడిన సౌమిత్రిని బ్రతికించుటకై ద్రోణగిరినుండి సంజీవిందెచ్చు టకుఁ బోవువేళ దారిలో. నీ ప్రయాణమునకు భంగముఁ గలిగింపఁ దొడరిన మాయావియైన కాలనేమిని జంపి రయంబున నరిగి యోష ధులందెచ్చి లక్ష్మణుని జీవించునట్లు చేసితివి. ఇదివరకును రామునకు నీవు గావించినవి మహోపకారము లేయైనను నన్నిటికంటెను గొప్పదగు సహాయ మిపుడు చేయవలసిన సమయము తటస్థించినది. ఈసమయ మున నశ్రద్ధగా నుండినయెడల పాపాత్ముఁడైన మైరావణుండు వారలఁ గొనిపోయి పొరిగొనుట నిశ్చయము. ఆ పుణ్యస్వరూపులు మృతు లైనచో మన మిందఱముండియు బ్రయోజనమేమి గలుగును ? వాయు నందనా ! మా ప్రార్థన నంగీకరించి నృపనందనులను రక్షింపఁ గడం గుము. నీ యిష్టానుసారముగ మేము వర్తించెదము. నీవు సామా న్యుఁడవు గావనుటయు, నీశక్తి యెట్టిదగుటయు మేమెఱుంగని వారము గాము. కాల యాపనము జేయరాదు. తగిన యుక్తి నాలోచించి ప్రభువులు రక్కసుని బారిం బడకుండునట్లు చేసి కీర్తిఁ బొందుము'' అని ప్రార్థించిరి.

చూచి యైనను నీవతం డెట్టివాఁడో తెలిసికొనలే వైతివి. ఇప్పటి కైనను మనము మన బుద్ధినివిని యోగించి తగిన తెఱంగున మెలం గుట యుక్తము. మహాప్రభో! నామాటలు నిరాకరింపక విని యా దరింపుము. జరిగినంత వరకును జరిగిపోయినది. గతమును గుఱించి యింక చింతింపవలదు. ఇంక సీతారామచంద్రునితో వైరముకూడదు. అవమానకరమైన కార్యంబని తలంపక, పరమసాధ్వియైన జనకనందన నతని కర్పించి, నేరమును మన్నింప ప్రార్థించి, యతని కృపకు పాత్రుం డవై స్నేహభావంబున శేషించిన రాక్షసులను రక్షించుకొని సుఖం బున వర్తింపుము. "మహావిరోధియైన యారఘువరుండు చెంతకుఁ బోయినచో మన్నించునో మన్నింపఁడో"—యని నీవు సంశయింప కుము. ఆమహాత్ముఁడు శరణాగత వత్సలుఁడు. దయామయుఁడు ఎంతటి చంపఁదగిన శత్రుండై యున్నను, శరణుఁ జొచ్చిన యెడల నాదరించి మన్నించు దయాస్వభావుఁడు. శాంతమూర్తి, నీవు తనకు పగతుఁడై యున్నను, నీతమ్ముఁడు— విభీషణుండు— పోయి శరణు వేడిన మాత్రమున నెంతయుఁ బ్రియంబుతో గౌరవించి, నిజ సోద రునివలె నతనిని చెంతఁ బెట్టుకొని యాదరించుచున్నాఁడు.

మఱియు దండకాటవిలో నుండునపుడు, మహాపకారి యగు కాకాసురునిపై బ్రహ్మాస్త్రమును బ్రయోగింపఁగా, నయ్యసురుండు వెఱచి దాని బారింబడక తప్పించు కొనుటకై, పరుగెత్తి, బ్రహ్మయొ ద్దకును శివునియొద్దకునుం బోయి బోయి రక్షింపుఁడని ప్రార్థించి. వారు మాకు శక్యముగాదని చెప్పినందున నిరాశుండై త్రిలోకంబులును దిరి గియు రక్షకులఁగానక దీనుండై వచ్చి యారాఘువేశ్వరుని శరణుఁజొచ్చి తన తప్పుగాచి "ప్రాణదానంబుఁ జేయు" మని వేడిన కరుణించి, యమోఘమైన యాబాణమునకు వాని కుడికన్ను నెరగా నిప్పించి మన్నిం చి యణిచెనని వినియున్నారము. అంతటి పరమ సుగుణ నిధియగు రాముఁడు దగ్గఱ కరిగినచో నిన్ను మిక్కిలి గౌరవించును గాని, పగ సాధింపఁ దలంపఁడు.

అసురవల్లభా! అన్యథా తలంపు విడిచి, సీతను దోడ్కొని పోయి యతని కర్పింపుము. నీకులమును, నీప్రాణములను రక్షించు కొని, మాబోంట్ల కాదరవై, సౌఖ్యంబున మనుటకు యిదియె తగిన

మార్గము. ఇటులగాక, యతనితో పగ సాధించుటయే నీయుద్దేశ మగునేని, చింతింప వలసినదియే లేదు. సామర్థ్యము గలిగియున్నంత వరకును బోరాడుము. దైవసంకల్పం బేలాగున నుండునో యావిధంబున జరుగఁ గలదు. నీమేలుఁ గోరవలసిన వాఁడను, మఱియు మంత్రిగ నుండువాఁడను నగుటచే హాని వృద్ధులను దలంచి నాకు తోఁచిన మాటలను జెప్పినాఁడను. ఈలాగున పేద మాటలు చెప్పితి నని నాపైఁ గినియకుము. కార్యజ్ఞుఁడైన మంత్రి, కాలవ్యత్యాస మేర్పడినపుడు, సమయానుగుణ్యముగు రీతి నాలోచించి, కష్టనష్టములనైనను లెక్క సేయక యనువగు భంగిఁ దనప్రభువునకు మేలు గలుగు మార్గంబును దెలుప వలసినది విధి యగుటచే నీకింత దూరము జెప్పినాఁడ. నాపలుకుల నర్థములుగాఁ దోఁచినయెడల నటుపై దేవరచిత్తము'' అనియెను.

రావణుం డంతటి తెలియని బుద్ధిహీనుఁడా? అశక్తుఁడా? కాదుకాదు. అన్నివిషయంబులందును జాలినవాఁడే! కాని, అయిన? పాపము! అతఁడేమి చేయును. కాలవ్యత్యాసమువలన, నేకార్యమును ననుకూలింపదయ్యె. ఇపు డమ్మహావీరుండు బంగారు పట్టినను, మట్టి యగుచున్నది. వివేకియైన ప్రహస్తుని పలుకులు సమయోచితములును, ధర్మయుక్తములును నగుననియు, యోగ్యుఁడగు మంత్రి యాపత్సమయమున తన ప్రభువునకుఁ జెప్పవలసియున్నవిధ మటువంటిదియే యనియు, నతం డెఱుంగునుగాని, అటుల తెలిసియున్నను, నభిమాన మతనిని విడువకున్నందున, ప్రహస్తుండు చెప్పినలాగునఁ జేయుటకు తలంపు గలుగదయ్యెను. ప్రాణములు పోయినను, పరునిశరణు జొచ్చుటకా వీరాగ్రేసరునకు సమ్మతము గాకుండెను. ''తన పట్టుదలను విడువరాదనియు, నెన్ని యుపాయములచేతనైనను, బ్రతికి యున్నంత వరకును సంగర మొనరించి, జయమును బొందుటయో, లేక చచ్చుటయో, ఈరెంటిలో నొకటి జరుగుట తప్ప వేఱుయోచన చేయఁగూడదని యతని దృఢాభిప్రాయము అటుల నగుటచే మంత్రి మాటలు విని మొగంబున వెడఁగునగవు దనరగా నతనిఁ గనుంగొని కనభావం బేర్పడు లాగున నిట్లనియె.

ద్విపద.

మంత్రివర్యా ! బుద్ధిమంతుఁడౌ రాజ్యతంత్రజ్ఞుఁడౌ నరహి-తంబహితంబు
దెలిసిపల్కెడిదియ యీ-తెఱఁగైనఁగాని। కలుగదాతలఁపు ని-క్కంబుగ [వినుము
భూతపంచకము వే-ల్పులు నవగ్రహము। లాతతబలశాలులైన రాక్షసుల్-
లాదిగాభువనత్రయంబునఁ గలుగు । నెల్లరు నాయాజ్ఞయేయాజ్ఞగాఁగ
జడిసిపేరును విన్నఁ-జచ్చినట్లడఁగి । విడువకసేవగా-వింపగా నెదురు
లేక వర్తించు బ-లీయుండనేను । తేఁకువచెడి నేఁడు-దీనునిభంగి
నల్పుఁడౌ మనుజుని-నాశ్రయింపుదునె?। క్రొల్పులిడస్సినఁ-గొఱుకునేపిల్లు
లోఁగిమా నెడుసీటి-లోననేనుంగు । దాగమునుంగుచందమున నేఁబోయి
నలుగురుననుజూచి-నవ్వఁగాసిగ్గు । దలఁపునవీడియా-దశరథాత్మజుని
శరణుజొచ్చుటకెట్లు-సమ్మతింపుదును । పరువులేనట్టినా-బ్రతుకేల చెపుమ.

ప్రహస్తా! ఏమికీడు వాటిల్లినను కలుగునుగాక. సీత నొసంగి రాముని శరణు జొచ్చుటకు నేను సమ్మతింపను. జీవము లున్నవరకును బోరాడుదునుగాని, హీనునివలె నాశ్రయింపనొల్లను. సంగరమున జయించితినేని జనకజనుగూడి సౌఖ్య మనుభవించెదను, చచ్చినయెడల, నీవు చెప్పినచొప్పున నతండు పరంధాముఁడే యైనచో యట్టివానిచే మరణము గలుగుటయు శుభస్కరమే యగును. శాశ్వత మోక్షపదవి చేకూరును. బంధు మిత్ర పుత్రాదులెల్లరుం బోయి నంతట. నాప్రాణంబును పెద్దగానెంచి భీతినొంది రామునకు సీత నర్పించు హీనుండనుగాను. ఇంక నీమాటలు చాలించి యుద్ధమున మనము జయించుటకుం దగిన యుపాయం బేదేనియుం దోఁచినచో దానిం జెప్పుము. వేరెయ్యదియుం బలుకవలదు—అని చెప్పెను.

ప్రహస్తుం డతని దృఢ నిశ్చయంబును దెలిసికొని యేమి చెప్పినను, నింక ప్రయోజనము గలుగదనియు, కర్మాధీనమగు ఫలమనుభవింపక యెవనికిఁగాని తప్పదనియు, పైత్యరోగికి మధుర పదార్థంబువలె, చెడ నుండువానికి హితోక్తులు వెగటుగా దోఁచుననియు తనలోఁ దలంచి యించుక తడ వాలోచనఁ జేసి యిట్లనియె.

"అసురనాథా! ఇప్పుడు కలిగియున్న యిక్కట్టును దలంచి నేను యివ్విధమున జెప్పితినిగాని, నీ ప్రతాపమును, గౌరవమును, సామర్థ్యమును నెఱుంగక పలుకలేదు. త్రిలోక భయంకరుండవగు నీయసామాన్య పరాక్రమమును దెలియనివాఁడనా? అద్వితీయ శూరాగ్రేసరుండవు. ప్రతాప లంకేశ్వరుండవను బిరుదు నీకే తగును. ఇంతటి గొప్పవాఁడవైన నీకు దైవము తోడ్పాటు గాకున్న కారణమున నపజయము చేకూరెనుగదా? యని చింతనొంది యేయుపాయము చేతగాని యీసమయమున సంకటమును తప్పించుకొని మంచికాల మేర్పడినపుడే పనినైననుం జేయవచ్చుననెడి తలంపుతో, రామునకు సీత నొసంగి యాశ్రయింపుమంటిని. ఆలాగున జేయుటకు నీకు సమ్మతము గాదని చెప్పితివి. సరి! దీనిఁగూర్చి, యొక మంచియుపాయమును జింతించినాను. మొదట దోఁచలేదు. గాని యిపుడా విషయము జ్ఞప్తికి వచ్చినది. నీవు జయమొందుటకు దీనిని మించిన మార్గము మఱియొకటి యుండదని దృఢముగా జెప్పుచున్నాను. ఆ సదుపాయము దెలిపెదను. సావధాన చిత్తుండవై యాకర్ణింపుము.

సీ॥ పరమమిత్రుఁడనీకు–ప్రాణసమానుండు
ఘనుఁడుపాతాళలం–కావిభుండు
మయశంబరేంద్ర జి–న్మారీచముఖ్యుల
మఱపింపఁ జాలినమాయకాఁడు
తలఁచెనా? తొడరియెం–తటికార్యమైనను
నవలీలఁగావించు–నట్టివాఁడు
చాతుర్యవంతుండు–సమయానుగుణ్యంబు
గాయుక్తులనుబన్న–గలుగుమేటి.

గీ॥ ధైర్యవిక్రమసాహస–ధనుఁడతండు।
నిన్ను గెలుపించు నసురేంద్ర! నిశ్చయంబు
పరగమైరావణునినీదు–భావమందుఁ।
దలఁపుమీవచ్చి యతఁడువం–తనుదొలంచు.

ఇది మంచి యోచన. నీకై యతండు ప్రాణంబులనైన నర్పించుటకు సంసిద్ధముగ నుండువాఁడు. నీ యడరుఁదీర్చి విజయంబు గలి

గింపనేర్తును" అని పలికిన యమ్మాటలువిని దశవదనుం డుప్పొంగి, ముఖంబులు వికసింపగా, "ప్రహస్తా! మంత్రి పదవికిని, సమయో చితమైన యోచనం జెప్పుటకును నీవే తగినవాఁడవు సుమా! మేలు మేలు. మంచి యాలోచనం దెలిపితివి. ఇప్పటివరకును నాలో నియ్యాలోచనయే గలుగలేదు. తలంపునకుఁ దెచ్చి పుణ్యము గట్టు కొంటివి. ఆ మైరావణుండు సహాయుం డయ్యెనేని, యిటువంటి రాములను గీములను వేయిమంది వచ్చినను నేను గణింపను. తృణ ప్రాయముగా నెంచి జయింపగలను. ఇపుడే మైరావణునిఁ దలంచి రప్పించి, సాయముఁ జేయుమని ప్రార్థించెదను గాక" అని పలికి పంక్తి ముఖుండు సఖుండగు పాతాళ లంకేశ్వరుని తనలో ధ్యాన ముఁ గావించెను.

గీ॥ దశముఖుం డివ్విధంబునఁ దలఁచుటయును ।
నెఱిఁగి మైరావణుండపు-డేమి కార్య
మొదవెనోయని యెంచి స-మ్మదమెలర్ప ।
తక్షణంబున నెదుటఁ బ్ర-త్యక్షమయ్యె.

సాక్షాత్కరించిన ప్రాణ సఖుడైన మైరావణునిం గాంచి లంకే శుండు పరమానంద మగ్న మానసుండై దిగ్గన డిగ్గి యెదుర్కొని ప్రియంబు గదురఁ గౌగలించి యుచితాసనంబున నాసీనుం జేసి కుశల ప్రశ్నంబుఁ గావించిన, నతండు తన క్షేమంబు నెఱింగించి, "ప్రతాప లంకేశ్వరా! నీకును, నీవారికినిం గుశలంబగదా? యే కొఱంతయును గలుగదు గదా? నిన్నుఁ జూచి పెద్ద కాలమైనది సుమీ! ఇప్పటి కైనను నాపై తలంపు గలిగినది మిక్కిలి సంతోషము. మంచిది గాని నన్నుఁ దలంచి యిపుడు రావించుటకు నిమిత్తమెయ్యది? పలుకు" మని యడిగెను.

మైరావణుం డావిధంబున నడుగుటయు, రావణునకు తత్పూ ర్వము గలిగియుండిన ముఖవికాసము దొలంగి, దైన్య లక్షణములం కురించెను. తేజంబు దొలంగి దుఃఖ మతిశయించెను. పలుకుటకు నోరు రాకుండెను. కన్నులనుండి శోకబాష్ప బిందువు లొక్కొక్క టిగా జాఱి పడుచుండెను. తలవాంచి మౌనముతో క్రింద జూచుచు కూర్చుండియున్న యతని తీరుంజూచి యతం డేదియో గొప్ప యాప

దను జెంది. దాని కోటరుగానే తలంచి రావించి యుండునిని తనలో నూహించి యతనితో "పుణ్య జనేశ్వరా! ఏల చింతించెదవు? ఇంతటి దుఃఖము నీకు గలుగుటకుఁ గారణ మెట్టిది? దేవతలు గర్వించి నిన్ను గణింపకున్నవారా? సోదరులు నీతో మారొడ్డి పోరాటమునకుఁ గడంగిరా? కొడుకులు నీయాజ్ఞ పాటింపక వర్తించుచున్నారా? శత్రువు లెవ్వరైనను గుట్రలు పన్ని నీకును నీరాజ్యమునకును కీడు వాటిల్లఁ జేసి యలంచుచున్నారా? చండ శాసనుండవు గదా? యిటువంటి సంకటము నీకు తటస్థించునా? కలుగవని నా నమ్మకము. అయిన? ఇంత వ్యాకులము గలుగుట కేదియో కారణము గలిగి యుండవల యునని తోఁచుచున్నది. మహా ధైర్యవంతుఁడవైన నీవు శోక సంతప్త మానసుండ వగుటకుం గల నిమిత్తము సామాన్యమైనదిగా నుండదని తలంచెద. మిత్రమా! దాపక, కలిగినది కలిగినట్లు నిజముఁ జెప్పుము. నీ వ్యాకులం బడంగుట కేదైనను నేను సహాయముఁ జేయఁ గలిగి యున్నయెడల, ప్రాణముల నేనియు నర్పించి నీ చింత నివారించుటకుఁ బ్రయత్నించెద. అది సాధ్యమా? అసాధ్యమా? యనుట చెప్పినంతటగదా? తెలియును. వివేకియైనవాఁడు కష్టములు సంభవించి నపుడు ధైర్యమును విడువకూడదు. ధైర్య సాహసములు విడిచిన వాని కేకార్యమును చేకూడదని పెద్దలు చెప్పుదురు. కాఁబట్టి పట్టుదలతో ధైర్యముతో పనులుచేయఁ గడంగవలయును. అలాగున ప్రయత్నించినపు డది ఫలవంతము గాదిచో నది మనవలఁన గలిగిన దోషముకాదు. మఱి యేమగును? దైవము తోడ్పడలేదని తలంప వలయును. ఆలోచింపుదము గాక. విషయమేదియో వివరింపు" మని యెత్తి యెత్తి యడిగెను.

రావణుండు మైరావణునకు బదులు చెప్పఁదలంచి, మించివచ్చుచున్న దుఃఖము నతి ప్రయత్నముతో నడంచుకొని, కన్నుల నీరును చేల చెఱంగుతోఁ దుడిచికొనుచు, కందివాడియున్న మొగంబులను మీఁదికెత్తి మిత్రునివంక దృష్టులు నిగుడించి హీనస్వరంబుతో నిట్లనియె.

సీ॥ చెలికాఁడ యేమని-చెప్పుదు నిపుడునా
కడరిన దుర్దశ-యాపదయును

నధిక దుఃఖంబుతో-నల్లాడుచున్నాఁడ
నదియేమి కారణం-బన్న వినుము
పరగ నయోధ్యాన-గరమును బాలించు
దశరథునకు నం-దనుఁడు రాము
డనువాఁడు భార్యయు-ననుజుండు వెంటరా
తండ్రిపంపున రాజ-ధానివిడిచి.

గీ॥ తపసియుంబోలె వేషంబుఁ-దాల్చివచ్చి।
చిత్రకూటాద్రి దాపున-జేరి యచట
పంచవటియందు తానొక్క-పర్ణశాలఁ।
గట్టుకొని నిల్చి కాలంబుఁ-గడపుచుండె.

దండకారణ్య వాసులైన మును లాశ్రయించుటం జేసి, వారికి గలుగుచున్న రాక్షస బాధలు నివారించుటకు కంకణముఁగట్టి పెక్కండ్రు రక్కసులను వధించెను. అది యెఱింగి జనస్థానంబున నుండిన మన ఖరదూషణ త్రిశిరులుచూచి, మనవారి కతనివలనఁ గలుగుచున్న యడరు నివారింపనెంచి యెదిరించి పోరాటంబునకు దొడంగుటయు, సైన్యయుతముగా వారినిసంహరించి నాచెల్లెలైన శూర్పణఖ ముక్కునుం జెవులును గోసి విరూపిణిం గావించి పంపెను. నే నా విషయంబును దెలిసికొని యాగ్రహమునొంది, మారీచ సహాయుండనై యతఁడున్నయెడ కరిగి, మోసగించి యారాముని భార్యయైన జనకరాజ నందనను గొనివచ్చి యిచట నశోకవనమందు బెట్టి రాక్షస స్త్రీలను గాపుగా నుంచినాడను.

భార్యను గానక రాముండు వెదకుచు ఋష్యమూక పర్వతమునకు వచ్చి, యన్నచే తరుమఁబడి యాగిరిపై వసించుచుండిన సుగ్రీవునితోఁ సఖ్యముఁజేసి, యతని యగ్రజుని వాలినిఁ జంపి, కిష్కింధకు సుగ్రీవుని రాజుఁగావించి వాని సహాయంబుగాఁ గొని, వానరబలగంబుం గూర్చుకొని సముద్రమునకు వారిధిఁగట్టి తరించి వచ్చి యీలంకాపురంబును ముట్టడించెను. నేను లెక్కసేయక సమరంబునకుం గడంగితిని. అది యేమి మాయమో, యెట్టి విపరీత కాలమో గాని, యలంతులైన యాకోతులను, నాయకులైన దశరథ నందనులను జయించుటకు సాధ్యము గాదయ్యెను. వెనుదీయక నేనెంత పట్టు

సాధారణముగా స్తోత్ర ప్రియుండైన హనుమంతుఁడు, కపివరు లందరును దన శక్తినిగూర్చి ప్రశంసించుటయు నుప్పొంగి వారలంగని "ఎట్లూ? ఓహో! మైరావణుఁడా?—రామలక్ష్మణులనా?—కొనిపోయి పోరిగొనునా?—ఆశ్చర్య మాశ్చర్యము. ఈ యంజనానందనుండు— ఈ వాయుపుత్రుండు—ఈ యసహాయ శూరుండైన హనుమంతుండు, బ్రతికియుండఁగా యొక ముక్కిడి రక్కసుండు, రఘుకుల పుంగవులం గొనిపోవుటయు, చంపుటయు సంభవించునా? అది యెట్లు జరుగునో చూచెదఁ గాక. వాని మహిమ యెటువంటిదియో దెలిసికొనెదను. దీనికై మీరు వెఱవవలదు. మీరు నేను చెప్పినట్లు చేసిన చాలును. అన్నిటికిని నేనున్నాఁడను" అని రొమ్ముదట్టి కడు నుగ్రముగా బలికి, కర్తవ్యంబు దెలుపువాఁడై మరల నిట్లనియె.

సీ॥ వనచరోత్తములార!-వాలంబుఁ బెంచినే
గట్టిగా రామ-లక్ష్మణుల చుట్టు
పాతాళమున నుండి-పైని తారామండ
లంబువరకు నద్భు-తంబు గాఁగ
గాలియైనను జొరఁ-గా సందు లేకుండు
రీతిని కోట ని-ర్మించి చిన్న
దారి యేర్పడఁ జేసి-తలఁగక వాకిటఁ
గూర్చుండి యుండెద-కునికి పడక.

గీ॥ సారెసారెకు నుడువగ-మీరుగూడి
గాచి జాగ్రతతోడ దు-ర్గంబుఁదిరిగి
వచ్చిపోవుచు నుండంగ-వలయునుండి
మఱియు వినుఁడొక్క పద్ధతి-మరపులేక

మనలో విభీషణుండు కోటనుచుట్టి వచ్చినపు డంతయు లోపలి కరిగి, రామలక్ష్మణులు సుఖముగ నిద్రించుచుండెదరా? లేదా యని చూచి వచ్చి యా విషయమును నాతోఁజెప్పి పోవుచుండవలయును, వాలముతోఁ గోటఁగట్టి వాకిటఁ గూర్చుండియుండువాడ నగుటచే నేను కదలుటకు వలనుగాదు. కాఁబట్టి రఘుకుల వీరులక్షేమమును నాతో చెప్పుచుండ వలయును. ఇవ్విధంబున నొనరించిన యెడల నెంతటి సమర్థుఁడైనను, నెంతటి మాయకాఁడైనను మైరావణుండు

దాశరథుల గొనిపోవఁ జాలఁడు. వాఁడే యననేల! త్రినేత్రునకుఁ గూడ సాధ్యముగాదు.'' అని చెప్పిన నందఱును సంతసించి యతండు చెప్పినట్లు చేయుటకు సంసిద్ధు లైయుండిరి. అంతట నసమాన శక్తి సంపన్నుండును, రామభక్తుండునగు హనుమంతుఁ డా రాజనందనుల సంరక్షణకుం గడంగి, తన తోకనుబెంచి, యడుగునను మీఁదను, ప్రక్కలందును చీమయైనఁ జొచ్చుటకు వలను గాకుండులాగున దట్టముగా వారిచుట్టును కోటనుగట్టి చిన్నవాకిలి గలుగఁజేసి యట నప్రమత్తుండై తాను గూర్చుండెె. వనచర వీరులును, విభీషణుండు మాటిమాటికిని చుట్టును గస్తు దిరిగి వచ్చుచుండిరి. ఒక్కొకసారి చుట్టి వచ్చినపుడును విభీషణుఁడు లోపలికిఁబోయి, రామలక్ష్మణులం జూచి, ''సుఖముగా నిద్రించుచున్నారు. ఆంజనేయా! మైరావణుండు కడు మోసగాఁడు. మాయావి. వాని టక్కులను దెలిసికొనుట మిక్కిలి కష్టము. అప్రమత్తుడవై యుండవలయుఁ జుమీ'' అని హెచ్చరికఁజేసి పోవుచుండెను.

ఇవ్విధంబున వానరయోధులు, రామలక్ష్మణుల సంరక్షణార్థమై సకల ప్రయత్నములు నొనరించి కన్ను గలిగి కాచియుండిరి. అప్పటికి రాత్రి మొదటిజాము గడచినది. ఇచట యుద్ధ భూమియందలి వృత్తాంత మిట్లుండఁగా, దశాననుకు వాగ్దానముఁ జేసిపోయిన మైరావణుండు తన పంతమును నెరవేర్చుకొననెంచి, సూచీముఖ, దీర్ఘ దంతులనెడి యిరువురు మంత్రులంబిలిచి, చేయవలసిన విధంబును గఱపి రామలక్ష్మణులం దెచ్చుటకై, వారిని, లంకాపుర సమీపంబునంగల యుద్ధభూమికి ప్రయాణముఁజేసెను.

మైరావణుని మంత్రి లిరువురును నతిరయంబున నేగి యుద్ధ భూమింజేరి రామలక్ష్మణుల నంతటను వెదకి, వారు గానఁబడకుండుటయు సంశయించి యచ్చోట నింతయగు కోట యుండుటంగని, వానరులు దశరథాత్మజుల నక్కోటలోనునిచి రక్షించుచున్నారని యూహించి, యందుఁ బ్రవేశింపనెంచి, యేవైపునను సందులేక యొక చిన్న వాకిలి యుండుటయు, నచ్చోట నంజనీనందనుండు కావలియుంగాంచి, యతని మోసగించి లోపలికిఁ బోవుటకు వెరవుగానక, యెటులనైన నంత్రము జేసి ప్రవేశింపవలయునని యెంచి, తమవలన నెటీన పట్టును

బ్రయత్నించిరి గాని యిసుమంతయు వారి తలంపు ఫలింపదయ్యె. సూచీముఖుండు తన నిడుపైన ముక్కును వాలపు చుట్టలలో నిరికించి రంధ్ర మొనరింపఁ గడంగెను. పటుక్కున వాని ముక్కు విఱిగిపోయి, నెత్తురుగారఁ దొడంగినది.

ఆబాధకు సహింపలేక, వాడు వాపోవుచు వచ్చి యాచెంత రక్తముచే తడిసిన ముఖముతోఁ గూర్చుండి యేడ్చుచున్న దీర్ఘదంతునిం జూచెను. సూచీముఖుఁడు వాని గతిఁగని యచ్చెరువొంది "మిత్రుఁడా! ఏమీ? నీకును నాకుఁ గలిగిన దుర్దశయే సంభవించినదా?" అని యడిగెను. వాడు ప్రయత్నంబున దుఃఖంబు నడంచుకొని "అయ్యో! నాకష్టము నేమని చెప్పుదును? పాతాళమువరకును నడుగుభాగమునకును, నక్షత్రమండలంబు దనుక మీఁది వైపునను బోయి చూచితి. సూది జొప్పించుటకైనను యీ కోటకు సందు గనుపడఁలేదు. నాపండ్ల నిరికించి గంటించి సందు జేయవలయునని నెడి తలంపుతో, దంతములను మహా ప్రయాశతోఁ జొప్పించితిఁగాని, యెట్లో తటాలున బిగిసికొనిపోయి నాపండ్లు యెంత గాలాగినను నూడిరాక నాముందరిపండ్లు రెండును విరిగి యీగతి పట్టినది దైవమా! యని నొప్పి కల్లాడుచు, నీరాకకై వేచి యిచ్చోట గూర్చుంటిని. అబ్బబ్బ! ఎంతబాధ యెంతబాధ! ఓర్వ రాకున్నది" అని గద్గద స్వరముతోఁ బలికెను.

సూచీముఖుండును నటులనే తనకుఁ గలిగిన యాపదనుగూర్చి చెప్పి "చేసినపని యింతవట్టు చాలును. ఊపిరి యుండిన నుప్పు నమ్ముకొని జీవింపవచ్చును. ఇది మనవలన నయ్యెడి పనిగాదు. ఈకార్యమునకుఁ గడంగితిమేని మఱియు నెట్టి కష్టములు సంభవించునో తెలియదు. మైరావణుని కొలువు లేకుండినను కొదువగాదు. పోయి యీవృత్తాంతము నతనికిఁ జెప్పుదము రమ్ము. పిమ్మట నతని యిష్టప్రకారము జేసికొనుము గాక" అనియెను. అంతట వారు పాతాళ లంకాపురంబునకుఁ బోయిరి.

ఇట్లు దీర్ఘదంత యిచీముఖులు నెత్తురు గారుచున్న వికారపు ముఖములతోఁబోయి పాతాళలంకఁ జొచ్చి మైరావణుని సన్నిధియందు నిలిచిన, వారలున్నతీరును, దుఃఖంబునుం జూచి యతఁ డాశ్చర్యానుఁ

జెంది "ఏమిా! ఏల శోకించెదరు? పండ్లును ముక్కునుం బోయిన కారణ మెయ్యది? ఈదుర్దశ యెందువలనఁగలిగినది?" అని ప్రశ్నించెను. వార లతనిఁజూచి రాల్పడిన కంఠధ్వనితో నిట్లని విన్నవించిరి.

ద్విపద.

ఏమని చెప్పను-మిపుడు నీతోడ। మేము బొంది నమితి మిారిన వెతలు
నీయాజ్ఞ తలదాల్చి-నృపసుతులున్న। యాయుద్ధభూమికి-నరిగిచూచితిమి
అచ్చోట హనుమంతుఁ-డనెడి వానరుఁడు। పెచ్చుగాఁ వాలంబుఁ-బెంచి [దిట్టముగ
కోట నిర్మించిరా-కోమరులనందు। చాటుగాఁ జేర్చి హె-చ్చరిక తోడాను
వాకిటఁ గూర్చుండి-వదలకున్నాఁడు। జోకదక్కినవారు-చుట్టును గస్తు
తిరుగుచున్నారు పదింబదిగాఁగ। కరువవిమైన న-క్కడ కోటఁజొరఁగ
తరముగాకున్నది-దైత్యేంద్రవినుము। మరలిరాఁగూరక రాగ-మదిలేకయెట్టి
వెరవున నేనియు-వెడవెడ సందు। పరికించిలోఁ జొచ్చి-భానువంశజుల
గొనిరాగ మాశక్తి కొలఁదిం బ్రయత్న। మొనరించి నాశిక-యునుదంత [ములును
తోఁకచుట్టలలోన దూర్చితి మపుడు। భీకరంబుగ చుట్ట-బిగిసెన త్తరిని.

ఎంత ప్రయత్నించినను నూడిరాక ముక్కును పండ్లునుందునిగిపోయి యత్యంతమగు బాధకు లోనగుటయెగాక యీవికారరూపంబు లేర్పడినవి. మహాప్రభో! ఈశ్వరునకైనను వాలపు కోటలోఁ జొచ్చి రామలక్ష్మణులం బట్టి తెచ్చుటకు సాధ్యముగాదు. ఆకోతి తోఁకతో నంత దృఢముగా కోటను గట్టిన విధమును జూడగా నాశ్చర్యము గలుగును. అప్రమత్తులై యందఱును కావలిగా యున్నారు. ఈ కార్యమును మేము జేయ జాలము. మమ్ము మన్నింప వలయునని ప్రార్థించుచున్నారము"—అని పలికిరి.

మైరావణుండు వారు చెప్పిన వృత్తాంతమును విని వారికిఁ గలిగిన యాపదను జూచి "యసమర్థులగుటచే యిటువంటికష్టమును బొంది"—రని తనలో భావించి యూరట మాటలచేవారికి దుఃఖోపశమనఁ గావించి వీడ్కొలిపి, కర్తవ్యమును గూర్చి యాలోచింప నారంభించెను. యుద్ధభూమిలో తన తలంచిన కార్యమునకు భంగ

ముగ గావింపఁబడి యుండెడి యేర్పాటులఁ దలంచి ఇట్లని నిశ్చయించెను.

శా॥ ఔ॰ గాకింతయు నవ్విభీషణుని కృ-త్యంబే యగుఁ గాక నిక్క మే
లోఁగో నేనును బంక్తికంఠుఁడును బో-లంజేరి భాషించుచో
భాగంబందున నుండెడి యెవ్వఁడో విన్-వాఁడేగి చెప్పెందగన్
మాగుట్టాతఁ డెఱింగి యవ్విధిని ని-ర్మాణంబుఁ జేయించెతాన్.

మ॥ అగుగాకేమి మునింగిపోయినది? మా-యావర్తినై యుండునే
వగవంగాఁ దగునే? కపిప్రకరముల్-వంచించి యెట్లేనియా
జగతీనాయక పుత్రయుగ్మమున వ-శ్యం బీడకుం దెచ్చి యీ
నగరం బందలి భద్రకాళికను వాం-దం జంపి యర్పించెదన్.

అని దృఢనిశ్చయం బొనరించి తడవుఁ జేయరాదని యెంచి; వలయు సాధనంబులు గొని యొంటరియై లంకాపుర సమీపంబు నందలి సమరభూమిం బ్రవేశించి తనరాక దెలియకుండునట్లు కొంత దూరమున నిలిచి యచ్చటనుండు రీతిని చూచుచుండెను. తోఁక తో హనుమంతుఁడు కట్టియున్న కోటయు, నతఁడు వాకిట జాగరూకతతో గాచి కూర్చుండి యుండుటయును, సుగ్రీవాంగద జాంబవంత ప్రముఖులును, విభీషణుండును మాటిమాటికిని కోటచుట్టును గస్తు దిరుగుచుండుటయు, వచ్చినపుడెల్ల విభీషణుండు లోపలికేఁ బోయి చూచి వచ్చి రామలక్ష్మణులు సుఖులై నిద్రించుచుండుటను హనుమంతునితో చెప్పి పోవుచుండుటయు, కూరుకుమాని కపిబలంబులు నలుగెలంకుల విలోకించుచుండుటయు మొదలగు సకల విషయములు నతనికి గోచరించెను, అపుడు తనలో "దశకంధరుండు చెప్పిన దంతయును సత్యము. విభీషణుండు శత్రుపక్షమునఁ జేరుటయే యతని యపజయమునకు కారణమైనది. హానివృద్ధులను దలంపక తమ్ముఁడనెడి మరియాదయైన నెంచక వివేక హీనుఁడగు రావణుఁ డీగుణవంతుని విభీషణుని తన్ని వెడలిగొట్టినందు వలననే యింతటి చేటు వాటిల్లినది, తాను జేసిన నేరమును దలంపక, రామునియొద్దఁ జేరి తనకు కీడుఁ గలిగించుచున్నాఁడని యిపు డేడ్చుచున్నాఁడు. ఏమి ప్రయోజనము? ఒకని నాశ్రయించినపుడు, బుద్ధిమంతుఁడు తనకాశ్రయ మొసంగిన వాని కనుకూలముగాఁ బ్రవర్తింపవలసినది

న్యాయమే గదా ? ఈ విషయమున విభీషణుం డొనర్చిన నేరమేమి గలదు ? విభీషణునియందు తప్పులేదు. అతఁడు మిక్కిలి యోగ్యుఁడు''—అని చింతింపుచు నొక్కింత తడవుగనుచుండి, పిమ్మట తాను చేయవలసిన రీతిని గూర్చి యిట్లని యోచనఁ గావించెను.

"రావణునకును నాకునుజరిగిన సంభాషణను దెలిసికొని విభీషణుండు తన కొడయఁడగు రాముని నతని తమ్ముని నాచేఁ జిక్కకుండునట్లు చేయుటకు, యీవానరులను బురికొల్పి యిటువంటి పనినిఁ జేయించె. అటుల గాని యెడల—ఈదేబె కోతులకు—ఇంతటి తెలితేటలు గలిగియుండునా ? ఈతంత్రమంతయును విభీషణుండు చెప్పి చేయించినదే ! సూచీ ముఖదీర్ఘదంతులు చెప్పినట్లు లోపలఁ బ్రవేశించుట కష్టముగనే తోఁచినది. దీని కుపాయ మెట్లు ? ఊరక మరలిపోవుదునా ?—అయ్యో !—ఆరావణునకు నమ్మకముగాఁ జెప్పి వచ్చితినే ! మిత్రుని మోసగింప వచ్చునా ? నా మాట నతఁడు నమ్మియుండునుగదా ? అటుల నెంచినచో, యీమహాత్కార్యమును నెరవేర్చుటకు నాకు సాధ్యమగునా ? ఆలోచనఁ జేయక వాగ్దాన మొనరించితి. శక్యమైనంత వరకును ప్రయత్నించిగాని విడువరాదు, చూచెదగాక''—అని పలుతెఱంగులఁ దలంచి యోచించి సమయానుగుణ్యముగ నొక యుక్తి దోఁచుటయు, నదియ తగిన పద్ధతి యనుకొని యటనుండి కదలెను.

## మైరావణుండు హనుమంతుని మోసగించి రామలక్ష్మణుల గొనిపోవుట.

అపుడు కోటచుట్టునుం దిరుగుచున్న వన చరులు హనుమంతునిఁ బలుకరించి, మరల చుట్టివచ్చుటకై యరిగిరి. విభీషణుండు వచ్చి లోపలఁజొచ్చి రాజసుతులం గాంచి హనుమంతుని యొద్ద కరుగుదెంచి "సుఖముగా నిద్రించుచున్నారు. నేను కోట చుట్టునుం దిరిగి చూచి వచ్చెద'' అని పలికి వెడలి పోయెను. మఱియొకటి రెండు నిముషములలో విభీషణుండు వడివడిగా మరల వచ్చిన, యతనిఁగాంచి హనుమంతుఁ డాశ్చర్యమును జెంది "ఏమా ! విభీషణా ! ఇంతలోనే చుట్టునుం దిరిగివచ్చితివా ? నాతో మాటలాడి పోయి రెండు నిమిషములైనం గాలేదే ? అపుడు చూచి

తివిగదా? నీవింత తొందఱగా నేల యరుగుదెంచితివి? కారణ మెయ్యది?" అని యడిగెను.

విభీషణుం డతనింగాంచి "ఔను! ఇపుడే మాటలాడి యరిగి తిని. కాని, నాలో నేమో సందేహము తోఁచినది. కాఁబట్టి దశరథాత్మజుల వెండియు గనుఁగొని పోవనెంచి వచ్చినాఁడను. సుగ్రీవాదులు యిచటికిఁ జేరుటకు లోపలనే బోయి నేను వారితో గలుసుకొనవలయును" అని పలుకుచు లోనికరిగి శీఘ్రముగ మరలి వచ్చి "ఆంజనేయా! సంశయము తీరినది. రామలక్ష్మణులు గాఢ నిద్రాపరవశులై యున్నారు. ఇపుడు రాత్రి రెండవ యామము జరుగుచున్నది. మోసగాఁడైన మైరావణుండు నృపనందనులం గొం పోవుట కిది మంచిసమయము. వాఁడు కడుటక్కరి. వాని మాయలు దెలిసికొనుటకు సాధ్యమగునవి కావు. అలతిఁగా నెంచి నీవు యేమరి యుండకూడదు. జాగరూకతతోఁ గాచియుండుము. నేను పోయి వచ్చెదను" అని చెప్పి వేగముగ నచ్చోటు వాసి పోయెను.

అంతలో విభీషణుండు వచ్చి "వాయునందనా! జాగ్రతగా నుండెదవా? రామలక్ష్మణులు సుఖముగా శయనించి యున్నారుగదా?" అని యడిగెను. ఆమాటలు వినఁగానే హనుమంతున కాశ్చర్యము గలిగినది. అతఁ డతనిఁజూచి "ఎట్లూ? వింతగాఁ బలికెదవు? ఇపుడే!—క్షణకాలమునకు ముందే!—నీవు వచ్చి నాతో సంభాషించి, లోపలికిఁబోయి చూచివచ్చి, రఘువీరులు నిద్రించుచుండుటం దెలిపి పోయినాఁడవు"—అనెను. ఇటుల నతఁడు పలుకుచుండఁ గనే, సుగ్రీవాదులు నచటికి జేరి హనుమంతుఁడు చెప్పిన మాటలు వినగనే, విభీషణుండు దిగులొంది వెలవెలఁ బొయ్యెను. "అయ్యో! అయ్యో! మోసము! మోసము! విపత్సముద్రములో మునింగితిని. హనుమంతా! ఆపాపాత్ముఁడు — ఆతంత్రగాఁడు—ఆ మైరావణుండు నిన్ను మోసగించెను. నీవు తెలిసికొనలేక యేమరితివి. వాఁడు నారూపముతో వచ్చి లోపలఁ బ్రవేశించి యుక్తిగా తన కార్యమును నెరవేర్చుకొని పోయెను. ఇక నేమిగలదు. మొదట నీతో సంభాషించినపుడును యిపుడును దప్ప యింతకు కొన్ని క్షణములకు

పూర్వ మిచటికి నేను రానేలేను. ఆవచ్చినది వాఁడే!—ఆమాయాజాలకుఁడే''—అని దుఃఖముతో కోటలోని కరిగిచూచి, యచ్చట రామలక్ష్మణులు లేకుండుటయు, గుండెలు బాదుకొని రోదనముఁ జేయుచు వెలి కరుగుదెంచి ''వారు లేరు—కొనిపోయినాఁడు—వాని తంత్రములు దెలిసికొనుట మహాకష్టము. కావుననే మాటిమాటికిని హనుమంతుని హెచ్చరించి చెప్పి పోవుచుంటిని. దైవమా! ఇంద అము గాచియుండియు లాభము లేకపోయినది. పుణ్యస్వరూపులగు ధశరథాత్మజులను గోల్పోయితిమి. ఇంక నేమి గతిగలదు? వానరోత్తములారా! మనము పూర్ణముగా చెడితిమి. దిక్కులేనివారమైతిమి దుఃఖ సాగరంబులో మునిఁగిపోయిన వారమైతిమి''—అని గోడుగోడున రోదనముఁ గావించెను. ఆ వృత్తాంతము నెఱింగి, యతని మాటలు వినఁగనే వానరవీరులకు మిన్నువిఱిగి మీఁదఁబడినట్లుండెను. గుండెలు వ్రీలెను. దేహము పదరఁజొచ్చెను. సుగ్రీవాంగద, జాంబవంత, నల, నీల, పనస, మైంద, ద్వివిద, సుషేణ, శతబలి ప్రముఖులగు తరుచరోత్తములు గుమిగూడి ''హా! రామాధిపా! రామచంద్రా! హా! లక్ష్మణా! గుణనిధీ!'' యని వారిం దలచుచు బోరున నేడువఁ దొడంగిరి. కపి సేనాసముద్రము దుఃఖసాగరముగ మారిపోయినది. హనుమంతుఁడు వాలపు కోటను విడదీసి, సుగ్రీవాదులతోఁ జేరి శోకింపసాగెను. మర్కటవీరులు మితిలేని వ్యసనముతో, రఘువీరులకుఁ దొడరిన మహా కష్టమును, తమకుఁ గలిగిన నిరాధార స్థితియుం దలంచి! కటకటా! రామా! సుగుణధామా! బలభీమా! పావననామా! నీలమేఘశ్యామా! రాజలలామా! జగదభిరామా! ఇనకులాంబుధిసోమా! దయానిధీ! నీ పాదసేవకులమగు మమ్ము ననాథులను గావించి విడిచి పాపాత్ముఁడైన మైరావణుని చేతఁ జిక్కి యెందుబోయితివి? ఎచ్చట నుండెదవో. నీముద్దు తమ్మునితోడఁ గూడి, యెవ్విధిఁగష్టములొందఁ బాలైతివోగదా? రేపటిదినము దురాత్ముని—ఆపంక్తి ముఖుని—సంహరించి పుణ్యశీలయైన జనకరాజ నందనను పరిగ్రహింతువని మితిమీరిన సంతోషముచే నుప్పొంగుచుంటిమి. ఇంతలో — ఇటువంటి మహాపదకు తమ్ముఁడును నీవును పాలగుదురని మేము తలంపలేదు. దురదృష్టవంతులమైన మాకా సంతోషము సంఘటిల్లునా? ఏల

కలుగును ? దైవ మిటుల చేయునని తెలిసి కొనలేక యుంటిమి. రామచంద్రా ! సీతా మనోనాయకా ! నిన్నుఁ గోల్పోయిన మాకు యీ జీవిత మేమిటికి ? ప్రాణము లేమిటికి ? ఇందఱమును ప్రాయోపవేశముఁజేసి నిరాహారులమై నిన్నుఁ దలంచుచు జీవములు విడిచెదము. రాజలమణీ ! రాఘవేశ్వరా ! ఇదియమాతుది నిశ్చయము. ఇంక నీయొక్కయు, నీతో నన్నిటను సమానుఁడై యొప్పు నీయనుజునియొక్కయు రమ్య స్వరూపములను సందర్శించు భాగ్యముమాకు చేకూరునా ? క్రూరుండగు మాయావి—పాపచిత్తుఁడు—కుటిలవర్తనుఁడు—నిర్దయుఁడైన యీ మైరావణుఁడు మిమ్ముఁగొనిపోయి యేమి చేయ నెంచెనో, యేమి చేసెనో తెలియకున్నది. గదా ? మావల్లన దుఃఖించుట దప్ప మఱి చేయఁగలదేదియుఁ గనుపట్టకున్నది. చేతనుండిన దివ్యరత్న ద్వయమును బోగొట్టుకొని దీనుఁడై దుఃఖించువానివలె మిమ్ము గోల్పోయి దారిద్రోచ కల్లాడుచున్నారము''— అని రామలక్ష్మణుల కల్యాణగుణ విశేషంబులను పలుతెరగుల వర్ణింపుచు రోదనముఁ జేయుచుండిరి.

ఆ సమయంబున నందఱి వలెనే దుఃఖించుచున్న విభీషణుని నట్టె చూచి, యతని మూలముననే యీ కార్యము జరిగినదనియు, తన నేరము బయలు గాకుండుటకై కపటపు శోకము నభియించుచున్నాఁడనియు నెంచి, యాంజనేయుం డతనిపై నత్యంతాగ్రహ

హనుమంతుఁడు విభీషణునిఁ జంప నుంకించుట.

మును జెంది తక్కిన వానరయోధులతో నుగ్రంబుగా నిట్లనియె.

ఉ॥ హీనుఁడు పాపశీలుఁడగు-నియ్యసురుఁడు దురాత్ముఁ డెంతయుఁ
కానినివాని భంగిఁ దన-కన్నులు మూయుచు విచ్చుచుం గడుం
దీనత నొందియుండెడి గ-తింగను పట్టెడు మాయదొంగయీ
వీని వధించెదఁ విడక-వీడె గడంగి యొనర్చె నింతయుఁ.

చ॥ శరణని వచ్చి భానుకుల-సాగర చంద్రుని నాశ్రయించి యే
వెరవుననైన చేటు నొద-వించుటకుం దఱిచూచు చుండి యి
పురమున నేఁడు పన్నఁగడఁ-బన్నెను వారినిఁ జంపఁ బాముకుం
బెరిమను పాలుబోసి తగఁబెంచిన కాటిడ కుండునే ? దయఁ.

మ. హితశత్రుండగు నీఖలుండు మన కొక్కింతైన నమ్మంగరా
దితనిం జెంతకుఁ జేర్చువాఁడు చెడుమే-లెన్నండునుం జెందఁడ
జ్ఞతచే యోగ్యుఁడటంచు నెంచితిమి యీ-చందంబునం జేసెయే
వెత గల్గించునో మేకవన్నె పులియౌ, వీడింకపైఁ గ్రూరుఁడై.

ఈ పాతకుఁడు చేసిన కపట తంత్రమే గాని యిది వేఱువిధమున జరిగినపనిగాదు. మంచివాని వలెనే నటించుచు మనల నమ్మునట్లు చేసి సమయము చూచి, పరమ పావనులగు భానుకులులను మైరావణునకుఁ బట్టి యిచ్చి మనకు సందేహము గలుగకుండుటకై మహా దుఃఖము గలవాని వలె వగచుచున్నాఁడు. ఇది మోసపు నటనయే గాని నిజముగాదు. అన్నతో విరోధించి వచ్చినవానివలె దీనుండై రామచంద్రుని యొద్దకు శరణుఁ జొచ్చి నమ్మకము బుట్టులాగున కడు విధేయుడుగా వర్తించుచు, పయోముఖ విషకుంభమువలె, పైకి సద్గుణవంతునివలె జూపట్టుచు, లోలోన నెవ్విధమునవేనియు సమయముఁజూచి, యగ్రజునకు మేలు చేయుటకుఁ దలంచుచుండి యనువైన తరుణము నెఱింగి, మనల నందఱను నేమరించి రఘువీరులను మైరావణున కప్పగించె. వీడు కప్పగొంతు పామని తెలిసికొనలేక వీని మాటలన్నియును మనము నమ్మి చెప్పినదంతయుం జేసి చెడితిమి. దశరథాత్మజులం గోలుపడితిమి. ఆ మహాత్ములం గాని పోవునంతవరకును, నితని తహతహ యింతింతగాదు. ఆకార్యము నెరవేఱినదియును శాంతచిత్తుఁడై మన మోమోటమికై దైన్యమును బొందినవానివలె నభినయించుచున్నాఁడు.

మొదటనుండియు కపటముతోనే వర్తించుచుండెననుట యిప్పటి వీని ప్రవర్తనమునుబట్టి తోఁచుచున్నది. అన్నయగు రావణుండును వీఁడును యోచనఁ గావించుకొని తాను విరోధించి వచ్చినట్లు చెప్పి రామచంద్రున కపాయము గలిగించి యగ్రజుని గెలుపొందించుటకు కంకణముఁగట్టి నిజ ప్రయత్నమును నెరవేర్చుకొనెను. వీనిని విడువవచ్చునా? వీనిని—వీఁడు రక్షింపనెంచిన వీనియన్ననుం జంపినంగాని నా యాగ్రహము దీఱదు"—అని చెప్పి యతనిమీఁది కడర నుంకించుచున్న హనుమంతునిఁజూచి, యడ్డంబుఁజొచ్చి సుగ్రీవ జాంబవంత ప్రముఖులు కోపాటోప శమనంబుఁ గావించి శాంతము గదుర నిల్లనిచెప్పిరి.

క॥ అనఘుండు రామభక్తుఁడు । మనకెంతయునాప్తుఁడితఁడు మారుతపుత్రా !
వినుతగుణాకరుఁడగునెఱుఁగనివానివిధంబుగాఁగ గనలఁగఁదగునే?

ఉ॥ అన్నకుమేలుచేయుటకు-నైరఘువీరులఁ జంపఁబూనెనం
చెన్నకుమీవిభీషణున-కెవ్వరునెందును నుద్దిగారిలన్
సన్నుతిఁ జేయనర్హుఁడవి-పాదమునొందెడు నీఘనుండునీ
వన్నకఠోరపుంబలుకు-లాత్మనుశూలము లట్లుదాకుటన్.

వలదు వలదు. ఇతనియం దెట్టిదోషమును గలుగదనుట నిక్కము. ఆ పాప వర్తనుండగు మైరావణుండు నిన్ను మోసగించెను. వాఁడే రామలక్ష్మణులం గొనిపోయెను. నీవు చేలుఁబోయి విభీషణుండు యేనురించెనని యితనిపై నేరము మోపుట పాపము. మన మీతనిఁ బ్రార్థించి యింక జరుగవలసిన విధానమునుగూర్చి యడిగి యితఁడు చెప్పినట్లు చేయుటలగ్గు. వృథా కాలహరణముఁ జేయకూడదు'' అని పలికి హనుమంతుని కోపమును దొలంగించి శాంతచిత్తునిఁ జేసి ప్రయత్నంబునఁ దమ దుఃఖము నడంచుకొని, యాంజనేయుని మాటలువిని దీనముఖుఁడై, దేహంబు గంపింపఁ దలవాంచి కూర్చుండి వగచుచున్న విభీషణునిఁ గనుంగొని యేక ముఖంబుగా యిన సుతాదు లిట్లనిరి.

కథాసరణి – ద్విపద.

అనఘవిభీషణ మనహనుమంతుం – డనినదు రూక్తులను
మనమున నెంచకుమీ యెఱుఁగకయా – యాడ్కిఁ బలికెనతఁడు
అతఁడునునీవలెనే రామునియం – దధికభక్తిగలిగి
సతతంబును సేవించువాఁడును – స్వాంతుఁడుగుణశాలి
కావున తత్ప్రియమగ్గలమై – రాఘవులు గానఁబడమి
భావంబునఁ బరితాపముపొంచివి – పర్యాయముగనెంచి
యోచింపక వేగిర పడి నిను కఠి–నోక్తులఁ గాఱించె
నీచముగా నేమేమో బలికెను–నీమతిఁ గనలేక
ఇపుడా నుడువుల నెంచక–నింకపైని మనము
నృపనందనులను దెచ్చు విధంబును–నీలోఁ దలపోసి
దెలియఁ బలుకు మారక యీగతిఁ జిం–తించుచుండఁ దగునె?

తులువచేతఁ జిక్కిన వారల నే-త్రోవనైన గాని
వదలిచి యిచటికి రయమునఁ గొనిరా-వలదే యీ వేళ
వెదలంగుందుచు నిందఱ ముండియు-నేమి ఫలము చెపుమ.

అని యడిగిన విభీషణుండు తరణి నందన జాంబవంత ప్రభృతులం జూచి యిట్లనియె "వనౌకస వర్యులారా! ఆంజనేయుండు పలికిన పలుకులకై నాకు చింతయేలేదు. ఏలననఁగా, నతండు నిజము నెఱుంగలేక భ్రమించి మోసపోయి, యా కారణంబునఁ గలిగిన కోప వేగముచే తోఁచినట్లు చెప్పెనని నేనెఱుంగనివాఁడను గాను. కాని, నేను చింతించు విషయము వేఱు. అది యేద నఁగా, మిహాసమర్థుల మని పేరు పొందిన మన మిందఱమును నెంతయో గొప్ప ప్రయత్న మొనరించియు రఘువీరులను మాయ కాఁడగు మైరావణునకుఁ జిక్కకుండు లాగునఁ జేయఁజాల మైతిమి గదా? ఆ టక్కరీఁడు తన పంతమును జెల్లించుకొనెను గదా? అందఱమును వ్యర్థులమైతిమి గదా? రామలక్ష్మణులం గోల్పోయి దుఃఖభాజనుల మైతిమి గదా? యనుటయే నావ్యాకులమునకుంగల నిమిత్తము. ఈ యాపద యాంజనేయుని యజాగ్రతవలనఁ గలిగి నదియే కాని యన్యముగాదు. అపుడపుడును నేను యితనియొద్దకు వచ్చి, "మైరావణుఁడు కడు మోసగాఁడు. వాని కపట తంత్ర ముల నెఱుంగుట మిక్కిలి కష్టము, పెక్కురూపములతో, బహు చాతుర్యముతో పరుల నేమరించుట యందు వానిసామర్థ్య మద్వి తీయ మైనది. కావున జాగ్రతగా నుండు" మని మఱిమఱియుఁ జెప్పిపోవు చుంటిని. తుదకేమైనది!? నేను యెంత చెప్పితినో, యంత పనియుం జరిగినది. వాడు — ఆమాయకాఁడు — ఆ మైరావణుండు సమయమును చూచి నావలె నుండినం దప్ప తన కోరికె నెఱవే అదని యెంచి నా యాకృతిఁదాల్చి వచ్చి సమయాను గుణ్యముగా మాటలాడి హనుమంతుని మోసగించెను. లోపలఁ బ్రవేశించి తన పని నెరవేర్చుకొని మంచిగా వెడలిపోయెను. నావలెనే యున్నం దున నాంజనేయుం డది నేనే యని తలంచెను. కానివాని టక్కు నెఱుంగలేఁడయ్యె. తానుమోసపోయినది తెలిసికొనలేక యితండు నాపై కోపముఁగొని తోఁచినట్లు మాటలాడెను. ఇటుల నని నందుకై యితనిమీఁద నిసుమంతయు నాలో నసూయ జెందలేదు.

ఇపుడు చేయవలసిన విధమునుగూర్చి నన్ను మీరలడిగితిరి. మన మెల్లరమును చేరి పావనులైన దాశరథుల నాపదనుండి తప్పించ వలసినది మిక్కిలి యావశ్యకమగు కార్యము. కాని యది సులభ సాధ్యమగునది కాదు. మహాకష్టతరమైన విషయము. మైరావ ణుండు సూర్యోదయమునకు ముందు రాజపుత్రులను కాళికి బలి యిచ్చునట్లు దశకంఠునితోఁ గట్టిగాఁ జెప్పిపోయెననివింటిని. వాఁడు చెప్పినంతయుం జేయగలవాఁడే కాని తడవుఁ గావింప నొల్లఁడు. ఇప్పటివరకు రావణునితో నెటుల జెప్పి వచ్చెనో, యాలాగున నన్నిపనులును గావించెను ఇంక రామలక్ష్మణులం జంపుట యొక్కటి మాత్రము కొఱత పడియున్నది. ఆపనిని వాఁడు నెరవేర్చుటకు మున్నుగనే మనము జాగ్రతతో చేయవలసిన పనులు జరిగించ వలెను. తడవుఁ గావించితిమి మేని యావలన నేమి చింతించినను ప్రయోజనము లేదు.

గీ॥ దేశకాలక్రియాబల-స్థితులెఱింగి। చేయఁదగుభంగిఁ కార్యము-జేసెనేని
వసుధలోజనులెల్లరు-వానిమెచ్చి। పొగడుదురునీతిమంతుఁడౌ-పురుషుఁ [డనుచు.

గీ॥ కడఁగిమించిన యెంతటి-కార్యమైన । నీతిమంతుండు నెఱవేర్చు-నేర్పు [మీఱ
తెలివికిందోడుబలిమియు-గలిగియున్న । వానియత్నంబు ఫలవంతమౌను [నిజము.

కావున నిపుడు మనము తెలివియు బలిమియు నుపయోగించి మన కార్యమును నెరవేర్చుకొన వలసియున్నది. ఈపనికి మనలో నియ్యాంజనేయుండు దప్ప యన్యు లర్హులైన వారులేరు. అతఁడొక్కఁడే నేర్పును బలమును గలిగి పనిని నెరవేర్పఁగలవాఁడు. దీనికి కామరూప ధారణశక్తి యావశ్యకము. ఈ సామర్థ్యమును వాయుపుత్రునకుఁ గలదు. కాఁబట్టి రవికుల శేఖరులను రక్షించి కొని. తెచ్చుట కతనిం బంపవలయును. కాదేని యిక్కార్యము కొనసాగదు. దీనికై యందఱము నతనిఁ బ్రార్థింపుదము. సమ్మతించెనేని పిమ్మట చేయవలసిన రీతినంతయును జెప్పెదను''—అని

యెను. ఆ మాటలువిని మర్కటవీరులు సమ్మతించి సంతసించి గంథ వహానందనున కభిముఖులై యేకవాక్యంబుగా నిట్లనిరి.

"పర వీర భయంకర భుజా బలవంతా, సుగుణవంతా! కరుణామయస్వాంతా! హనుమంతా! కీర్తిమంతా! వింటివిగదా? మన విభీషణుండు చెప్పినమాటలు. వివేక నిధివగు నీకు మరల చెప్ప వలసినదియే లేదు. రామచంద్రునకు నీవు పరమ భక్తుండవు. ఆ మహాత్ముని కార్యంబుల నతి జాగరూకతతో నెరవేర్చునట్టి సమర్థుండవు. అందటికంటెను, జానకీ జాని నీపై నెక్కుడు ప్రియము గలవాఁడై నిన్ను సంతతము నెంతయు నాదరించుచుండుట నీకుఁ దెలియని విషయముగాదు. మన మెల్లరమును నెవ్వని దయకు పాత్రులమై నిరాపాయముగా జీవితకాలమును గడపఁ దలంచియుంటిమో, ఎవ్వని పదారవిందములు మన కాధారమని యెంచి భయ భక్తి వినయ విధేయత లతిశయింపగా, దాసులమై సేవించుచుంటిమో, ఏమహానుభావుఁడ సమాన, ధైర్య, శౌర్య, గాంభీర్య, భుజ బలాదు లతిశయింపఁగా, శత్రువుల కులాంతకుఁడై, రాక్షసులకు గుండెగాలమై, తేరి చూడరాని తేజంబున వెలయుచుండెనో, యట్టి రఘువంశాంబుధి చంద్రుండు—ఆమన యొడయుండు—సీతా మనోవల్లభుండు—దశరథ రాజకుమార శేఖరుండు—దుష్ట నిశాటుని మాయా వాగురిం దగులుకొని కాల వైపరీత్యంబువలన—నసమర్థుని వలె—దుర్బలునివలె—ఖండింపఁబడుటకై, అనుజ సహితముగ పాతాళ లంకకుఁ గొనిపోఁబడెను. ఆహా! ఎంత విచిత్రమైన కార్యము జరిగినది? మనము యిందఱము గలిగియుండియు లాభము లేకపోయినది. దైవతంత్ర మిటుల జరుగవలసి యుండఁగా, నది యేలతప్పును సరి—ఇపుడు చింతించిన ఫలమేమి గలుగునుగాని, యీమహాత్కార్యమును మఱి యొకరు చేయలేరని విభీషణుం డనుచున్నాఁడు కావున, దీనికై ప్రయత్నించి, యెంత కష్టముగా నుండినను నోర్చి రామ లక్ష్మణులను శత్రుని బారినుండి తప్పించి కీర్తినిఁ బొందుము. సర్వ విధంబులను సామర్థ్యము గలవాఁడవగు నీవు దలంచినచో నీకిపని పెద్దదికాదు. కాలము గడచి పోవుచున్నది. రెండవ యామాంతము సమీపించుచున్నది. కనుక తడవుచేయక విభీషణుండు చెప్పెడి పద్ధతులను శ్రద్ధతో విని పయనమైపోయి, రఘువీరులం

ధరణి యుదయించు వేళకిఁ గొనిరమ్ము"—అని యాస్తోత్ర ప్రియుం డగు సమీర కుమారుని కుత్సాహము గలుగునట్లు పలుదెఱంగులఁ బ్రార్థించిరి. రామచంద్రునియం దధిక భక్తిగలవాఁడయిన యాంజనేయునకు వారు చెప్పిన మాటలవలన మఱిమఱియు, కార్యోద్రేకము మించి సుగ్రీవాదులంగాంచి వాల మల్లార్చుచు. కిలకిలార్భటిఁ గావించి యుచ్చైస్స్వనముతో నిట్లనియె.

"చ॥ జడియఁగ నేల మీరు కపి-సత్తములార! విభీషణుండు జె
ప్పెడి విధు లేర్పడంగ విని-వేగమునం జని యెన్ని కష్టముల్
దొడరిన నోర్చి భీతిలక-దుష్టుని శాతుని వీడుఁ జొచ్చియె
వ్వడువున నైనఁగాని గొని-వచ్చెదనే రఘువంశ జాతులన్.

నాప్రజ్ఞను జూచెదరు గాక" — అని చెప్పి భుజంబు లప్పళించిన నవ్వాక్యంబులకు వనాకసులు సంతసించి లాంగూలంబులు మీఁదికి నిక్కించి యల్లార్చుచు, "విభీషణా! ఇంక హనుమంతునకు పాతాళ లంకకుఁ బోవు మార్గంబును చేయవలసిన విధానంబును తడవుఁజేయక కఱపి పనుపు" మని నుడివిన నతండు సమీరనందనునితో నందఱును వినుచుండగా నిట్లనియె.

"ఆంజనేయా! పాతాళ లంకకుఁ బోవుటయు, రామలక్ష్మణులం దెచ్చుటయును సులభసాధ్యమగు కార్యము గాదు. మహాకష్టము. ఎన్నో యాటంకములు గలవు. అయినను నీవిక్కార్యమును సాధింపఁగలవనెడి నమ్మకము గలదు. కావున నీకు చేయవలసిన క్రమంబుఁ జెప్పెదను వినుము.

విభీషణుఁడు హనుమంతునకు పాతాళ లంకా మార్గమును దెలుపుట.

ఇచ్చోట నుండి పోయి యుదయ పర్వతమునుదాటి యవ్వలివైపున కరుగవలయును. అచ్చట నలుప్రక్కలను నాలుగు కొండలును వాని నడుమ నొక పల్లపు ప్రదేశమును కనుపట్టును. ఆలోయలోనికి దిగిన యెడల నతి విశాలమును, నగాధమును, పరిపూర్ణ జల సహితంబునైన కొలనొకటి యున్నది. అందు మహాక్రూరములైన జలజంతువులు మిక్కుటముగా నుండుటచే యానీటిలో దిగుటకు దేవతలుగూడ సాహసింపఁ జాలరు. అట్టి భయంకరమైన

యాకొలను నందు నట్టనడుమ నొక్కటియే తామరపూవు గలదు. అది సదా వికసించియే యుండును. ఆపూవు పగవాఁడు ముట్టిన యెడల ముడుచుకొని తటాలున మునింగి కనుపడకపోవును. ఆకమలమును ముకుళించుటకు మున్నే త్రుంచివేయవలయును. నిమిషములో దాని కాడలో మరల పూవంకురించి, ముడుచుకొని మునింగి పోవును. కాఁబట్టి పూవును ద్రుంచి వైవగనే, దానియం దుండు సూక్ష్మరంధ్రములో సూక్ష్మాకారంబునం జొచ్చి యధోముఖంబుగా చాలదూరము పోవలయును. ఆలాగున నాళ రంధ్రములోఁ బ్రవేశించి నంతట ముందు జెప్పినట్లు మరల కాడలో పూవు గలుగక నాళము మాత్రము నీటిమీఁదికిఁ గనుపట్టుచు నట్లే నిలిచి యుండును.

కమలనాళములో నుండి యాలాగున నరిగినంతట దుర్గమంబైన యరణ్యంబు గలదు. దానిని నిర్గమించి పోవలయును. అన్ని వైపులను గలిగియున్న దగుటచే యా యడవినిఁ జొరక తప్పించికొని పోవుటక వలనుగాదు దానిలోఁ జొచ్చి పోవక తప్పదు. అందు భయంకరములైన సింహములును, పులులును, ఎలుగుబంట్లును, చిఱుతలును, తోడేళ్లును, కోరనగండ్లును, రేచుకుక్కలును, కొండచిలువలును, విష సర్పములును, తేళ్లును, వేయేల నడుగు బెట్టుటకు వలనుగాకుండునట్లు క్రూరజంతువులు సదా విహరించుచుండును. ఆ యరణ్యము మిక్కిలి యపాయకరమైనది మూడుయోజనముల వెడల్పు గలిగి, దట్టముగ గదిసికొనియుండెడి చెట్లును, పుట్టలును, పొదలును, తీవెలును నొప్పుచుండెడి యమ్మహాగహనంబును దాటి కొంతదవ్వు పోయినచో, మూడుయోజనముల వెడల్పు గలదియు, వలయాకారముగా చుట్టును వ్యాపించి యుండునదియు నగు నిప్పుల యగడ్త యున్నది. అందు సదా చల్లారని, నిప్పుకలు భయంకరముగ కణకణలాడుచు, బహుదూరమువరకును సహింప శక్యముగాని సెగలెగయించుచుండు ఆనిప్పులు వర్షించినపుడు నయిత మటులనే యారక యుండుచుండును. దానిని దాటి పోయినయెడల, మహా పర్వతము లైనను మునింగి కానరాక పోవునంతటి లోతుగల నీటి యగడ్త యున్నది. అదియును మూడు యోజనముల వెడల్పుగలిగి యెల్లపుడు తుకతుక నుడుకుచుండు నీరుగలదై యుండును. ఆయగడ్తను

గడచి కొంతదూరము బోయినంతట సప్త ప్రాకారములతోఁ గూడిన మైరావణుని పాతాళ లంకాపట్టణము గోచరించును. ఆ యేడుకోటలును క్రమముగా, రాళ్ళచేతను, యినుముచేతను, సీసముచేతను, నుక్కుచేతను, రాగిచేతను, వెండిచేతను, బంగారముచేతను నిర్మింపబడినవై దృఢములై శత్రువుల కభేద్యములై భయంకర రాక్షస కోటులచే సంరక్షితములై యొప్పుచుండును. ఆవివరమును జెప్పెద నాకర్ణింపుము.

విభీషణుండు హనుమంతునకు పాతాళ లంకలోని విశేషములఁ దెలుపుట.

కోటలన్నిటికిని యొక్కొక మార్గమే గలదుగాని, పోవుటకును వచ్చుటకును వేఱు దారులు లేనేలేవు. రాతికోటం జొచ్చితిమేని యచట, భయంకరములును, వికృతములునైన యాకారములు గల మహా బలవంతులగు రాక్షసులు వేలకొలది గాచియుందురు. వారినిఁ దప్పించుకొని యాకోటనుదాఁటి, ఇనుముచే నిర్మితమైన రెండవ కోట ద్వారమును జేరినయెడల సకలాయుధములును ధరించిన క్రూరదానవు లచ్చట లక్షల కొలంది గాచియుండుదురు. ఆవాకిలిదాటి క్రమముగా సీసము, ఉక్కు, రాగి, వెండి కోటలను గడచిపోవలయును. ఒక్కొక్క ద్వారమందును, కోట్లకొలందిగ జమునినైనను లెక్కచేయని యసురులు కావలి యుండెదరు. మిక్కిలి చాతుర్యముతో, ముందుచెప్పిన యాఱు విధములైన కోటలను గడచి యేడవదగు బంగారపు దుర్గము దగ్గఱ కరిగినచో, నచట గవనివాకిలికి ముందుగా గొప్ప తటాకమున్నది. దానిని దాటుటకై నీటిలో దిగినయెడల తటాలున మునిగిపోవుదురు. మరల మునింగినవారు పయికిఁ దేలుటయేలేదు. ఆతటాకమును గడచి యావలిగట్టునకుఁ జేరినయెడల, యాకోటవాకిట నొక తులయున్నది. అది యెప్పుడు సమముగా నిలిచి యుండును గాని యిటునటు ద్రొగ్గదు. పగవాఁడు వచ్చినపక్షమున యాతుల యిటునటు క్రిందికి మీఁదికిం గదలి విరిగి కూలును. తుల యుండుటచే యాగవనికి తులాద్వారంబని పేరు పెట్టఁబడియున్నది. త్రాసువిఱిగి పడఁగానే విరోధి యెవఁడో వచ్చెనని తెలిసికొని కోటానకోటుల సంఖ్యగల యచ్చోట కావలి యుండు నిశాచరవీరులు జాగరూకతతో కనిపట్టి, చీమనైనను లోపలఁ జొరనీయక పాలిఞ్చుచుందురు.

ఇటువంటి దుర్గమంబైన మార్గంబుననెల్ల యాటంకములును గడచి తులాద్వారమును దాటిపోయినదే వనగరతుల్యమగు పాతాళ లంకాపట్టణము శోభాయమానంబై యొప్పుచుండును. మైరావణుండు బ్రహ్మను గూర్చి ఘోరతపమును గావించి మెప్పించి, తనపురంబునకు మున్ను చెప్పినట్టి యేర్పాటులన్నియు గలిగియుండ నాగున వరంబు వడి యాక్రమంబున నేర్పాటుఁ జేసికొని నిర్భయముగా నప్పురంబున వసించుచుండును. నీవు నగరంబుఁజొచ్చి పోయినపుడు, దేదీప్యమానంబుగా ప్రకాశించు గోపుర ప్రాకార మంటపాదులు గల భద్రకాళి యాలయము గానవచ్చును. మైరావణు డాగుడిలోనే రామలక్ష్మణులను బెట్టియుండును. వాఁడు వారలఁ గొనిపోవునపుడు సొక్కు పొడిజల్లియుండును, కావున దశరథ నందనులు గాఢనిద్రా పరవశులై యుండుదురు. వారికొఱకై నీవు పోవుట మైరావణుండెఱింగెనేని తటాలున వారలఁ జంపివేయును. కాఁబట్టి యటుల జరుగకుండునట్లు యుక్తితో వర్తింపవలయును.

అంజనీ కుమారా! ఇంకొక ముఖ్యమైన విషయమును నీకు చెప్ప వలసి యున్నది. ఏమనగా మైరావణుండు బ్రతికియుండగా, ఈశ్వరుని కైనను రామలక్ష్మణులం దెచ్చుటకు సాధ్యముగాదు. కావున నచ్చటికి పోయి నంతట రఘునందనులను వానిబారిం బడకుండునట్లు మొదట తగిన యేర్పాటుఁ గావించి పిమ్మట వానినివధించి, జయశీలుండవై మన ప్రభువులం దేవలసియున్నది. ఇపుడు నేను దెలిపిన దంతయును సంగ్రహముగానే గాని, వివరముగాఁ జెప్పలేదు. పోయినపుడచట నచట గల విశేష విషయములను నీవే తెలిసికొందువు. రెండవజాము మూడుభాగములు జరిగిపోయినది. జరుగ వలసిన పని చాల యున్నది. తడవుఁజేయక బయినం బగుము ప్రొద్దుబొడిచినయెడల నేమి చేసినను, నెంత కష్టపడినను నిష్ప్రయోజనము. రామకార్యార్థి వగు నీకు దేవుఁడు తోడ్పడఁగలఁడు. పొమ్ము పొమ్ము. నేను చెప్పిన విషయములను జ్ఞాపకముగనుంచుకొని కార్యమును సాధించి జయశీలుండవై రామలక్ష్మణులం గొని వత్తువుగాక'' అని దీవించి యనుజ్ఞ నొసంగెను. వానరవీరులందఱును నటులనే హనుమంతునికి జయమును, కార్యానుకూలతయుఁ గలుగవలయునని దీవన లొసంగి పయినముఁ జేసిరి.

హనుమంతుఁడు రామలక్ష్మణులం దెచ్చుటకై పోవుట.

ఈ ప్రకారము, విభీషణునివలన సకల విషయములును దెలిసికొని వాయువు పుత్రుఁ డతని చేతను, వానరవీరులచేతను అనుజ్ఞఁగొని మనంబున శ్రీరామచంద్రుని పదంబులునిలిపి ధ్యానించి, పంచభూతంబులను, నష్టదిక్పతులను, నవగ్రహంబులను దేవమునిగణంబులను సంస్మరించి మ్రొక్కి, ఉదయాచలదిశాభిముఖుండై నిలిచికుప్పించి దిగ్గున మీఁదికెగసెను. పొడువు కొండ కటువైపున విభీషణుఁడు చెప్పినట్లే, నాలుగు కొండలును, లోయయు, కొలనును తామరపూవును నతనికి గనఁబడియె. అతఁడు తుమ్మెదరూపమును దాల్చిపోయి పూవునుగోటికి నీటిలోఁ బడునట్లు చేసి మరల పూవు బుట్టుటకు లోపల, యణుప్రాయమైన యాకృతితో తానుకాడలోని సందులోఁ బ్రవేశించి, అడుగు భాగమునుజేరి యచట నుండెడి భయంకర మగు మహారణ్యమును సమీపించి, తనలో "విభీషణుండుచెప్పిన యాటంకములు కడు భయంకర మైనవి. కావున, సూక్ష్మరూపముతో వాయుమార్గంబునఁ బోవుట యుక్తమని నిశ్చయించి మశకరూపమును దాల్చి, యచ్చటచ్చటఁ గావలియున్న రాక్షస గణంబులను గికురించి యైదు కోటలుదాటి, యాఱవదగు వెండి కోటద్వారము దగ్గరకుఁబోయి, యందుఁజొచ్చిపోవు సమయంబున, నచ్చోట ముప్పదిమూడుకోటుల రక్కసులతో గావలిగాయుచున్న మత్స్యవల్లభుండను మహావీరుండు, మహాబలశాలి మహాసమర్థుఁడు. దోమయై పోవుచున్న హనుమంతునిం జూచి, కడుజాగరూకతఁ గలవాఁడగుటచే, యాపోయెడివాఁడు, మాయారూపధారియు మైరావణునకు పరమవిరోధియు నగుటం దెలిసికొని, తటాలున నడ్డగించి, నిలువరించి, వికటముగా నవ్వుచు "ఔరా! ఓరీ! మోసగాఁడ! ఇట్టి యాకారముతో బోయినచో నెవ్వరునుం దెలిసికొనలేరని యెంచితివా? ఇప్పటివరకును, నేమరించివచ్చినట్లే నన్నును మోసగింప వచ్చునని తలంచితివి కాఁబోలు. ఇతఁడు మత్స్యవల్లభుండు సుమీ! ఇతఁడు మోసపోవువాఁడు గాఁడని తెలిసికొనుము.

నాకుఁ దెలియక చీమయైన నీ ద్వారమును దాటిపోవుటకు శక్యము గాదని తెలిసికొనుము. నీ వెవ్వఁడవో, యేల వచ్చితివో,

ఉన్నదున్నట్లు చెప్పుము. నీ మాటలు విన్నంతట యుక్తముగాఁ దోఁచెనేని ప్రాణములతో విడిచెద. చావుదప్పించుకొని మరలివచ్చిన దారిం బట్టి పారిపొమ్ము. లేదేని నిన్ను జంపుదును గాని విడువను. ఒక యంగుళమైనను నిటుబెట్టుట కింక నీకు సాధ్యము గాదు. ఇసీ! దొంగా నిజమైన నీరూపమునుఁగొని, యడిగినవానికి బదులు జెప్పు" — మని గద్దించి పలుకుచు నిలువరించిన యాంజనేయుండు వాని జాగ్రతకు విస్మయించి, స్వస్వరూపమును ధరించి "ఓయీ! ఈపట్టణమును చూచి పోవలయునని వచ్చితిని. అడ్డము తొలంగి పోవనిమ్ము. తడవుచేయకు మనియెను.

దోమగా నుండినవాఁడు వానరాకారమును బొందుటను గని, మత్స్యవల్లభుం డచ్చెరువొంది "ఆహా? మోసపుదొంగా! ఇది నీ నిజమైన రూపమేనా? ఇంతలో నిటుల నైనవాఁడవు, మఱియు నెన్ని రూపములనైన ధరించి యేమరింపఁ గలవని తోచుచున్నది. చూడఁగా సామాన్యుఁడ వనఁదగి యుండలేదు. మహా మాయాజాలము లెఱింగిన తంత్రగాఁడవు. నీవు యీపట్టణమును చూచుట కొఱకా వచ్చితివి ఈపలుకులను నమ్ముదునని తలంచితివా? దుర్గమమైన పాతాళ లంకామార్గమును దెలిసికొని, దారిలోఁగల గడువరాని యడ్డంకుల నన్నిటినిఁ దప్పించుకొని, కావలికాండ్ర నెల్లరను నేమరించి యింతదూరము వచ్చిన వాఁడవగు నీవు సామాన్యుఁడవనియు, పురంబు జూడవనియు నెవ్వఁడు నమ్మును? వెఱ్ఱివాఁడైనను యీపలుకులు విశ్వసించునా? బుద్ధిహీనుఁడా! నీవు కోతివేనా?—నిజముగ కోతివా? మొదను మశకము—ఇపుడు మర్కటమైతివి. ఇవియన్నియు పొల్లు మాటలు. నీతలఁ బగులగొట్టెదను గాని విడువను" అని భీకరంబుగాఁ బలికెను.

హనుమంతుఁడు "నిజముగ నేను కోతిజాతిలోఁ బుట్టినవాఁడనే! పట్టణమును చూడ వచ్చినవాఁడనే! కాలహరణ మగుచున్నది. అడ్డగింపక పోనిమ్ము నీవు విడిచినను విడువకున్నను, నేను నిలుచువాఁడను గాను, నగరంబులోనికి పోక మానను. వృథా మాటలాడి నన్ను బెదరింపకుము. ఈపలుకులు విని నేను జంకెడివాఁడనని యెంచితివో కాఁబోలు! తొలఁగు తొలఁగుము. అడ్డము

రావలదు సుమీ!'' అనెను. ఆ మాటలు వినఁగానే మత్స్యవల్లభున కధికమైన కోపము గలిగినది. అతఁడు రౌద్రాకారుండై, మొగము జేగురింప, కన్నుల నిప్పులు గురియులాగు రక్తవర్ణంబుఁ దాల్ప నుగ్ర దృష్టులంగని, హనుమంతుని నదలించి, పండ్లు గొఱుకుచు ''ఓరీ! అంబేదా! ముక్కిడికోతీ! ఎట్లూ? ఏమిచెప్పితివి? నీవా నన్నుగడచి పురంబులోఁ జొరఁగలవాఁడవు. ఇది పురవైరి కైనను శక్యముగాని కార్యము. ఎంతటివాఁడవు నీవు? నీకు చావు కాలము మూడినది. కావుననే యిచ్చటికివచ్చి, నాబారింజిక్కితివి. ఇంక నీకు బ్రతుకెక్కడిది? నిన్ను రక్షించువారెవ్వరు? శక్తియుండిన నసురులం గాచికొను'' మని బెట్టి దంబుగా ఱొమ్మునఁ బొడిచెను. పిడుగుదాకిన చందమునఁ బొడిచిన మత్స్యవల్లభుని పిడికిటి

## ఆంజనేయ మత్స్యవల్లభుల యుద్ధము.

పోటుచే నొచ్చి హనుమంతుం డత్యంతమైన యాగ్రహమును జెంది కన్ను లెఱ్ఱజేసి, ''ఈకోతి మొగపు రక్కసున కింతగర్వమా? వీనిఁ బొలియించెదఁ గాక'' అని తన యాకృతినిఁ బెంచి ''దురాత్మా! ఏదీ? రమ్ము. ఈసారి బొడువుము? నీగతి యెట్లగునో తెలిసికొనఁ గల''—వని మీఁదికడరిన, మత్స్యవల్లభుండు మరల యురంబునఁ బొడిచె.

''సరి! ఇంక నాప్రజ్ఞఁ జూడు'' మని యత్యుగ్రముగ మత్స్యవల్లభునిం బొడిచె. ఇంద్రుని వజ్రాయుధము కొండను దాకినట్లు హనుమంతుని పోటు దగులుటయు, నమ్మహావీరుండు సొమ్మసిలి పడి లేచి యాంజనేయునితోఁ బోరందొడంగె. అపుడు వారి కిరువురకును మహా ఘోరముగ యుద్ధము జరిగినది. పడుచు లేచుచు కొట్టుచు, నెట్టుచు, త్రోయుచు, వ్రేయుచు పొంచుచు, మించుచు, మఱియు, నెగురుచు, లఘించుచు, పెనంగుచు, నార్చుచు, నవ్వుచు, పేరుచు, మదగజంబులవలె, బెబ్బులుల చందంబున, కోదమ సింగంబుల తెఱంగున, రోషం బతిశయింప, నొకరి నొకరు జంపవలయు ననెడి యుద్రేకంబున విజృంభించి, ఊర్పులు, నార్భాటములు నడర, క్రిందను, పై కెగసి మింటను పిరుదివియక, పోరాడుచుండ క్రమముగా నాంజనేయుని బలంబు తగ్గి మత్స్యవల్లభుని సత్వ మెక్కుడు

గాఁ జొచ్చినది. తన బలిమి కృశించుటను మర్కట వీరుండు దెలిసికొనెను. అతఁడు తనలో "బళీ! ఆశ్చర్యము బుట్టుచున్నది. దేవతలకు సయితము భయంబు గలిగించునా పరాక్రమము నేడు వమ్మైనది. వీనిని జయించుట కష్టమని తోఁచుచున్నది. చూచుటకు వీఁడు పసివాఁడుగ కనుపట్టుచున్నాఁడు. వీని పరాక్రమమును భుజబలమును నసదృశములుగ నున్నవి. ఇట్లే యితనితోఁ బోరాడుచున్నచో, కాలహరణమై వచ్చిన కార్యము నెరవేఱక పోవును. ఇంక చేయవలసిన విధమెట్లు? విరోధించి వీనిని సాధించుటయు గడచి యవల బోవుటయు నశక్యమగు కార్యము. సులభ సాధ్యముగాదు. కావున వైరమున నెదిరించుటచే ప్రయోజనము గలుగదు. సామంబున వచ్చినపనిఁ జక్కబెట్టుట మంచిది, కలహించుట మాని వీనితో చెలిమి గలుగ మాటలాడి లోఁబఱచుకొని యెదను. "వివేకముగలవాఁడు, సమయా సమయంబులు దెలిసికొని, బలాబలంబులం జూచుకొని కార్యావసరమును బట్టి ప్రతి వీరునకు లొంగియైనను తన ప్రయత్నమును నెరవేర్చుకొన వలయు"నని యభిజ్ఞులు బలుకుదురు. కావున నిప్పుడు గల సందర్భమును బట్టి యీ యువకునితో స్నేహము నెరపి తప్పించుకొని పోయెదను గాక" అని నిశ్చయించి పోరాటమును మాని, మత్స్యవల్లభుని నిలువరించి, చెలిమి కనువైన శాంత వచనంబుల నిట్లనియె.

"కుమారా! నీవు వీరాగ్రేసరుండవు. భుజబల సంపన్నుండవు. నిన్నును, నీశౌర్య, ధైర్య, విక్రమంబులునుం గాంచి నేను మిక్కిలి సంతోషమును బొందితిని. మెచ్చితిని. ఇట్టి దిట్టయైన జగజట్టిని నేను చూచినదియే లేదు. నిన్ను గనిన తల్లిదండ్రులు ధన్యులు. అసమాన ప్రతాప యుక్తుండగు నీకు జననియు, జనకుండును నెవ్వరు? మొగముమాత్రము నీకు మర్కటముల మోమును బోలియున్నది. అయినను, రాక్షసుండవు గావని తోఁచుచున్నది. విరోధభావమును విడిచి నీ వృత్తాంతమును వివరింపుము. నిరాకరింపకు" మని యడిగెను. ఆ పలుకులు విని మత్స్యవల్లభుఁడు పకపక నవ్వి "ఓరి! కోతీ! నీగర్వ మిప్పటికి కడంగినదా? నాశక్తిని దెలిసికొంటివా? బికారి వానరుఁడా! నీవా నన్ను జయించువాఁడవు. మొదటి నీబిగువు మాటలన్నియు నిపు డెందుబోయినవి!

పొగరు గ్రుంకినంతట జయించుటకు శక్యముగాదని యెంచి మంచి మాటలాడఁ దొడంగితివా? ఇసీ! అల్పుఁడా! నీవు యెన్నిటక్కులు బన్నినను, నిన్ను పురంబులోనికి విడువను. అడుగైన దాటనివ్వను. ఆ యాశను విడువుము. లొంగి మంచి మాటలాడఁ జొచ్చితివి. కావున నిన్ను చంపుట లేదు. ప్రాణములు దక్కించుకొని పోయి బ్రతుకుము. ఇంక నా తల్లిదండ్రులనుగాని నా వృత్తాంతమును గాని నీవు విచారింప నేమిటికి? తెలిసికొనుటచే నీకుఁ గలిగెడి లాభమె య్యది. ఊరక వదరక నోరు మూసికొని యిక్లే పొమ్ము పొమ్ము" అని చులకనగాఁ బలికెను.

మత్స్యవల్లభుండు తన జన్మప్రకారమును హనుమంతున కెఱింగించుట.

హనుమంతుఁడు వానింగని "గుణవంతుఁడవగు వీరాగ్రేసరా! అటుల నిరాకరించుట పాడిగాదు. నీ వృత్తాంతము నడిగినది లాభము కొఱకుగాదు. ఇంత చిన్న వయసుననే యిట్టి బల పరాక్రమములు గలవాఁడవగు నీ జననీజనకు లెవరో ఆపుణ్యాత్ముల వృత్తాంతమును విని సంతసింప వలయుననెడి యాసక్తితో నడిగితి. నాకోరిక దీరుటయే నీచరిత్రమును వినుటచేత నాకుఁ గలిగెడి ప్రయోజనము ఇంతగా నడిగినంతట నీవు చెప్పకుండుట యుక్తముకాదు. నామాట ద్రోయక వివరింపు" మని యడిగిన నమ్మహావీరుండగు యువకుఁడు వాతాత్మజునితో యిట్లనియె.

ఓయి వానరుఁడా! నీవు నావృత్తాంతమును దెలుపుమని మిగుల వినయముతో నడుగుచున్నావు. ప్రియము గదురనడిగినంతట నిరాకరించి చెప్పకుండుట యోగ్యుని లక్షణము గాదు. వినుము. నా తండ్రి జగద్విఖ్యాత చరిత్రుండును నిరుపమాన శౌర్య, ధైర్య, పరాక్రమ భుజాబల శోభితుఁడును, పరవీర భయంకరుండును మహాసమర్థుండును నగు నంజనీ కుమారుండు. హనుమంతుఁడు. తెలిసికొనుము. తల్లియన్ననో, మత్స్యము. నేను మత్స్యగర్భ జాతుఁడనైన కారణముననే నాకు మత్స్యవల్లభుం డనెడి పేరు గలిగినది" — అని చెప్పెను.

మత్స్యకుమారుం డివ్విధమునఁ బలుకగనే యాంజనేయునకుఁ గలిగిన యాశ్చర్య మింతింతగాదు, అతఁడు తనలో "ఏమీ?

ఇతనితండ్రి యాంజనేయుఁడా ? తల్లి మీనమా ? ఇంతకు మించిన వింత లోకమున నేమి గలిగియుండును. నేనుబ్రహ్మచారిని. నాకు భార్య యెక్కడిది ? అదియును మీనమా ? చేప యెట్లు నాభార్య యయ్యెను ? దాని నెచట యెప్పుడు బెండ్లాడితిని. ఇంతటి కొడుకు గలిగిన దెన్నఁడును నేను విన్నదియుం గన్నదియును లేదు. వీఁడు ఇప్పటివరకును నేనెవఁడ నగుటయు నెఱుంగఁడుగదా ? ఇంత దృఢముగాఁ జెప్పుచున్నాఁడు. దీనికేదియో కారణము గలిగి యుండవలయును. ఈవిచిత్ర వృత్తాంతమును వివరముగా దెలిసికొన వలయును. సంబంధ మెట్టిదై యున్నను, నాకార్యమున కిది కొంత యనుకూలముగా నుండునని తోఁచుచున్నది'' — అని యెంచి చేప కడుపునఁ బుట్టిన వానితో నిట్లనియె.

"ఓహో! వీరాగ్రేసరా! నీవు హనుమంతుని పుత్రుఁడవా ? కావుననే నీకు కపిముఖము కలిగియున్నది. అంతటి మహావీరునకు నందనుండవై నవుడు, బలపరాక్రమంబుల కేల కొదువ కలుగును ? సరి ! సంతోషించితి. కాని, చెప్పనేచెప్పితివి వివరముగాఁ జెప్పి నాశంకను నివారింపుము. రామదూతయగు హనుమంతుఁడు సీతను వెదకుటకు బోయినది సమీపకాలముననే యనుట నెఱుంగుదును. అతనికిని మత్స్యమునకును సంపర్కము గలుగుటయు, నింత శీఘ్రమున నీవు మీనుకడుపునఁబుట్టి యింత వయసు గలవాఁడవును, శక్తిమంతుఁడ వగుటయు నెట్లు సంభవించును ? పరస్పరము నీవాక్యములు సరిపడకున్నవి. వివరముగాఁ జెప్పినంగాని, నాసంశయము నివారణముగాదు'' — అని పలికిన, నతని కతం డిట్లనియె.

ద్విపద.

వినరోరి వానర-వినుపింతునీకు। ననఘుఁ డిక్ష్వాకు వం-శాబ్ధిచంద్రుండు
రామభద్రుండు భా-ర్యయుఁ దమ్ముఁడైన। సౌమిత్రియును వెంటఁ-జను [దెంచుచుండ
తనతండ్రి పంపున-దండకాటవికి। వనవాస మొనరింప-వచ్చియుండంగ
నతనిపత్నిని రావ-ణాసురాధముఁడు। కుటిలకంబుతోఁ జెఱఁగొని పోయె [నంత

నా రాఘవుఁడు వాన-రాధిపుఁడైన। సూరనందనునితో-సారదిసఖ్యంబు జేసి కోతులబంచె-సీతను వెదుక। నాసమయంబున-హనుమంతుఁ డనెడి ప్రతిలేనిశక్తి సం-పన్నుండు తాను। ధృతిమీర దక్షిణ-దిక్కునకరిగి శతయోజనాయత-జలధి లంఘించె। నతనిమై చమరించి-యుత్తరిచెమట బిందువుల్ జాఱియు-బ్ధినిఁ బడుచుండె। నందునాజననిమ-త్స్యం బట్టివేళ మెఱయుచు వేడ్కతో-మీఁదికిఁ దేలి। తెరచిననోరొప్ప-దివిజూచుచుండ నొకచుక్క చెమ్మట-యొయ్యననోటఁ। శకులికిఁ బడియెను-చట్టనదాని మ్రింగె నానాతల్లి-మీనంబుచూలె। సంగెనంతనె నేను-శకులిగర్భమున నుదయించితినివృద్ధి-నొందితినపుడె। యిదిదైవసంకల్ప-మెఱుఁగఁజెప్పితిని.

నేను పెద్దవాఁడనుగా నేర్పడుటయు, నాజననియైన మీనము యీ వృత్తాంత మంతయు నెఱింగించి "తనయా! మహాబలనందనుండును మహాబలుండును నగు హనుమంతునివలనఁ గలిగినవాఁడవగుటచే, నీకాఘనునివంటి బలపరాక్రమములు గలిగి పరవీరభయంకరుండవై వర్తింపఁగలవు. ముందొక సమయంబున నీకును నెవని చెమ్మటవలన నీవు గలిగితివో, యట్టి నీ తండ్రియైన వాయుపుత్రునకును పరిచయ మేర్పడఁగలదు. పొమ్ము. సౌఖ్యంబున నీయిచ్ఛవచ్చినట్లు వర్తింపు" — మని యాదేశించి నీటిలోఁ జొచ్చెను. అంత నేను సముద్రతీరమున సంచరించుచుండగా, ఈ పురాధిపతి యగు మైరావణుండు విహారార్థముగా నచ్చోటికివచ్చి, నాబలపరాక్రంబులను దెలిసికొని సంతసించి తోడ్కొనివచ్చి, ముప్పదికోట్ల రక్కసులకు నన్ను నాయకునిఁ గావించి యీ ద్వారంబున నుండుమని నియమించె. అదిమొద లతని యాజ్ఞను తలఁదాల్చి యీ కోటగవనిం గాపాడుచు, గాలినైనను జొరనీయక కడుజాగ్రతతో నిచ్చోట గాచియున్నాఁడను. ఓమర్కటుఁడా! ఇది మదీయ జన్మప్రకారము. కావుననే నాకుతండ్రి హనుమంతుఁడని చెప్పితి. తెలిసినదా? వింటివిగదా? ఇంకఁబొమ్ము. పురంబుజొచ్చుటకు నీకు శక్యముగాదు"—అనియెను

ఆంజనేయుని యాశ్చర్యమునకు మేరలేదు. విన్నచరిత్ర మద్భుతమైనది. "కానిమ్ము. ఇదియును మంచిదియే! వీనిని లోఁబరచుకొనుట కనువేర్పడినది. నన్ను వీని కెఱింగించి, వీని సహాయంబున

వచ్చిన కార్యమును నెఱవేర్చుకొనెదను గాక'' యని యోచనఁజేసి మత్స్య వల్లభునిఁజూచి శూరవరేణ్యా! ఎవ్వని చెమ్మటవలన విూ నోదరంబున జన్మించితివో, ఎవ్వని నీవు నీతండ్రియని పలికితివో, యా హనుమంతుడను నేనేయని చెప్పుచున్నాను. నేనే సీతాదేవిని వెదకఁబోవునపుడు సముద్రమును దాఁటినవాఁడను. నీవు నాకుమా రుండవగుటఁ దెలియఁగానే, నాలోఁ బొడమిన సంతోషమునకు మేర యే లేకున్నది. పుత్రకా! తలంపని తలంపుగా నిన్ను సంధించుటయు పుట్టిన దాదిగా నెఱుంగని నాకొడుకవగు నిన్ను చూచుటయు, నానందించుటయు, భగవత్సంకల్పమువలన తటస్థించిన యదృష్టము గాని యన్యముగాదు. ఇంతటి యుత్తమ గుణములుగల బల పరా క్రమ యుక్తుండవుగా నొప్పు నిన్ను కొడుకుగాఁ బడసిన నేతయు ధన్యుఁడను. నాభాగ్యమే భాగ్యము. కలనైనను దలంచియుండని యున్నతి సంతోషమును నేఁడు పొందఁగంటిని'' అని పలికెను.

ఆంజనేయుఁడు చెప్పినమాటలా మత్స్యవల్లభున కసహ్యము లుగాఁ దోఁచినవి ''ఇసీ! ఈ యంబేద కోతియా నాజనకుఁడైన హనుమంతుఁడు సముద్రమును దాటిపోయిన నాఁటి, యా మహాను భావుని రూప లక్షణములన్నియు నాజనని నాకు బాగుగఁ దెలిపి యున్నది. వీఁడెక్కడ? నా తల్లి చెప్పిన వాయుపుత్రుని లక్షణము లెక్కడ. ఇంచుకైనను పోలికయున్నదా? ఈ ముక్కిడి వానరుఁ డఁట? తాను హనుమంతుఁడట. నన్ను మోసగించి యెల్లెనియుం బురంబులోని కరుగవలయునని, వీఁడు యీయెత్తు వెదకినట్లున్నది. ఔరా! బికారికోతీ! ఎంత తంత్రగాఁడవురా? ఈపలుకులు విని నేను మోసపోవుదునా? కానిమ్ము. వీని యాటలన్నియు నింకను బాగుగఁ దెలిసికొనెదను గాక'' అని తలపోసి, యనిల నందనునితో నిట్లని యె.

హనుమంతుఁడు మత్స్యపుత్రునకు నిజస్వరూపముఁ జూపుట.

''ఓయీ! టక్కరీ! నీపలుకులు నమ్ముదునని తలంచితివా? నేను మోసపోవువాఁడనుగాను నాతో నిట్లు దుర్వచనంబులు జెప్పి నందుకై నిన్ను జంపవలయును. కాని, పాపము! లోఁబడినవాఁ డవగుటచే నటులఁ జేయనొల్లను. నీవంటి హీనుండు జగన్నుతుఁ

డైన నాతండ్రి హనుమంతునికి సాటియగునా ? నేనే హనుమం తుఁడ నంటివిగదా ? ఏదీ ? సముద్రమును దాటిపోయి నప్పటి యాకృతి యెట్లు పోయినది ? ఈ రూపముతో నీవు సాగరమును లంఘింతువా ? దాటఁగలవా ? ఎట్లు నమ్మించవచ్చునని యెంచితివి ? ఇంకఁ బ్రేలక నీదారిం బట్టి యరుగు" మని పలికెను.

ఆంజనేయుండు నవ్వి "కుమారా ! నేను తప్పుగాఁ జెప్పలేదు హనుమంతుఁడను నేనే ! నీవు సందేహింప వలద నెను "ఏమీ ? నీవేనా ? సమీరనందనుం నాతల్లి చెప్పి నేను వినియున్న యాకృతి యిట్టి యల్పమైనది కాదే ? ఈరూపముతో నొక పిల్ల కాలువను సయితము దాటుటకు శక్యముకాదే సముద్రమునెట్లు దాటఁగలవు ? నీవాక్యములను నమ్మ నొల్ల" నని మత్స్యవల్లభుండు హేళన ముగా ననెను. అపుడు వాయుపుత్రుఁ డతనితో "నేను కామ రూపమును దాల్ప నేర్తును. ఎపుడే యాకారమును నొందవలయు నని తలంతునో యాయాకృతిని సమయానుగుణ్యముగ దాల్చుచుం దుదు. కడలిని దాటినప్పటి మదీయ రూపమును చూడఁదలంచితి వేని కనబరచెదను చూడు" మనిన "ఏదీ ? ఆ యా కృతినిఁ జూపుము. నేవిని యున్నదానికిని నీవు గనపరచు రూపమునకును లక్షణములు సరిపడియుండెనేని నీవచనంబులు నమ్మెదను" — అని చెప్పెను. అతనికి నమ్మిక బుట్టుటకై ప్లవంగవీరుండు, సీతాన్వేష ణమునకు బోవుచు జలనిధినిదాటు సమయమున నెట్టి యాకృతితో నుండెనో యారూపమునుదాల్చి "మత్స్యకుమారా ! ఇదె చూచి తివా ? నీవు వినిన లక్షణములన్నియు నమరియున్నవా ? ఇపుడైనను నేను హనుమంతుఁడ ననినమాటను నమ్మెదవా ?" యనియడిగెను.

లోకంబులెల్ల కబళింపఁజాలియున్న భయంకరమైన యామహ దాకృతింగాంచి, భయాశ్చర్య మగ్నమానసుఁడై, తల్లివలన విని యున్న సర్వలక్షణంబులు నమరియుండుటచే యతఁడు తనతండ్రియగు మరున్నందనుండేయని నిశ్చయించి తటాలున ప్రదక్షిణ నమస్కృతు లొనరించి, వినయవినమిత శిరుండై చేతులుమొగిచినిలిచి "మహాత్మా ! తెలియక నీయెడల నమర్యాదగా వర్తించితి చులకనగ మాటలా డితి. అజ్ఞుఁడనగు నాయపరాధములు క్షమింపుము. చూచుటకే

శక్యముగాని నీమహోగ్రాకారము నుపసంహరించి, సాధారణాకృతిని దాల్చి, నీతనయుఁడనగు నన్ను కరుణాదృష్టులం గని మన్నింపుము. నేనొనరించిన యక్రమ ప్రసంగమున కైకినియకు'' మని దీన ముగా పలుతెఱంగులఁ బ్రార్థించె.

అంత నాంజనేయుఁ డతని వేడికోలు నంగీకరించి యెప్పటి రూపుఁ గైకొని "మత్స్యనందనా! నీపై నణుమాత్రమును నాకు కోపములేదు. జన్మించిన దాదిగ నన్ను నీవును, నిన్ను నేనును చూచియున్న వారముగా మైతిమి. భగవత్సంకల్పంబుచే హటాత్తు నిగా నిపు డిచట సంధించుట తటస్థించెను. ఇది శుభదివసము. నాకంటె నధికుఁడవైన నిన్ను కుమారునింగాఁ బడిసి నేను కృతా ర్థుఁడనైతి. నాయానందము చెప్పితీరదు'' అని పలికి యనురాగం బెలుకపడ నతనిం గాఁగలించెను. మత్స్యవల్లభుండును మహాసం తోషమును బొంది, భయభక్తు లతిశయింపఁగా వినయోక్తుల నిట్లనియె.

కథాసరణి—ద్విపద.

ఏమినిమిత్తంబున నీవిచటికి - యీరాతిరి వేళ
నేమాడ్కిని జనుదెంచితి లెవ్వరు - నెఱుగరుమార్గంబు
దేవతవైనను జొరలేరీపురి - త్రోవ నెరుగ లేరు
నీవేవిధమునఁ దెలిసికొంటివో - నేఁడు దెలియరాదు
దారిలోని యాటంకములెల్లను - నేరుపుతోగడచి
క్రూరులఁగావలి యుండెడిరాక్షస - కోటులఁగికురించి
అరుదెంచినదెట్లో నామనమున - నాశ్చర్యముగలిగె
సరగునఁదెలియఁగ బలుకుముసంతో - షంబెసంగఁదండ్రీ!

అని ప్రశ్నించిన, నంజనీపుత్రుం డక్కుమారునకు, శ్రీరామ చంద్రుండు వనవాసార్థము దండకా టడవికి వచ్చినది మొదలుగా, తానపు డచ్చటికి వచ్చినంతవరకును జరిగిన చరిత్రమంతయును బోధ పడునట్లు సంగ్రహముగాఁ దెలిపి, మైనంతట నిట్లనియె. కుమారా! మత్స్యవల్లభా! వృత్తాంతమంతయును వింటివిగదా! పరమ దుర్మా ర్గుండైన యా దశముఖుండు, సత్వంబు దఱిగి, తనకు జయము

గలుగదని దృఢముగా దెలిసికొని, యడియాస విడువక, యీమైరా వణుని రప్పించి ప్రాణభయముచే పాదంబుల పైఁబడి రక్షింపుమని ప్రార్థించిన, దురాత్ముఁడగు నిమ్మాయకాఁ డతని రక్షించునట్లు వాగ్దానముఁ జేసి, సూర్యోదయమునకు పూర్వమే, రామలక్ష్మణుల నిప్పురంబుననుండు భద్రకాళికి బలి యొసంగునట్లు నమ్మ బలికివచ్చి, తన పూన్కిని నెరవేర్చువాఁడై, మమ్ము నెల్లరను మోసగించి, నిద్రితులై యున్న రఘువీరులం గొనివచ్చినాఁడు.

నేను విభీషణునివలన దారిఁ దెలిసికొని దారిలోని కష్టము లను మహా ప్రయాసతోఁ దప్పించుకొని యిచ్చోటికిఁ జేరి, నీచే నిరోధింపఁబడితిని దైవికముగా నిన్ను నా పుత్రుండవని దెలిసికొం టిని. తనయా! ఇపుడు నీవును పరమ పావనులగు దశరథాత్మజుల రక్షించు విషయమున తగిన సహాయముఁ జేయవలసియున్న ఈ పని మిక్కిలి న్యాయ సమ్మతమైనది. ఇపుడు రెండవ యామము తుద ముట్టవచ్చినట్లున్నది. ఇంకను నాలస్య మొనరింపకూడదు. కనుక, నేను పట్టణంబులోని కెటుల పోవలయునో, పోవునపు డెచ్చటెచ్చట నేమేమి యాటంకములును, నాపదలును గలుగునో, రామలక్ష్మణుల నెవ్విధంబున ప్రాణ హానిలేక రక్షింపఁదగిన విధానమో, యీపాతా ళలంకలోని తంత్రములును విశేషములును నెట్టివో, యెఱింగించి, వచ్చిన పనిని నెరవేర్చుకొని పోవుటకుం దగిన యుపాయంబును దెలి యఁ బలుకు'' మనియెను.

మత్స్య వల్లభుం డాంజనేయుని పలుకులువిని. ఇంచుక తడ వాలోచనఁజేసి యిట్లనియె. ''మహానుభావా! నీవు నాతండ్రివి, మఱియు రామ కార్యార్థివై వచ్చినవాఁడవు. మన సంబంధమును బట్టియు, నీవు చేయఁ దలంచినది పరమ ధర్మమైన యుత్తమ కార్య మగుటను బట్టియు, నా శక్తికొలందిని నీకు సహాయముఁ జేయవలసి నది తప్పని విధియై యున్నది. చేసియే తీఱవలయును. అయినను నొక ధర్మమును ముఖ్యముగా నాలోచింప వలసియున్నది. ఏమ నఁగా,

మత్స్యవల్లభుఁడు హనుమంతునకు పాతాళ లంకారహస్యము
లెఱింగించుట.

గీ॥ అన్నవస్త్రంబులొసఁగిన-న్నాదరించి।పరువుగఁ గొప్ప సైన్యాధి-పతినిఁ [జేసి
నావలన పనిఁగొనెడిమై-రావణునకు। కీడుగావింప నెట్లు దె-గింతు నేను.

ఆ॥ వానియుప్పుఁదినుచు-వానినిఁగొలుచుచు।యుండువాఁడనగుట-యోగ్య [మనుచు
మర్మములనుజెప్పి-మదికృతజ్ఞత నెంచ।కపకృతింబొనర్పు-టర్హమగునె?

జనకా! నీకు దెలియని ధర్మంబుల నేను చెప్పఁగలవాడనా? న్యాయంబులెల్ల నీవెఱుంగుదువు. ధర్మ మిటులనుండినను, భవ్య గుణాకరులగు రాఘవు లిపుడు గొప్ప యాపదలోఁ జిక్కియున్నారు. వారిని రక్షించికొని పోవుటకొరకు పడరాని ప్రయాసలను బొంది యింతదూరము నీవు వచ్చితివి ఈ నిమిత్తమునన్నైనను నీ సందర్శన భాగ్యము నాకు లభించినది. ఇది నాపుణ్య విశేషముగాని యన్యము గాదు. కార్యార్థివై వచ్చిన నా ప్రియ జనకుఁడవైన నీకు కొంత యైనను సహాయము చేయకుండుట తగదు. కావున కొన్ని విషయ ముల నెఱిఁగించుచున్నాను. నేను దెలిపిన చందమునఁ బోయినచో నీకు కొంతవరకును ననుకూలముగా నుండును వినుము. ఈ కోటను దాటి పోయినంతట గొప్ప తటాక మొకటి జల పూరితమైనది దారికడ్డముగా నుండుటను కనుఁగొనఁ గలవు. ఆ నీరుచూచుటకు లోఁతు లేకున్నట్లు తోఁచును. కాని యది యగాధమైన మాయా తటాకము. దానిలోఁ దిగవలదు. దాటి యవ్వలి దరిఁ జేరుము. సముద్రమును లంఘించిన నీకు యీ చెఱువును దాటుట కష్టము గాదు గదా? ఆవలి గట్టునకుఁ బోయినంతట బంగరు కోట గవనియు ద్వారము తులయుఁ గానవచ్చును. ఆ ద్వారమును పరుల సహాయము గలిగిననే గాని స్వయముగాఁ జొచ్చి పోవుటకు శక్యముగాదు. అట్టి సహాయులైనను, యీపురములోని వారుగనే యుండవలయును. కాని యన్యులైన నుపయోగము లేదు. అటుల ననుకూలమగు సహా యము లభించినను, విరోధి యైనవాఁడు చొచ్చినచో, ద్వారములో వేలుచున్న తుల యిటునటుఁ జలించి, తటాలున విఱిగి కూలును.

అచ్చట గావలి గాయుచుండెడి, మితిలేని రాక్షస వీరులు వచ్చిన
క్రొత్తవానిం గనుంగొని పట్టి వధింపుదురు. చీమయైనను వారికిఁ
దెలియక లోని కరుగుటకు తరముగాదు. ఆలాగు వచ్చిన శత్రువు
నారక్కసులు జంపినంతట విఱిగి కూలిన త్రాసు, తటాలున తనకుఁ
దాన యంటుకొని మరల నెప్పటివలె వ్రేలుచుండును.

తండ్రీ! మఱియొక మహోపద్రవకరమైన రహస్యమున్నది,
దాని నెఱుఁగుట మిగుల కష్టము. ఏమనఁగా, తులాద్వారమును
దాటి యించుకదూర మరిగినంతట దారిలో మాయా యంత్ర
చక్ర మొకటియున్నది. అది సదా మనోవేగంబున దిరుగుచుండును
గాని, యిచ్చటివారికి దప్ప యొరుల కది గనిపించునది కాదు. దాని
మీదుగా నడచి పోవలయునే గాని, పురంబులో ప్రవేశించుటకు
వేఱు దారిలేదు. అన్యుఁడా చక్రముపై నడుగిడెనేని, యర నిమి
షములో వాని దేహము పిండియై పోవును. ఇచ్చటివారు పోవు
నపుడా చక్రము నిలిచియుండి వారు దాటి పోయినపిమ్మట మరల
తిరుగుట కారంభించును. దానిని గడచి పోయినంతట దాపునే
కోట్లకొలంది రాక్షసులచే రక్షింపబడుచున్న రమణీయమగు పురద్వా
రమున్నది. అందు జొచ్చి పోయినచో, మైరావణ పాలితంబైన,
దేదీప్యమాన గోపురంబులతోడను మేడలతోడను, సొంపైన చంద్ర
శాలలతోడను, నొప్పు పాతాళ లంకాపట్టణమునఁ జేరుదు.

అందు సువర్ణ రత్న నిచయ నిర్మితంబై ప్రకాశించు భద్ర
కాళి దేవాలయము నీకు గోచరించును. పురమధ్యంబున మైరావ
ణుండు నివసించు దేవేంద్ర భవనమువంటి నగరు విలసిల్లుచుండును.
మైరావణునిచేఁ జిక్కిన వారతండు జచ్చిననే గాని బ్రతికి పోఁజా
లరు. అటుల నతండు వరమును బొందియున్నాఁడు. వానివలనఁ
గొని రాఁబడిన రామలక్ష్మణు లిపుడు కాళికాలయములో నుంచఁ
బడియున్నారు గుడివాకిట కోట్లకొలంది రక్కసులు కావలియుందురు.
ఈ చెప్పఁబడిన చిక్కులన్నియుం దప్పించుకొని, యచ్చటచ్చటం గల
నిశాచర కోటులను జయించి నీవు కాళికాలయమున కరిగి దశరథా
త్మజులం బొడగని, యా మహాశక్తిని ప్రార్థించి కరుణవడసి, మైరా
వణునిం జంపి, వారిని గొని రావలయును. మైరావణునిఁ జంపు

విధమును నేను చెప్పకూడదు. అచ్చటి కరిగినంతట యా విషయ మును దెలిసికొనుట కను వేర్పడును. తెల్లవారుటకు లోపల నీ-త కార్యమును జరిగించి రాజపుత్రులను గొని రావలసియున్నది. మహాత్మా! అసహాయ శూరుండవును. దైవబలోపేతుఁడవు నగు నీకీపని దొడ్డది గాదు. శ్రీఘ్రముగఁ బోయి, సర్వకార్యములను నెరవేర్చి రామ లక్ష్మణులం గొనిరమ్ము. మూడవ యామమారంభముగానున్నది''— అని చెప్పి నమస్కరించెను.

హనుమంతుఁ డతని రాజభక్తికిని, న్యాయవర్తనమునకును సుగుణసంపదకును సంతసించి, విభీషణునకు సయితము తెలియని కొన్ని విషయములు జెప్పినందు కతనిఁ గొనియాడి దీవించి, యట నుండి కదలి, మాయాతటాకమును దాఁటెను. కాని, తులాద్వా రమును గడచిపోవుట యెట్లా యని, యుపాయంబుదోచక యాలో చనఁ జేయుచు నించుక తడవచట నొకచోటఁ గూర్చుండెను. దైవాను కూలము గలవానికి సకల కార్యములు ననుకూలముగనే యొనగూ డుచుండును గదా ? ఇపుడు సమీరనందనున కటులనే సందర్భ మేర్పడినది. ఏలాగు ననఁగా,—

దోర్దండి నీరు గొనిపోవుటకై కలశముఁ గొనివచ్చుట.

కథాసరణి—ద్విపద.

అకటా ! క్రూరుఁడ ! మైరావణ ! యా – యన్యాయము తగునా ?
సుకుమారు లరవి – సోముల కెనయై – శోభిల్లెడివారి
నతులిత సౌందర్యా న్వితులను క – ల్యాణగుణాకరుల
క్షితివరసూనుల రామలక్ష్మణులఁ – జెచ్చెరఁ గొనివచ్చి
పొరిగొనఁ బూనితివేలా ? యీదు – ర్బుద్ధి గలిగెనీకు ?
స్థిరముగ నీవంశము వర్ధిల్లునె ? – చెడక నింకమీఁద
పాపాత్మక యివ్విధమునఁ జేయుట – పాడియగునె నీవు
యేపాటిగ మేలొందగఁ బోయెద – వేపడంగిపోక.

అని మైరావణుని నిందించి పలుకుచు జాలిఁబొందిన మాట లతో, రామలక్ష్మణులం గూర్చి దీనంబుగా యిట్లనిపలికె.

చ॥ వినుత గుణాఢ్యులార ! పర - వీరభయంకర రమూర్తులార పా
వన మతులార ! ధర్మపథ - వర్తనులార ! మహాపరాక్రమం
బును గలవారలయ్యును - పూర్వభుజాబల యుక్తులయ్యు నీ
దనుజున కెట్లు జిక్కితిరి ? - దాఁగొని వచ్చి వధింపనున్న వాఁ
డనుచిత కార్యమంచుఁ దన - యాత్మఁ దలంపక పాపశీలుఁడై
కనికరమేల దుష్టునకుఁ - గల్గును మీయెడ ? నింకమీఁదటన్.

ఉ॥ ఏవగ మోసగించి మిము - నిచ్చటికిం గొనివచ్చె నొక్కమై
రావణుఁడేలనో తెలియరాదు నిమిత్తము లోకవంద్యులన్
కావర మొప్ప నిత్తరిని - కాళిక కుంబలిసేయ నున్నవాఁ
డీ విపదబ్ధిదాటి దరి-నెవ్విధి మీరలు జేరనేర్తురో ?

నాబుద్ధికే వెరవును దోఁచలేదు. పులిబారిఁజిక్కిన మృగం బునకు బ్రతుకెక్కడిది ? పరమదుష్టుఁడు — పాపకర్ముఁడు — దయా హీనుఁడు — ఈ యసురాధముఁడు — ఈ మైరావణుఁడు — వీనిచేఁ జిక్కి తప్పించుకొనిపోవుట సాధ్యమగునా ? అయ్యో ! శక్యముగాదే ! అయ్యో ! అయ్యో ! ప్రాణముల దక్కించుకొనుట యెట్లు ? ఓరిక్రూరుడా ఓరిమైరావణా ! యీదశరథనందనులు నీకేమైన నపకృతిఁ గావించిర్యా, నీతోడ విరోధించినారా ? నీకును వీరికిని నింతకుమునుపు వైరమే మైనం గలిగియుండెనా ? ఏదియును లేదుగదా ? మఱియేల ? రాత్రి కాలమున — నిద్రించుచున్న సమయమున — నెటులనో — ఏమాయఁ గావించితివో, కొనివచ్చితివి. వధింపఁ బూనితివి. ఛీఛీ ! పరమ ద్రోహీ ! కపటవర్తనా ! నీవు మేలొందఁజాలవు. అంత్యకాలము తటస్థించుటచేతనే యిటువంటి చెడుబుద్ధులు నీకుఁబుట్టినవి — ఓపర మేశ్వరా ! నిరపరాధులను — రామలక్ష్మణులను — చంపుటకు కంక ణముఁ గట్టిన యీమాయకాని బారినుండి తప్పించి రక్షింపుము రక్షింపుము ” లని యిట్లు దుఃఖపూరితమగు మాటలతో, గద్గద స్వరముతో నొక పైడిబిందియ నరకటనిడ్డుకొని యువతి యొకర్తు తనకుదాన బలుకుకొనుచు జలాశయంబు కరుగుదెంచియుట నిలిచెను, ఆమె యాసమీపమునఁ గూర్చుండియున్న యాంజనేయునిఁ జూడనే లేదు. కాని, యాయువతి పలుకులన్నియును హనుమంతునకు స్పష్ట ముగా వినవచ్చినవి.

రామలక్ష్మణులకు పరమ శత్రుస్థానమైయున్న యా రాక్షస పురంబులో, నంతటి జాలినిబొంది రఘువీరులం గూర్చియు, వారికిఁ గలుగనుండెడి యాపదనుగుఱించియు నవ్విధంబున, నట్టి రాత్రివేళ, నొంటరియై వచ్చి యటనిలిచి, చింతాకులమానసయై తనకుఁ దాన మాట లాడుకొనుచున్న యామె యెవ్వతయో, యచ్చోటి కేల వచ్చినదో, దశరథాత్మజులపై యంతటి కనికర మామె కెందు వలనఁ గలిగినదో, హనుమంతునకుఁ దోచినదికాదు. అతఁడు మెల్లగా నమ్ముగుదయొద్దకుఁబోయి పలుకరించి, "విషయంబు నడిగి తెలిసి కొనవలయు" ననియు "రఘువీరులను గూర్చి యంతటి పరితాప మొందుచున్న యామె నడిగినయెడల తద్వృత్తాంతమును జెప్పఁగలదు గాని నిరాకరింప" దనియు, నొకవేళ "తనకార్యమున కప్పుడతివలన గాదగిన సహాయము గలుగునేమో తెలిసికొనవచ్చు" ననియు నెంచి లేచి వచ్చి యామె ముందు నిలిచెను.

అది రాత్రికాలము. ఆసమయమున నచ్చోట నన్యు లెవ్వరును లేరు. ఆడుదియగు తనముందు హటాత్తుగా కోతియొకటి వచ్చి నిలుచుటయు, ధైర్యముగల రాక్షస స్త్రీగానుండినను, నామె కతనినిఁ జూడఁగనే యధికమైన భయముగలిగి యొడలు గడగడ వడంకఁదొడంగెను. మఱి యెవ్వరినైనను బిలుచుటకుగాని మాటలాడుటకుగాని శక్యముగా నుండదయ్యె. తత్తఱపాటుతో దిక్కులు చూచుచు కర్తవ్యము దోచక, వెల్లఁబోయి భ్రమొన్పడి యట్టె నిలిచియుండెను. అపుడు తన యాకృతినిఁ గని, యాయువతి భీతిల్లినదని యనిల నందనుండు తెలిసికొని యామెకు గలిగిన భయమును తొలంగించి, ధైర్యముఁ గొలిపి, సంభాషింపనెంచి, మృదువులగు పలుకు లొప్ప నతం డామెను పలుకరించి యిట్లనియె.

హనుమంతుఁడు దోర్దండితో సంభాషించుట.

"అమ్మా! జడియకుము. నావలన నేవిధమైన కీడును నీకు గలుగదని దృఢముగ నమ్ముము. నేను చెట్టఁగలిగించుటకై వచ్చిన వాఁడను గాను. నా వృత్తాంతమంతయుం జెప్పెదను వినుము. చెప్పినంతట నేనెవండనో, యేల వచ్చితినో నీవు తెలిసికొనఁగలవు" అని చెప్పి, బోధపడదగినట్లు ముఖ్య విషయములు విడువక, తక్కిన నిజ

వృత్తాంతమంతయును సంక్షేపముగా నెఱింగించి, ఏమి చేయుటకును సదుపాయము దోఁచక యాలోచనఁజేయుచు, నావంకఁ గూర్చుండి యుంటిని. ఇంతలో నీవు వచ్చితివి. వచ్చినదానవు నేనెవరికై యరు గుదెంచితినో, యా మహాత్ముల రామలక్ష్మణులం బేర్కొని, జాలి తోఁగూడిన దుఃఖ వాక్యంబులు బలుకుచుండు నీమాటలను వింటిని. ఇచ్చోట నిటువంటి పలుకులు వినవచ్చుట కెంతయు నచ్చెరువునొంది, ఇంతటి ప్రేమ దాశరథులయందు గలిగి పరితపించుచున్న నీవెవ్వ తవో, ఈవేళ నిప్పు డిచ్చటి కేల రావలసి వచ్చినదో, యడిగి తెలిసికొన వలయుననెడి తలంపుతో నీయొద్దకు వచ్చినాఁడను. నా పేరు హనుమంతుఁడు రామచంద్రుని సేవకుఁడను. సుగ్రీవుఁడనెడి రాజు నకు మంత్రిని. ఓ పుణ్యవతీ! నా వృత్తాంతము సర్వమును దెలియఁ జెప్పితి. వెఱపుమాని దయచేసి యింక నీవు యెవ్వతెవో, అర్ధ రాత్రి కాలముననే కాకివై యిచ్చోటి కేలవచ్చితివో, రామ సౌమి త్రుల విషయమున నింతటి జాలి నీకు గలుగుటకు నిమిత్త మెయ్యది యో వివరము జెప్పి నన్ను ధన్యునిఁ జేయుము'' అతి వినయం బున నడిగెను.

దోర్దండి తన వృత్తాంతము నాంజనేయున కెఱింగించుట.

ఆమె యాంజనేయుండు చెప్పిన వృత్తాంము నంతయును విని నంతట కొంతవరకును బడుపుదీఱి, ధైర్యమును జెందినదై ''ఓహను మంతుఁడా! నీవు మహా బలవంతుఁడవనియు, నధిక పరాక్రమ వంతుఁ డవనియు సమర్థుఁడవనియు, రాముని కార్యార్థము నూఱు యోజన ముల వెడల్పుగల సముద్రమును దాటివచ్చి లంకలోఁజొచ్చి, రా వణునిచేఁ గొని రాఁబడిన సీతాదేవినిఁ జూచి సంభాషించి, యా వన మున్న యశోకవనమంతయును నాశముగావించి, యక్షయాదులగు పెక్కండ్రు రాక్షస వీరులంజంపి, లంకాపురమునకు, రామానుజుని కొఱకై ద్రోణగిరి కరిగి యోషధులను వెదకి కనబడకున్నందున పర్వ తమునే దెచ్చితివనియు, పోవునపుడు మహా మోసగాఁడగు కాల నేమిని సంహరించితివనియు, నిత్యాది విషయములు నీప్రతాపమును దెలుపునవి పెక్కులు మార్గంబునందలి రాక్షసు లొకరితో నొకరు జెప్పి యాశ్చర్య మొందుచుండగా వింటిని. అంతటి గొప్ప పనులు

జేసినవాఁ డెట్టివాఁడో గదా? యని నాలో మిక్కిలి యబ్బుర పడుచుంటిని. ఆ మహాత్కార్యముల నొనరించిన హనుమంతుఁడవు నీవేకదా? లేక మఱియొకఁ డున్నాఁడా'' అని యడిగె. "ఔను! నేనే యా హనుమంతుఁడను వాఁడను. ఈ పేరుగలవాఁడు మఱి యొకడు లేనే లే''డని యాంజనేయుండు నుడివెను. అతని వచనము లామెకు వింతగాఁ దోఁచినవి. "ఇవి టక్కుమాటలుగాఁగా నుండు నా? చూచుట కల్ప శరీరుఁడై కనుపట్టుచున్నాఁడు. అంత లేసి గొప్ప పనుల నెట్లు చేసియుండును? నేనేగాని యన్యుఁ డాపేరు గలవాఁడు లేఁడని గట్టిగాఁ బలికెను. ఈపలుకులు నమ్మదగి యుండ లేదు'' అని యామె తనలోఁ చింతించి "వానరోత్తమా! నీమా టలవలన ధైర్యము గలుగుటకు బదులుగా నాలో భయ మధికమగు చున్నది. ఏలననఁగా, నీవే హనుమంతుఁడవని నేను నమ్మజాల కున్నాను. ఏమఱించి యేదో యుపద్రవమును గలిగించుటకై వచ్చి యీలాగున పొల్లుమాటలు బలికెదవని తోఁచుచున్నది. నీస్వరూప మన్ననో యల్పమైనది. నేను విని యున్నటివియు నీవే చేసినట్లు యిపుడు చెప్పినట్టివియునైన పనుల, నిట్టి పనులు సామాన్యులు చేయఁదగినవి కావు. ఇదియే నా సంశయమునకు కారణము నమ్మ జాలకున్నాను'' అనెను. మరున్నందనుండు నవ్వి "అమ్మా! నేను యెప్పటి కెట్లు కావలెనో యారూపమును దాల్పఁగలను. నా పలు కుల నమ్మకున్నయెడల, సముద్రమును దాటి వనము బెరికి, రాక్ష సులఁ జంపి, లంకఁగాల్చి, ద్రోణగిరిం దెచ్చినప్పటి నా స్వరూపమును నీకుఁ జూపెదఁ జూడు'' మని యాపనుల నాటి మహదాకారమును దాల్చి నిలిచె.

ఆ యద్భుతాకృతిం గని యామె వెఱగంది. "అజ్ఞానము వలన నీమహిమను దెలిసికొన లేనయితిని. మన్నించి నీసౌమ్యా కారమును దాల్పుము'' అని ప్రార్థించిన నతం డట్ల గావించి "ఇప్పటికైనను నా వచనంబులను నమ్ముదువా? హనుమంతు డను నేనే యగుట నొప్పుకొనెదవా?'' యనిన నప్పడతి మ్రొక్కి "మహాత్మా! నాసంశయము తొలంగినది. ఇంక నీవు వినఁగోరిన మదీయ వర్తమానమును దెలిపెద నాకర్ణింపుమని యిట్లని చెప్ప నారంభించెను.

" మర్కటోత్తమా ! అద్వితీయాలంకార శోభితమును, నభేద్యమును, శాత్రవ భయంకరము నైన యీ పాతాళలంకా పట్టణమున కధిపతియు మహామాయావర్తన ప్రభావ ధుర్యుండును, నసమాన బలాపరాక్రమ కలితుఁడుననగు మైరావణునకు నేను తోఁడఁబుట్టువును. నా పేరు దోర్దండి. నా భర్త యుగ్రబలుండనువాఁడు. నీలమేఘుండను కుమారుం డొకండు గలఁడు. నావివాహానంతరము నాయన్న — మైరావణుండు — నేను పుత్రవతినైనంతట, నాభర్తను కుమారు నిందనకు సహాయములుగా నుండుటకై, తనయొద్దనే బెట్టుకొని, నన్ను గారాబముతోఁ జూచుచుండెను. కాని, యటుల నుండినది కొలఁదికాలము మాత్రమే !

పిమ్మట నేలనోగాని వానికి బుద్ధి మారిపోయినది. వేఱుగా నొక భవనమును నిర్మింపఁజేసి మమ్ము ముగ్గురను నందు నివసింపుఁడని చెప్పెను. అలాగుననే యా మందిరమున వాసముఁ జేయుచుంటిమి నా భర్తయు నా పుత్రుండును నెల్లపుడును నతని పనుల్లో మెలంగుచు నాజ్ఞాబద్ధులై వర్తించుచుండిరి. ఇట్లుండఁగానేదో యొక సందర్భమున నాభర్తను బిలిచి యక్రమమైన యొక కార్యమును జేయుటకు నియమించె. నామగండు రాక్షస కులజాతుఁడయ్యును న్యాయప్రవర్తనము గలవాఁడు. కావున నతఁడు చెప్పిన యా దుష్కార్యమును జేయఁజాలనని నిరాకరించెను. తరువాత నా పుత్రుని బిలిచి యాపని నొనరింపుమని యాజ్ఞాపించె. మదీయనందనుండు — నీలమేఘుఁడు — గుణప్రవర్తనములందుగాని, శౌర్యధైర్య బలపరాక్రమంబులందుగాని సుంతయుం దనతండ్రికి దీసిపోవని న్యాయబుద్ధిగలవాఁడు. కాఁబట్టి, తండ్రివలెనే యాచెప్పిన దుష్కృత్యముఁ జేయుట కొడంబడ ననియెను.

అపుడు మైరావణునకు వారియెడల మితిమీరిన యాగ్రహము బొడమె. "ఓహో ! అరచేతికి పండ్లు మొలిచినట్లున్నది. నాయాజ్ఞను లెక్కసేయక నిరాకరించిన మిమ్ము నిట్లే యుపేక్షించి విడిచి యుండరాదు. మీర లిరువురును మిక్కిలి బలశాలులు, శౌర్యవంతులు. ఇంకనుం గొంతకాలము జరిగినంతట నారాజ్య సంపదల నపహరించి నన్ను నయితము వెడలఁగొట్టఁగలరని తోఁచుచున్నది.

విషజంతువులవంటి మిమ్ము మీ స్వభావము లెఱుంగక దగ్గఱఁజేర్చుకొంటిని. ఇది నేను జేసిన గొప్పతప్పు కార్యము. మీ విషయంబున నప్రమత్తుఁడనై యుండుట క్షేమకరము"—అని యుగ్రముగాఁ బలికి, సేవకులం బిలిచి "భటులారా! కుటిలచిత్తులును, కృతఘ్నులునగు వీరి నిరువురనుంగొని చనికారాగృహ బద్ధులంజేసి, యప్రమత్తులై కావలిగాయుచుండుఁ" — డని యాజ్ఞాపించెను. వాని యాజ్ఞప్రకార మాకార్య మపుడే నెరవేర్పఁ బడినది. పెక్కునాళ్ళనుండియు, వారు చెఱసాలలో బంధింపఁబడి నానాకష్టము లనుభవించుచున్నారు.

ఆవిధమున, నాపతిని, సుతుని దయారహితుఁడై చెఱసాలలోఁ బెట్టించుటయు నేను దుఃఖాకులమానసనై దగ్గఱకుఁ బోయి, దీనముగా "అన్నా! నీకు తోడఁబుట్టవు నగు నన్నుజూచి యైనను కనికరించి, నామగనిని, కుమారుని, విడిచిపెట్టుము. మేము నీయొద్ద నుండుట సమ్మతముగా దేని మేము యీ పురంబునువిడిచి యెచ్చటికైనను మఱియొక చోటునకుఁ బోయెదము. నా ప్రార్థన నంగీకరించి నాకోర్కెను దీర్పుము. కరుణింపుము. వారి తప్పులను మన్నింపు" — మని పలుతెఱంగులఁ బ్రార్థించితి. కాని యాతని నాత్మని మానసము గరగి, జాలిగలుగదయ్యె. నన్నుఁజూచి కన్నులెఱ్ఱఁజేసి, పటపటఁ బండ్లుగొఱుకుచు "ఛీ! ఛీ! నోరు మూసికొని యావలఁ బొమ్ము. మఱియేమియును బలుకవలదు. ఆదుర్మార్గులు — ఆకుటిలమానసులు — ఆ మోసగాండ్రు — నీమగఁడును నీకొడుకును, నాయన్నమును దిని, నాగుడ్డనుగట్టి, నిర్వ్యసనముగా, నాయొద్దఁజేరి సుఖ మనుభవించుచుండియు, గర్వము మించి నామాటను గణింపక, నిరాకరించినది నీవెఱింగినదానవయ్యు వారికి బుద్ధిగఱపి, నాపనులను నెరవేర్చుచుండునట్లు చేయలేక, వారు నాచే శిక్షింపఁబడినంతట ముక్కిలి యోగ్యురాలి చందమునవచ్చి, నాయాజ్ఞను మీరిన దానిని గూర్చి చెప్పక వారిని చెఱసాలలోఁ బెట్టిన దానికైతే వగచుచు, సిగ్గులేక యట్టి దుర్మతులను మన్నింపుమని యడుగుచున్నావు. నీవు వారికంటెను దురాత్మురాలవు. పోపొమ్ము యిచట నిలువకుము ఇంక నయ్యిరువురకును, కారాగారమందే మరణమ్ము" — అని నిర్దాక్షిణ్యముగా జెప్పెను. అంతియగాక "ఓహో

ర్ధండీ! నీవు సయితము యేమైనను నేను జెప్పెడిపనిని మరుమాటా డక చేయుచుండవలయును జుమీ! తప్పి వర్తించితివేని, చెల్లెల వనెడి ప్రేమ నాలోఁ దలంపక నీకు దగినట్లు శిక్షింతును. కాని విడువను. జాగ్రతగా వర్తింపు" మని కఠినమైన యాజ్ఞ నొసం గెను. ఆమైరావణునకు తొల్లి నాపైఁ గలిగియున్న ప్రేమగాని, మరియాదగాని యిపుడు లేనేలేదు. నన్నును నొక సామాన్య స్త్రీవలెనేయెంచి నావలనఁ గావలసిన పనులను జేయించుచున్నాఁడు. ఆతఁ డాజ్ఞాపించినందుననే యిపుడు నేనొక కార్యార్థ మిచ్చోటికి వచ్చితిని. ఇంక నిచ్చోటి కరుదెంచిన కారణముఁజెప్పె దవినుము.

వనచర వీరాగ్రేసరా! నేఁడే మైరావణుండు దశకంఠునితో మాటలాడుట కొఱకు లంకాపురమునకుఁ బోయి యుండి సాయం కాలమునకు వచ్చెను. అచట నతనితోనేమి సంభాషించెనో తెలి యదు కాని, సూర్యోదయ మైనంతటి కొంతకాలము గడచినంతట రహ స్యముగా పట్టణము విడిచి చని, మఱి కొంత తడవునకు బంగారు పెట్టెలో రామలక్ష్మణులం బెట్టుకొని యిచ్చోటికిఁ దెచ్చెను. మహా వీరులైన వానర వీరుల నెట్లు మోసగించెనో, వీనికి వార లెట్లు జిక్కిరో, యన్యులకుఁ దెలియకుండులాగున దాశరథుల నెట్లు గొని వచ్చెనో, యేమాయయు నేర్చెను వానికే దెలియవలయును గాని మన మెఱుంగఁజాలము. లోకాభి రామమూర్తుల నయ్యిరువురను దెచ్చి యిపుడు కాళికాలయములోఁ బెట్టియున్నాఁడు, అవ్విధమున నునిచి నన్ను బిలిచి "దోర్దండీ! దశరథాత్మజులను తూర్పు తెల్ల వాఱుటకు పూర్వము చంపి భద్రకాళికి బలిబెట్టనెంచి యున్నాను. నేనుచల్లిన మచ్చుపొడి మహిమచే, స్మృతిలేక వారు నిద్రించు చున్నారు. సూర్యరశ్మి సోకినచో మచ్చుమహిమ తొలంగిపోవును. కాఁబట్టి తత్పూర్వమే జంపవలసియున్నది. నీవు త్వరితముగా ఘట మునుగొని పైడికోటవాకిలి కావలనుండెడి తటాకములో నీరుంగొని రమ్ము. తడవుచేయవలదు. నీవు నీళ్లుతేగానే రాకుమారుల నభి షేకించి బలికార్యమును నెరవేర్చెద పోయిరమ్మని యాజ్ఞాపించెను. దీనినిఁబట్టి యాలోచింపగా, పంక్తికంఠునకు సహాయముఁజేయుటకై యీదుష్టుండీ యెత్తు వెదకెననియు, యితఁడును రావణుండును, నివ్విధమున జేయవలయునని నిశ్చయించుకొనిరనియు నాబుద్ధికిఁదోఁచి

నది. కాని, ఎందఱో సేవకు లుండఁగా యీపాపకార్యము నొనరించుటకై నన్ను బనిచెనే దైవమా! యని మహా వ్యసనమును బొంది విధిలేక చెప్పినట్లు చేయవలసినదాన నగుటచే, బిందియఁగొని యిచటి కరుదెంచి పరమపుణ్య స్వరూపులగు రఘువీరులకుఁ దొడరిన యాపదం దలంచి పరితాపముతో నింతకుమున్ను నీవు వినిన మాటలఁ బలికితిని. ఇచట నిట్టి కాలమున నెవ్వరు నుండరని యెంచి నేను నిర్భయముగా. గట్టిగా ననుకొనుచు వచ్చితిని. నా వాక్యములన్నియు నీవు బాగుగా విన్నాఁడవు'' అని చెప్పి మరల నిట్లనియె.

''కపివీరా! ఇంక నేనిచట తడయరాదు. నాయన్నకు కోపముగలుగును. అతఁ డేదయినా సాకు గలిగినచో నన్ను దండించుటకు కారణములు వెదకుచుండును. కాని, నేను కడు జాగ్రతగా మెలంగుచున్నాఁను. నేను నీళ్లు గొనిపోయెదను. నీవు కడు సమర్థుఁడవు. ఎట్టివారినుం జొరరాని యిచ్చోటికి దారిఁ దెలిసికొని వచ్చుట వలననే నీమహిమ దెలియుచున్నది. కాఁబట్టి త్వరితముగా నుపాయమున యోచించి, దురాత్ముఁడగు మైరావణుఁడు పొరిగొనుటకు మున్న రామలక్ష్మణుల ప్రాణములు గాపాడుము. పుణ్యముఁ గట్టుకొనుము'' అని పలికెను.

ద్విపద.

అని యిట్లు దోర్దండి- యనిలజుతోఁడ । దనచరిత్రంబు నంతయును బల్కు-
[టయు
వినితనలోనయా-వెలఁది సహాయ । మున నాతులాద్వార-మును దాఁట
[నెంచి
యనువుగానపుడిట్టు-లనియెనోయమ్మ। కనుగొన్న రామల-క్ష్మణులపై నీకు
కనికర మెదఁజాల- గలిగియున్నట్లు । మునువిన్న యావాక్య-ములచేతఁ
[దోఁచె
నదిగాక గుణవతి-వగుచుపునీవు । పదఁతక నేఁ జెప్పు-పలుకులు వినుము.

ఏమంటివా ? ఎవ్విధముననైనను, యీ తులాద్వారమును, నవ్వలనుండు మాయాచక్రమును దాటించి నన్ను పురంబునఁ జేర్పుముఁ ఇంతమాత్రము నీవు చేసిన చాలును. పిమ్మట నేను నాపనిని. జూచుకొనెదను'' అనెను. ఆమాటలు వినఁగానే యామె యొడలు

జల్లుమనెను. అటులఁ జేసినయెడల గలుగు ఫలము నామె యెఱుం గును. కావుననే యంతటి భయమును బొందినది. దోర్దండి హను మంతునిఁజూచి "వనచర వీరాగ్రణీ! నీవు కోరిన సహాయ మల్ప మైనదిగాదు. నీబుద్ధి కిటుల తోఁచి యుండవచ్చును. కాని మిక్కిలి యుపద్రవ కరమగు కార్యముసుమీ! ఈపనినిఁ జేయఁ బూనితినేని, యందుచే లాభము లేకపోవుట యట్లుండఁగా, మన యిరువురకును ప్రాణహాని కలుగును. తప్పదు. అన్యుఁ డెవ్వఁడైనఁ జొచ్చిన తులవిరిగి కూలును, ఆ గుఱుతునుబట్టి యచ్చట కావలియుండెడి క్రూర రాక్షసులు పట్టుకొని శోధించి నిన్నును, నిన్నుఁ దోడ్కొని పోయినందుకై నన్నును జంపుదురు. మైరావణుఁ డంతటి యధికా రమును వారి కొసంగియున్నాఁడు. అన్యుఁడు మాయా చక్రమును దాటుటయు మిక్కిలి కష్టము. ఎటుల నిన్ను దోడ్కొనిపోవుదును? "రామలక్ష్మణు లన్యులుగారా? వారిని నీయన్న దెచ్చినవుడు యీ చిక్కులన్నియు నిర్బాధకముగాఁ గడచి రాలేదా?" యని యడిగెద వేమో, వర ప్రభావ యుక్తుండగుటచే, మాయన్న యేమిచేసినను, నతనికే యాటంకములును గలుగవు. స్వయముగా నతఁడు చేయు పనులు నిర్విఘ్నముగా జరుగుచుండును. ఆంజనేయా సందర్భము లిట్లున్నవి. ఏవిధముననీకు సహాయముఁ జేయనేర్తును? ఇదినావలన నగు కార్యముగాదు" అని ఖండితముగా బలికి, బిందెతో తటాక వారిం గొనిపోవుటకు యత్నించెను. హనుమంతుఁడు బతిమాలి నిలు వరించి, వెండియు నామెతో యుక్తి యుక్తములయిన మాటలతో నిట్లనియె.

"సుగుణవతీ! దోర్దండీ! వేగిరపడకుము. ఒక్కింత తడవు నిలిచి నేను చెప్పెడి మాటల నాకర్ణింపుము. నాలో నొక యుపా యము దోఁచినది. తెలిపెదను. ఆలాగునఁ జేయుటకు సమ్మతించె దవేని, నీకును నాకును ప్రాణాపాయము గలుగదు. నమ్ముము నా కార్యమును నెరవేర్చిన దానవగుదువు. దానివలన ననంతమగు పు ణ్యము నీకు గలుగును. అంతియ గాదు. నావలన నెక్కుడు మేలును బొందుదువు. ఈ యాటంకములు బ్రహ్మ వరమునుబొంది మోహనాంగుండు కల్పించుకొనిన వగుటచే, నాకు కష్టముగాఁ దోఁచు చున్నవి. వీనిని దప్పించుకొని నేను పురంబుఁ బ్రవేశించితినేని తరు

వాత నెన్నికష్టములు తటస్తించినను లెక్కచేయును. దురాత్ముం డైన యా మైరావణుని— ఆసీయన్నను గీటడంచి నిరపరాధులయ్యు కారాగారంబున బంధితులై నవయుచున్న నీవల్లభుని, నీ ప్రియనంద నుని విడిపించి, ఈ పాతాళలంకకు పట్టభద్రునిం జేసిపోయెదను. మీరు నిర్వ్యసనముగ సకల భోగములు ననుభవించు చుండవచ్చును. ఈలాగున తప్పక గావించెదనని భగవంతునిపై నానఁబెట్టి చెప్పు చున్నాను. నీవు జంకవలదు. నీ ప్రాణములు రక్షించు భారము నాయందు బెట్టుకొనుచున్నారు. ఏ యుపద్రవమును నీకు గలుగ నీయక కాచి నీకు మేలు గావించి పోయెదను. నా వాక్యములు నమ్ముము ముమ్మాటికిని నమ్మును. ఇంక చేయవలసిన విధాన మును జెప్పెదను విను" మని యామెకు ధైర్యంబు గలుగఁ బలికి యిట్లనియె.

"ఓయమ్మా! నేను కామ రూపధారణ శక్తి గలవాఁడనని ముందే చెప్పియున్నాను గదా? ఏయాకృతి గావలయుననిన యా తనువును దాల్పనేర్తును. కనుక యిపుడు చిన్న కప్ప రూపుఁదాల్చి, నీవు గొనిపోయెడి నీటిబిందెలో జేరియుండెదను. నన్నుఁ గొని తులాద్వారముం జొచ్చిపొమ్ము. అది విఱిగిపడు నంటివిగదా? పడిన పడును గాక. అది చూచి రక్కసులు నిన్ను శోధించుటకు వచ్చులోపల బిరబిర గవనినిదాటి యరుగుము. పిమ్మట నీకు భయ ము నొందవలసినది లేదు. నేనున్నాఁడను. నా ప్రతాపమును జూతువుగాక. ఒల్లనక దీని గొడఁబడు" మని చెప్పెను. అతని వాక్యము లామెకు నమ్మఁదగినవిగాఁ దోఁచెను. అదియును గాక. తన భర్తను కుమారుని చెఱసాలనుండి బ్యాధావిముక్తులం జేయున ట్లును, రాజ్యాధిపత్యమును గలిగించునట్లు పలుకుటం దలంచి మది లో నాశాంకురములు జనించినవి. మైరావణుండు తన కన్నదైన ప్పటికిని, వాఁడు గావించినట్టియు చేయుచున్నట్టియు దుష్కార్యముల కతంబున తమకు సంభవించిన యుపద్రవములు మితిమించిన వగుటచే, తమయెడ నించుకయు దయలేక యవ్విధమున వెత లొందించు ఖలుం డు మృతినొందుటయే క్షేమకరమని తలంచెను. యగ్రజుండనెడి యభిమాన మించుకయు దోర్దండి హృదయమున లేక నశించి పోయిను నది. కాఁబట్టి యాంజనేయుని వచనముల కామె లొంగి యతఁడు

చెప్పినలాగునఁ జేయవలయునని నిశ్చయించుకొనెను. ఒకవేళ హనుమంతుడు తన్ను రక్షింపలేక పోయినయెడల, ప్రాణాపాయము సంఘటిల్లినయెడల, ఏసుఖమును లేక కష్టము లనుభవించుచు, దుఃఖించుచుండుటకన్న, చచ్చినను మేలేయని తనలో నిర్ధారణఁ గావించుకొనెను.

ఆమె యాలోచనఁ జేయుచుండగా వాయుపుత్రుండు ఆమెను జూచి "దోర్దండీ! ఏమీ? మారు బలుకకున్న దానవు. ఏలాగున నిశ్చయించు కొంటివి? కాలహరణ మగుచున్నది గదా? ఊరకుండిన నెట్లు? నే నుపదేశించిన విధమున నొనరింతువా? లేదా?" అనెను. బుద్ధిమంతురాలగు దోర్దండి "వీరోత్తమా! నీవు సామాన్యుఁడవు గావు. ఎంతటి మహత్కార్యము నొనరించుటకైన జాలినవాడవని నాకుఁ దోఁచినది. రామలక్ష్మణుల రక్షింప వచ్చిన వాఁడవగు నీపలుకులను నమ్మి నీవాదేశించిన ప్రకారము వర్తించుటకు సమ్మతించితి. శీఘ్రముగ మండూకమై బిందెలోఁ బ్రవేశింపు" మని చెప్పెను. హనుమంతుఁడు సంతసించి తటాలున చిన్న కప్పయై యెగిరి దోర్దండి గొనిపోవు జల పాత్రములోనఁ బడి యందుండెను.

సీ॥ జలకలశంబు భు – జంబుపైఁ జేర్చి
దో – ర్దండి యంతట నట – నుండి కదలి
తడవుఁ జేయక తులా – ద్వారంబులోఁ జొచ్చి
తటుకున దానిని – దాఁటి చనియె
కొమ్మవైరిని వెంటఁ గొనివచ్చుటం జేసి
యొనర నచ్చో బ్రేలు – చుండు గొప్ప
దైనత రాజవు – డట్టిట్టునూ గాడి
వింతగా పెట్బున – విఱిగి కూలె.

గీ॥ ద్వార రక్షకు లది చూచి – చేరవచ్చి
యామె నావలఁ జననీయ – కడ్డగించి
యెవని పగవానిఁ దెచ్చితి – వివుడు
నిజముఁ బలుకుము చంపక – నిన్ను విడము.

అని గద్దించి, యార్చుచు, బెదరించుచుఁ జుట్టుముట్టి "మాయలాడీ! నీవు దోడ్కొని వచ్చిన వాఁడెక్కడ? ఎవ్వఁడు? ఎటు బోయెను? పాతాళ లంకేశ్వరునకు చెల్లెలవని యెంచి విడువఁగల మని తలంచితివా? రాక్షసేశ్వరుండు మాకొసంగి యుండెడి యధికారము నెఱుంగవా? ఆ మహాప్రభువునకు పరమ శత్రువగు వానినెవ్వనినో యెట్లో తోడ్కొని వచ్చితివి. వచ్చినవానిని మాకన్నుల గప్పి యెచ్చటికో బనిచి యేమియు నెఱుంగని దానివలె నరుగుచున్నావు. నిలిచి నిజమును జెప్పి నీవెంటఁ గొనివచ్చిన దురాత్ముని మాకుఁ జూపుము. నిన్నును వానిని ఖండ ఖండములుగా ఖండించి కాకులకును గ్రద్దలకును గుక్కలకును, నక్కలకును నాహారముఁ గావించెదము. ఏమీ? మాఱుబలుకక మిణకరించెదవు? చెప్పకున్నను నరుగుదెంచిన వానిని మేమెల్లేనియు వెదకి కనుపట్టఁ గలము. నిన్ను యిపుడే జంపెదము." అని కత్తులు జళిపించుచు చంపుట కుద్యుక్తులై దరియ వచ్చిన యాక్రూరులగు రక్కసులం గని మాటలాడ నోరురాక యేమియుం దోఁచక దోర్దండి మిక్కిలి భయమొందె. మేను గడగడ వడంకుచుండ, తనకు చావు నిక్కంబని యెంచి నిలిచెను. అటుల జరుగునని యామెముందే యెఱుంగును. కాని, హనుమంతుఁడు చెప్పియున్న మాటలచే యట్టిపనిని చేయుటకు సాహసించెను.

పాపము! ఆయబల యిపుడేమి చేయఁగలదు. క్రూరములైన తోడేళ్ళగుంపు నడుమఁ జిక్కిన లేడిపిల్లవలె, దుష్టరాక్షస సమూహముచేఁ జుట్టఁబడి తత్తఱిల్లఁ దొడంగెను. అన్ని వీరాలాపములు బలికిన యాంజనేయుని వలన తన యాపద దొలంగఁగల గని యెంచి యుండిన యామె కతని సహాయం బేదియును గనుపట్టలేదు. తనలో "అయ్యో! నమ్మి చెడితినే! రిత్తకురిత్తప్రాణములు బోఁగొట్టుకొనవలసి వచ్చెను గదా?" యని ధైర్యముడింది కొయ్యబారి నిలిచెను. ఆశ్చర్య మాశ్చర్యము. ఆ సమయంబున నామె భుజంబున పెట్టుకొనియున్న జలకలశంబులోనుండి, దిగ్గన నెగసి కప్పయొకటి యా రక్కసుల నడుమఁబడెను. వారు దానినిఁజూచి "నీటిబిందెలోనుండి పడినది. దానిలో యీ పాడుకప్ప యెటుల జేరినది? ఇసీ! దీనిం గొట్టిచంపుఁ" —

డని యొకరినొకరు పురికొల్పుచుండు నంతలో నమ్మండూకము క్రమ ముగా పెరిగి పెద్దదగుచుండెను. రాక్షసులన్నో యది యటుల నగుచుండుటం గని వెఱఁగంది, యటునిటుం దొలంగి నిలిచి యొక రితో నొకరు "ఓహో! ఏమో యిది మోసముగా నున్నది. కాదేని యింతలో కప్పయేమి? పెరిగి పెద్దలగుటయేమి? ఎన్నఁడైన విని యుంటిమా? చూచితమా అద్భుతముగ నున్నది. దీనింజంపి వేయక విడు వరాదు. మన నిశాట పతికి విరోధియైన వాడెవ్వఁడేనియు నిటువంటి మాయరూపముతో వచ్చెనేమో? ఏది యెట్లున్నను, పోఁ గొనుటయే మంచిది" యని బలుకు కొనుచు అట్టె నిలిచి చూచుచుండిరి. వారిలో కొందఱు కత్తులు జళిపించుచు కప్పను జంపుటకై జేర వచ్చిరి. కాని వారి కాపని సాధ్యమగునని తోఁచలేదు, ఎందు వలన ననఁగా, క్షణకాలమునకు లోపల నమ్మండూకము వృద్ధిఁ జెంది పర్వత మంతటి గొప్ప దయ్యెను. రాక్షసులా మహదాకా మును నట్టె గనుఁగొని "ఓరోరీ! మోసము మోసము. ఇది నిజమైన భేకిగానే కాదు. వీడెవఁడో మాయరూపముఁ దాల్చిన కపటవర్తనుఁడు. విడువరాదు విడువరాదు. కప్పగాదు కాదు. ఈ రహస్యమంతయును మాయలాడియైన యీవోర్ధండికిఁ దెలిసియేయు న్నది. ఈపె మనతో నిజముఁ జెప్పకున్నది. ఇంక తడవుజేయక కప్పను, దీనినిఁ దెచ్చిన యిపాపాత్ము రాలినిం జంపుఁడు చంపుఁ"— డనుచు, కత్తులుఁ గటారులు పీటెలు బల్లెములు మొదలైన సాధ నంబులం బూని వ్రేయనుం బొడువను, నుంకించుటయును పర్వతా

## హనుమంతుఁడు తులాద్వారమందలి రాక్షసులం జంపుట.

కృతితో నుండిన మండూకము తటాలున నదృశ్యంబై "ఎక్కడ? ఏదీ? ఎటుబోయినది? చూచితిరా? నిజముగ మండూకమేనా? టక్కు" అని తత్తఱపాటుతో నలువంకలం గనుచుండు నంతలో, నాంజనేయుండా కప్పరూపు విడిచి, రాక్షస గణ భయంకరమగు మహదాకారమును దాల్చి రక్కసులలో నొకనిచేతి పరిఘాయుధము నొడిచికొని, ప్రళయకాలరుద్రుని చందమున విజృంభించి, యచ్చోటఁ గావలియున్న పండ్రెండు కోట్ల రాక్షసులలో నొకని నైనను విడు వక, కాళ్లు విరుగఁగొట్టి, చేతులు దునియఁజేసి, తలలు బగిల్చి,

యురంబులు ద్రచ్చి, కాళ్ళతో రాచి, గోళ్ళతోఁజీల్చి, వెఱచి, తలలువీడ, వస్త్రంబులు సడల, నఱచుచు, నేడ్చుచు, రక్తసిక్తాంగులై పరువిడుచున్నను విడువక వెన్నంటి మర్దించుచు, నిరవశేషంబుఁగావించి, సౌమ్యాకారముతో దోర్దండి దగ్గఱకువచ్చెను. జరిగిన విధమంతయుం గాంచుచుండిన యామె కంజనీసుతుని బలపరాక్రమ సామర్థ్యంబులు బాగుగా దేలినవి అతండెంత కార్యము నయినను జేయఁగలండనెడి నమ్మకము గలిగినది. దోర్దండి హనుమంతునకు మ్రొక్కి "మహాత్మా! ఎంతటి బలవంతులకైనను జయించుటకు సాధ్యముగాని పరాక్రమము గల యాక్రూరదైత్య వీరలను జంపి, నాప్రాణములు రక్షించితివి. నీశక్తిని వర్ణించుటకు నాతరముగాదు. ఎటుల జెప్పెదవో, యావిధంబున వర్తింపగలదానను. వినుము.

దుర్గమంబగు తులాద్వారమును గడిచితిమి. ఇక ముందట మాయాచక్రమును దాటవలసిన కష్టమొకటిమాత్రము కొఱత యున్నది. దాని గడచినచో పురంబులోఁ బ్రవేశింపవచ్చును. దీని కుపాయం బెట్లు?" అని యడిగెను. హరివీరుం డామెనుజూచి "దోర్దండీ! దీనికై వెఱవకుము. నేను మింటికెగిరి పురద్వారము నొద్దకు దుమికెదను. నడిచిపోయినఁగదా? చక్రమువలనఁ గలుగు కీడునకై భయమొందవలయును. అంబరమున కెగసి దాఁటినవానికి దానిచే గలుగునట్టి యాపద యుండదు. కాఁబట్టి నీవుపోయి పట్టణపు గవనియొద్దకుఁ జేరుము, నీకంటె ముందుననే నచ్చోటికి జేరి యుండెదను" — అని చెప్పెను. అతని శక్తిని దెలిసికొని యున్నదగుటచే, యామె వల్లె యని రయంబున నగరద్వారమున కేగుటయు, వాయుపుత్రుండు పైకెగసి పోయి యామెకంటె మున్నగనే యచటికిఁ జేరియుండెను. అంతట నయ్యిరువురును ద్వారమును జొచ్చి వచ్చుచుండఁగా, నట గావలియున్న పదునారుకోట్లు మహాబలవంతు లగు భయంకరాకారములు గల దైత్యవీరులు గనుఁగొని "ఓహో! అదె, దోర్దండి యెచ్చటనుండియో యొకగండుకోతిని వెంటఁగొని వచ్చుచున్నది! అన్నివాకిళులను దాటి, యచ్చటచ్చటఁ గల యుగ్రభట సముదయంబు కంటఁబడక యావెంకె

మర్కట మీవెంట నెట్లు రాఁగలిగెను ? ఇదియెక్కడికోతి ? ఏలవచ్చినది ? దోర్దండి దీనినిఁ దోడ్కొనిపోవుటకు గారణమెయ్యది ? ఏదోసంచుగా దోఁచుచున్నది. పట్టుకొనుఁడు పట్టుకొనుఁడు—కట్టివేయుఁడు—కొట్టుఁడు—పోనీయవలదు పోనీయవల"—దని యొకరి నొకరు వేగిరపెట్టుచు, పెదబొబ్బలు నార్భాటము లెసంగగా గుంపులై వచ్చి వారినిఁ బోనీయ కడ్డగించి మిక్కిలి కోపముతో పండ్లు గొఱుకుచు "ఓ దోర్దండీ! యీ చెడుకోతి యెక్కడిది ? ఎచటనుండి దీనిం దోడ్కొని వచ్చితివి ? ఏల ? ఎవ్వరికిని దెలియకుండులాగున దీని నింతదూరమే ప్రకారము దెచ్చితివి ? అన్య స్థలముననుండి వచ్చిన యొక చీమయైనను పట్టణంబులోఁ బ్రవేశింపఁగూడదని, పాతాళ లంకేశ్వరుండు ఖండితముగ శాసించి యుండుటను యెఱింగి యున్న దానవయ్యు, నిపుడు నిర్భయముగ నివ్వానరమును గొని వచ్చుట కెటుల సాహసించితివి? మైరావణుని చెల్లెలనుగదా ? యనెడి ధైర్యమా ? ఆయాటలు సాగునని తలంచితివా ? "సందేహము గలిగినపుడు తప్పు చేసినవారు నాకెంతటి సంబంధము గలవారైయుండినను, మరల నాయాజ్ఞకై నిరీక్షింపక, నిర్దయులై చంపి వేయవలసినది" అని మాకు దానవేశ్వరుండు గట్టిగా నానతి యొసంగి యీద్వారమునఁ గావలి బెట్టి యున్నాఁడు నీవన్ననో, ప్రభుని శాసనమును గణింపక, బలిసిన వానరము నొకదానినిఁ బిలుచుకొని వచ్చితివి. నీవు చేసినది గొప్ప నేరముగాని మన్నింపఁదగినది కాదు. నిన్నును, నీవెంట వచ్చిన మర్కటమును యీక్షణంబ చంపి మాకు దానవ భర్త యొసంగిన యాజ్ఞను నెరవేర్చిన వారమయ్యెద" మని బెదరించి పలుకుచు, బిరబిర నాయుధహస్తులై దరియ వచ్చుటయు, వారి యుద్రేకంబును గని దోర్దండి భీతిల్లి గడగడ వడంకుచు, హనుమంతుని మాటుగుఁ జొచ్చెను.

అమ్మహా వనచర ముఖ్యుఁడు దోర్దండిని వెఱవకుమని చెప్పి చుట్టుముట్టి యసురులంజూచి "ఏమీ ? అంబేద రక్కసులారా! మమ్ముఁ జంపెదరా? రండు. మీశక్తి యెట్టిదియో తెలియును గాక" యని పలుకుచు మహాగ్రహముతో నందొకని చేతి గదాయుధము నొడిచి కైకొని, పిడుగుపడిన చందమునఁ దోఁచు విధంబున వ్రేటు లడరించి, తలలు వ్రక్కలుచేసి, యురంబులు భగుల

మోది, కరచరణంబులు విఱుగఁగొట్టి నడుములు నలియనడచి, చీకాకుపడి వెఱఁగంది పఱచుచున్నను విడువక మారి మసలిన తెఱం గేర్పడ నందఱనుం జంపి, తన యుగ్రాకృతి నుపసంహరించి దోర్దం డిని జూచి "ఓ సుగుణవతీ! ఇచ్చట దుష్టరాక్షసుల నెల్లరును మడి యించితి. ఇంక నగరంబులోఁ జొచ్చి పోవుదము. కపట శీలుం డైన నీయన్న — ఆ మైరావణుండు లోక పావనుల రామలక్ష్మణుల కాళికాలయమందు ప్రజ్ఞ లేనివారినిఁ జేసిపెట్టి యున్నాఁ"—డని చెప్పితివిగదా? ఇపుడు మన మచ్చోటికిఁబోయి, యాదేవిని తొలుత సందర్శింపవలయును. పోవుదము పద"—యనిన నమ్మగువ, హను మంతునిఁ దోడ్కొని కాళిగుడికిం బోయెను.

హనుమంతుఁడు భద్రకాళిని దర్శించి స్తుతించుట.

సమీరకుమారుండు దోర్దండితోఁ గూడి భద్రకాళి యాల యంబును దరి యంజని రమణీయములైన వెలలేని మణులచేతను, మెఱయుగు బంగారముచేతను ననల్ప శిల్ప కల్పితంబులై యొప్పు మహోన్నత ప్రాకార, గోపుర, మంటప, ధ్వజ, సహితంబై, కనుల పండువును, నత్యాశ్చర్యంబునుం గలిగించుచున్న, యా యద్వితీయ భవనంబును జూచి తనలో "ఆహా! దేవ నిర్మితములైన దివ్యాలయాలయములు సయితె మీఁగుడికి సరియని చెప్పఁదగి యుండవు. ఈ పాతాళలంకలో—ఈ మైరావణుండు భక్తిణో నింతటి మనోజ్ఞతగల గొప్ప దేవళమును గట్టించి కాళికాదేవి నిందుఁ బ్రతిష్ఠించి పూజిం చుచున్నాఁడు. ఇది యద్భుత విషయము. పరమ దుష్టుండగు వాని కిటువంటి మంచి బుద్ధి యెటులఁ బొడమినదో గదా?" అని తలంచి వర్ణించుచు లోని కమ్మహాశక్తిని సందర్శింప నరుగు చుండగా నచ్చోటఁ గావలియున్న భయంకరులైన యాఱుకోట్ల రక్కసులతని నడ్డగించి, హనుమంతునిఁగని "వీరులారా! శీఘ్ర ముగా రండు—దీనినిఁ జూడుఁడు—ఎక్కడ నుండియో వచ్చినది— వింతకోతి—బిరబిర గుడిలోని కరుగుచున్నది—తటాలున పట్టుకొని బంధింపుదము, మనకిది చిక్కకుండినచో, నొక్కటియే వేటు— రెండుతుండెములు—వేఱు యోచింపవలసినదియే లేదు" — అని చుట్టుకొని "హా! హూ! హో! హుస్—అని సామాన్యవానర

ముల నదలించి యఱచుచు, పట్టుకొనుటకై డాయవచ్చిన, యాంజ నేయుండు వారల యుద్దేశమును దెలిసికొని, వెఱఁగు బుట్టులాగున వికారముగ పండ్లు నిగిలించి యురిమిచూచి వారిని బెదరించుటకై యెగిరి యొకటి రెండు సారులు కుప్పిగంతులు వైచెను. రాక్షసులు, వెనుక వెనుకకుఁ బోయి చుట్టును నిలిచి "ఓహో! ఇది చెడ్డకోతిగా యున్నది. దీనినిఁ బట్టుకొనుటకు సాధ్యముగాదు. కొక్కరించుచు గంతులువేయుచున్నది. ఈ ప్రముక్కిడి వానర[illegible] కింతగర్వమా? దీనిం బొరిగొనక విడువరాదు"—అని, చంపుట కుద్యుక్తులైరి. పొడుచుటకై యొకఁడు బల్లెమెత్తెను. నఱుకెదనని యొకఁడు జరాలున వరలోని వాలును దీసి జళిపించెను. తల[illegible] బగల్చుట కొకఁడుగదను గిరగిరఁ ద్రిప్పెను "మీరలట్టె గను చుండుఁడు. ఈచెడుకోతిని గ్రుచ్చియెత్తెద" నని యొకఁడు శూల మును బూని డాయవచ్చెను.

మహావీరుండైన యంజనీతనయుం డించుకయుం జలింపక వారి ప్రవర్తనం బట్టె చూచి, తన కార్యమునకు వారివలన నాటంక ము గలుగుచుండుటనుఁ దలంచి యాగ్రహ మతిశయింపగా వికార ముగా నార్చి "ఓరీ! అధమ రాక్షసులారా! ఎట్లు[illegible] చంపె దరా? మీరా నన్ను జంపగలవారు? ఏదీ? ఎట్లో చూచెదను గాక"—యని పలుకుచు దిగ్గన నెగసి యొకని చేతిలోని పరిఘా యుధమును లాగికొని మర్దింప నారంభించె. రక్కసు లచ్చెరువొంది "బళీ! ఇది మాటలాడ నేర్చిన మాయకోతి. కడు చెడ్డది. మీఁది కడరి వచ్చుచున్నది. పట్టుండి—కట్టుండి—కొట్టుండి—పొడుఁ వుఁ" డని యొండొరులను బురికొల్పుచు వివిధాయుధ హస్తులై యెదిరించిరి. వాతాత్మజుండు కోపంబు రెట్టింపమోది, యొకనినైనను బ్రతికి పోనివ్వక నుగ్గు నూచముఁ గావించెను. అంతవరకును నెడ ముగా నిలిచి చూచుచున్న దోర్దండి, యా హరివీరోత్తముని బల పరాక్రమముల ట్టె మెచ్చి, యతం డెంతటి మహాకార్యము నేని యు నశ్రమంబునఁ జేయఁగల మహా సమర్థుండని సంతసించి, యతని మూలమున తనకు మేలు గలుగుట నిశ్చయమని దృఢముగ భావించె.

ఈప్రకార మచ్చటి దైత్యుల నెల్లరం జంపి, బలవంతుఁడగు హనుమంతుఁడు దోర్దండీ సహితుఁడై యాలయంబులోఁ బ్రవేశించి యందు, నవరత్న స్థగిత దేదీప్యమాన భూషణ, రమణీయాంబర, పుష్ప గంధాలంకార శోభితమై మహత్తర తేజో విరాజితమై, నిరుపమాన సుందర స్వరూపిణియై విలసిల్లు భద్రకాళిని సందర్శించి యధికతర భక్తి వినయ విధేయత లెసంగ సాష్టాంగ దండ ప్రణామంబులు గావించి, కరములు మొగిచి ఫాల తలంబునఁ జేర్చి, యరమోడ్పు కన్నులొప్ప సన్నిధిని నిలిచి, పరమ పావనియైన యా దేవి నిట్లని స్తుతించె.

## హనుమంతుఁ డొనర్చిన భద్రకాళీ స్తోత్రము.

### ద్విపద.

జయజయ శాంభవీ-జయలోకమాత । జయజయ గౌరిదా-క్షాయణీదుర్గ
చండిమహాకాళి- సౌఖ్యప్రదాయి । భండాదిరాక్షస - భంజనీగిరిజ
దుష్టసంహారిణి-దుఃఖప్రశమని । శిష్టసంరక్షణీ-శృంగారరూప
కామితదాయకీ-కరుణాంతరంగ । క్షేమంకరీదాస-సేవితపాద
భువనత్రయావని-పుణ్యచరిత్ర । దివిజవర్గార్చిత-త్రిగుణప్రధాన
లావణ్య [illegible]షణా-లంకార వేష । భావించి నినుచాలఁ-బ్రస్తుతించెదను

### సీసపద్యము.

కనక సన్నిభగాత్ర - కంజాత దళనేత్ర
పరమపావని శివా - పాహిపాహి
భక్తసంరక్షణి - ప్రవిమల లక్షణి
పరమపావని శివా - పాహిపాహి
మునీంద్రనుత పాద - దీన కష్ట చ్ఛేద
పరమ పానవశివా - పాహిపాహి
హరినీల నిభవేణి - యతుల గుణశ్రేణి
పరమ పావని శివా-పాహిపాహి.

గీ॥ పర్వతాధీశ సంభవా - పాహిపాహి
భంజితాసుర సముదయ - పాహిపాహి
పాపచయ నాశకరియు మా - పాహి పాహి
పాహిమాం పాహిమాం పాహి - పాహిపాహి,

శ్లోకత్రయము.

భద్రకాళీ లోకమాతా । భక్తక్లేశ నివారణీ
కాత్యాయ నీమహాశక్తి । పాహిమాం పరమేశ్వరీ
కామలోచ నిచాముండీ । మహిషాసుర మర్దనీ
వాంఛా ప్రదాయకీ దుర్గా । పాహిమాం పరమేశ్వరీ
దేవతార్చిత పాదాబ్జా । నిత్యానంద స్వరూపిణీ
రమ్యరత్నల సద్భూషా । పాహిమాం పరమేశ్వరీ.

క॥ జననీ! ప్రసన్నమతివై । యనఘుల కర్కశులముఖ్య-లగు దశరథనం
దనులకుఁ బొసఁగినయాపదఁ। గనికరమునఁ దొలఁగఁ జేసి-కావుము వేగన్

భద్రకాళి హనుమంతునకు ప్రత్యక్షంబై సంభాషించుట.

అని పెక్కు తెఱంగుల స్తోత్రముఁ గానించిన, రామభక్తుండగు మరుత్కుమారునకు భద్రకాళి సౌమ్యాకారమునఁ బ్రత్యక్షంబై కరుణావీక్షణంబు లెసంగ నతనింగాంచి "అంజనీవందనా! నీస్తోత్రమునకు చాల మెచ్చితి. లోకహితార్థం బవతరించిన శ్రీరామచంద్రునకు నీవు పరమభక్తుండవు, ధైర్యశౌర్య పూర్ణుండవు. నీకు జయంబు గలుగును గాక. చెడుకాలము సమీపించినందున మైరావణునకు దుర్బుద్ధులు బుట్టినవి. లోకస్తుత పవిత్రచరిత్రుల రామలక్ష్మణులం జంపుటకై, యుద్ధభూమిలో సుమ్మందఱను గికురించి, యాపుణ్య స్వరూపులను గొనివచ్చెను. ఇదియునుం దనమేలునకై జేసిన పనిగాదు. పరమదుష్టుండగు దశముఖుని రక్షించుటకొఱకు, హానివృద్ధుల నెంచక, సాధ్యాసాధ్యములు దలంపక, చేయఁదగిన కార్యమా? కాదా? యనుటను గూర్చి యోచింపక, మదోన్మత్తుండై, తనకుఁ గలుగఁబోయెడి కీడు నెఱుంగక జగదభిరాముల—సుగుణధాముల—నినకులాంబుధిసోముల—రఘువీరులం దెచ్చి, యాపావనమూర్తులను నాకు బలిఁజేయు తలంపున, నదిగో యా వంక నునిచియున్నాఁడు. వానిచేఁ జల్లబడిన మచ్చుమైకమున వారు తనువు తెఱుంగక, యొక పేటికలో నిద్రించుచున్నారు.

మైరావణుండు సర్వదా భక్తితో నన్ను సేవించుచుండువాఁడై నను, నతం డొనరింపఁ బూనినది మహాక్రూరమగు పాపకృత్యం

బగుటచే, వాఁడు రామలక్ష్మణులం జంపుటకై నాసన్నిధికిఁ దెచ్చి నపుడు, నే నా దుశ్శీలుని, వానినే చంపుటకుఁ దలంచి యుంటిని. నాచేత వానికి చావు తప్పినది. నీచేతఁ జావగలఁడు. దుష్టునకు సుఖ మెక్కడిది? ఇంక వాని కంత్యకాలము సమీపించినది. వానరోత్తమా! అయినను నీ కొక రహస్యమును జెప్పెద నాకర్ణింపుము. ఏమనిన. ఎవఁడేనియు వైర భావంబు గలిగినపుడు తనకుఁ జిక్కనేని. తన మేన ప్రాణము లున్నంతవరకును, చిక్కిన వాఁడు తప్పించుకొని పోవుటకుఁగాని, అట్టి వానిని మఱి యొకండు తప్పించుటకుఁగాని, సాధ్యము గాకుండులాగున బ్రహ్మచే వరమును బొందియున్నాఁడు. కావున నతఁడు బ్రతికియుండగా, దశరథ పుత్రులను గొనిపోవుటకు నీకు శక్యముగాదు. నీవు వచ్చినంతట, మంచి వాఁడైనను. కాకున్నను నేను వానిం జంపుట న్యాయముగాదు. నన్ను సేవించువాఁడుగదా? సహాయులులేక ప్రాణములు గోల్పడు నట్లు తటస్థించినయెడల రఘుకులేశ్వరులను రక్షించుట కర్తవ్యము గాని యిపుడేమియును మైరావణునికి నేనుగా కీడు గలిగింపనొల్లను" అని మఱియు నిట్లనియె.

"చేయవలసిన విధానమును జెప్పితిని. ఇంక నీవు వానిని వధించు ప్రయత్నముఁ గావించి కృతార్థుండ వగుము పో"మ్మని యాదేశించిన మరున్నందనుండు సంతుష్టుండై "ఓతల్లీ! నీయుపదేశ ప్రకారము తత్కార్యమున కుపక్రమించెదను. ఆ పాపాత్మునిం జంపి నేను వచ్చువరకును, రామలక్ష్మణులను, నాకు మహోపకార మొన ర్చిన యీ దోర్దండిని యేకీడునుం బొరయనీయక రక్షింపుము, నా వేడికోలు సంగీకరింపుము" అని ప్రార్థించుటయు, భద్రకాళి కరుణా యుత్తచిత్తయై "ఆలాగే! నీవు కోరినట్లు చేసెద. వీరి కెట్టి యాపదయు గలుగనీయక రక్షించెదను. ఈ విషయంబునకై వెఱవ వలసినది లేదు. సూర్యోదయమైన తరువాత మైరావణునిఁ బొరి గొనుటకు గాని, దశరథాత్మజులఁ గొనిపోవుటగాని యశక్యమగును. అదియునుగాక వానిని పగలు చంపుటకు శక్యముగాదు. కాఁబట్టి త్వరితముగా కార్యమునకుఁ గడంగుము. నీకు జయము గలుగును గాక యరుగు"—మని దీవించి యనుజ్ఞ నొసంగిన, నాంజనేయుం డాజగదంబకు మ్రొక్కి దోర్దండిని యచ్చోటనే తాను వచ్చునంత

దనుక నుండునట్లు దిట్టపఱచి, పాతాళ లంకేశ్వర వధోద్యుక్తుండై వెడలిపోయెను.

హనుమంతుఁడు తోరణస్తంభము నొద్దనుండు రాక్షసులంజంపుట.

అమ్మహా బలనందనుం డవ్విధమునం జని, తోరణ స్తంభంబు కడ కరిగిన, నచ్చోటనుండెడి వీరులగు పండ్రెడుకోట్ల దైత్యులు హనుమంతునిఁ జూచి యాశ్చర్యమొంది. చేతుల దట్టుచు, నఱచుచు, కోలాహలముఁ మొనరించుచు, నలువంకలం జేరి.

ఆ-వె॥ ఎచటనుండివచ్చె-యీవింతమర్కటం। బెవ్విధమునఁజొచ్చె-నిప్పురంబు। ఇట్టి దానిఁజూచి-యెఱుఁగ మెన్నడును। పొడిచి చంపవలయు విడువరాదు.

ఆ-వె॥ చీమయైనకాక-దోమయైననుగాని। యిప్పురంబులోని-కేగుదెంచి। బ్రతికిపోవవశమె- పాతాళలంకేశు। నాజ్ఞయనినవెఱతు-రమరులైన.

ఇసీ! ఇది యిచ్చోటి కెటుల వచ్చినను వచ్చెనుగాక. ఆ విచారము మన కేమిటికి? పాపపుణ్యముల విచారము విడిచి, రాజాజ్ఞను నెరవేర్పవలసినది మనకు విధి. దీనిని చంపుదము. కొట్టుడు. పొడువుఁడు. తెగనేయుఁ” డని చేరవచ్చిరి. వారలంగని యాంజ నేయుండు నవ్వుచు “ఓ ముక్కిడిదేబె రాక్షసులారా! శీఘ్రముగా దాపునకు రండు. మిమ్ముఁ బొరిగొనుట కొఱకే వచ్చియున్నాను. నేను మీపాలిటి మృత్యువును సుఁడీ!”—అని పలికినవారు “ఓహో! ఇది మాయకోతి. మనుష్య భాష దీనికి బాగుగఁ దెలిసియున్నది. ఎట్లో తెలియలేదు. మనలఁనట? చంపునట? నిత్తియఁట. ఇసీ! వ్రేయుండు. దీనిశక్తిని గనుగొందు”—మని యాయుధ హస్తులై గలిసిరి.

అపు డగచర సత్తముఁ డట దాపున నుండిన యినుపకంబమును జెఱికికొని గుంపులపై నడరి, యాకంబమును గిరఁగిరఁద్రిప్పి వేయుచు నొక్కొక వ్రేటునకును, పదులు నూరులు, వేలుగా రక్కసులం జంపఁ దొడంగుటయు, వారును వెనుదీయక, పరశు, పట్టిస, తోమర, భిండివాల, చక్ర, శక్తి, ముసల, ముద్గర, కరవా

గదా ప్రముఖ నానాయుధంబులం బూని యమ్మహావీరునిఁ దాకి నొప్పింపఁ దొడంగిరి.

ఈ ప్రకారము రక్కస భటులకును, నాంజనేయునకును నతి ఘోరమగు పోరు జరుగుచుండఁగా, రామలక్ష్మణ వధోద్యుక్తుండై యున్న మైరావణుండు భార్యయున్న యంతఃపురంబునకుం బోయిన, సూతంగి యను పేరుగల యతని యిల్లాలు నాఁటిరేయి తన పతి యంతటి యాలస్యముగా వచ్చుటకు నిమిత్త మెఱుంగక "ప్రాణనాయకా! ఇంతప్రొద్దు గడచు వరకు నెచ్చటికిఁబోయి యుంటివి. రాత్రివేళను గూడ తీరిక లేకుండునంతటి యక్కర పనులెవ్వి తటస్థించినవి? తడవేల? సగమురాత్రి గడచినదే!" అని యడిగిన, నతండు చిఱునగ వెసంగు మొగముతో "ప్రాణనాయకీ! ఔను! అగత్యమగు నొక కార్యమును చేయఁబూని, దాని విషయమై తగిన యేర్పాటులు చేయుచుంటిని. ప్రొద్దుపోయినది. ఇంకను నేన యత్నించిన పని నెరవేఱలేదు. ఇచ్చట నిపు డాలస్యముగ నిలుచుటకు సయితము వలను గాదు. నిన్నుచూచి మాటలాడక పోరాదని యెంచి, నీతో దద్విషయమును జెప్పి యరుగుటకై వచ్చినాఁడను" అనెను. ఆమె యతని పలుకులువిని "ఏమేమీ? ఏమి పని? అంత యగత్యమైనదా? ఇపుడే పోవలయునా? ఎచ్చటికి? ఆపని యెట్టిది?"—అని ప్రశ్నించిన, మైరావణుం డెంతటి రహస్యపు పనియైనను, తన భార్యతో చెప్పక దాచువాఁడు కానందుచే, నాఁడు తాను దశముఖునితో సంభాషించుట కొఱకు లంకాపురంబునకుఁ బోయినది మొదలుగొని, దశరథ కుమారులం దెచ్చి భద్రకాళి యాలయములోఁ బెట్టినంతవరకును నొక యక్షరమైనను విడువక వివరముగ వృత్తాంతం బంతయుం జెప్పి, దోర్దండి నభిషేకార్థము జలంబులు దెచ్చుటకై పనిచి యుండుటయు, తాను సంహారకార్యమును నెరవేర్చుటకై యగత్యముగా పోవలసి యుండుటయు, తత్కార్యమును సూర్యోదయ మగుటకు మున్నే జరుపుటకు నిశ్చయించి యుండుటయుం జేయుట కరుగనుండుటయుం దెలిపి, "మనోహరీ! దశవదనుండు పరమ మిత్రుండు. ఇపు డతండు గొప్ప యాపదలో దగుల్కొని వెరవుఁదోచక పరితపించుచున్నాఁడు. రక్షించుమని దీనుండై మిక్కిలి ప్రార్థించెను. అంతటి గొప్ప వాఁడు

చిక్కువడి సహాయమునుగోరి ప్రార్థించినపుడు. నిరాకరించుట ధర్మమగునా? అయ్యో! పాపము! అతనిని చూచి, యతనిమాటలు వినినపుడు నాకు మిగుల దుఃఖము కలిగినది. మనస్సుకరఁగి నీరైనది. అధికమైన జాలి బుట్టినది. ఒల్లననలేక సాధ్యమగు నంతవరకును, నుపకృతిఁ జేయుదునని మాటనిచ్చి వచ్చితిని. మిత్రుఁడైన యతనికి విపత్సమయమున మనముకూడి నంతవరకును సాయమొనరింప వలయును గదా? ఎంతటి గొప్పవానికైనను, నెంత సమర్థునకైనను కాలము తప్పివచ్చినపుడు సంకటములు తటస్థించుచుండును. గడచి బ్రతికిన వారెవ్వరు? దశముఖుఁడు సామాన్యుఁడనఁదగినవాఁడా? ముజ్జగముల నుఱ్ఱట్లూచినవాఁడు గదా? అతనికిపుడు కష్టకాలము. ఐననేమి? నాయంతటి స్నేహితుఁ డతనికి గలిగియుండఁగా, నిట్టి యాపదలు వేయివచ్చినను, నవి యన్నియును పెనుగాలిచే దూదిపింజలవలెనెగిరి పటాపంచలై పోక నిలువఁగలవా? హృదయేశ్వరీ! ఇదియే నేఁటిరాత్రినాకు తీరికలేక యిచటికి తడవు రాకున్న దానికి కారణము. ఇంక నిచ్చోట నాలస్యమొనరింపకూడదు. తలంచినపనిని నెరవేర్చి త్వరితముగా వచ్చెదను. నిన్ను చూడకయు, సర్వకార్యములును నీతో చెప్పక చేయువాఁడను కానందున, నిది యుం దెలిపి పోవలయు ననియు నెంచి వచ్చినాఁడను. విషయము నెఱింగించితి. పోయి వచ్చెద. ననుజ్ఞ యొసంగుము''—అనికలిగినది కలిగినట్లు దాచక చెప్పి పయిన మయ్యెను.

మాతంగి మైరావణునకుఁ నీతి బోధించుట.

గినట్లుగా నుడివెను. ఇవ్విధమున తన విభుండు చెప్పిన వృత్తాంతమును వినగానే మాతంగికి యొడలు జల్లుమని కంపము బుట్టినది. గుండెలు దడదడఁ గొట్టుకొనఁ దొడంగెను. తలపైఁ బిడుగు బడినట్లును, నాకాశము విఱిగి మీఁదఁ గూలినట్లును, లోకమే మునిఁగి పోయినట్లును దోఁచెను. నోట తడి యారిపోయినది. మితిలేని భయము గలిగినది. ఏమియును దోఁచినది కాదు. ఆమె కడు వివేకముగలది. నీతి నెఱింగిన సుశీల. మహా పతివ్రత. న్యాయ బుద్ధిగల సద్గుణవతి. అటువంటి పుణ్య వర్తనకా మైరావణుని మాటలు చెవులలో శూలములు గ్రుచ్చినట్లుండెను. ఆ సాధ్వీమణి

నాలుక తుదితో పెదవులు దడుపుకొనుచు, డగ్గుత్తిక తోడరిన తడబాటు పలుకులతో వల్లభునిఁజూచి కౌగలించి, కన్నుల శోక బాష్పములు జలజల రాలుచుండఁగా దీనముగా నిట్లనియె.

"హా! పాతాళ లంకేశ్వరా! నా మనోహరా! మనము పూర్ణముగ విపత్సాగరములో మునిఁగి పోయినారము. మన సిరి సంపదలును భోగ భాగ్యములును నశించిపోవుటకు సమయము తట స్థించినది. మిత్తినిఁ దెచ్చి కొంపఁ బెట్టుకొంటివి. నిప్పు లొడి గట్టితివి. నిన్నుఁ గట్టుకొనుటకు త్రాళ్లు నీవే తెచ్చుకొన్నాఁడవు. నీ చావునకు నీవే కారణముగ నేర్పడినాఁడవు. కులమును నీరుఁ జేయుటకుఁ గడంగితివి. ఇంక నేమిగలదు? బ్రతుకెక్కడిది? అయ్యో! అయ్యో! పరమ పావనులును, సద్గుణనిధులును, లోకారాధ్యులును, నసమాన పరాక్రమవంతులును, పుణ్య వర్తనులును, సజ్జన మందారులును, శాత్రవ భయంకరులును నైన యా మహాత్ములను—ఆ మహావీరులను—ఆ భవ్య చరిత్రులను — ఆ దశరథనందనులను—ఆ రామలక్ష్మణుల చంపు నంతటివాఁడవా నీవు? వారి నిచ్చోటి కేల దెచ్చితివి? ఎట్లు తెచ్చితివి? ఇటువంటి దుర్బుద్ధి యేల నీకు కలిగి నది? కుడిచి కూర్చుండి, సుఖముగా కాలము గడపుటను మాని, తన యింటిలో తానే చిచ్చు బెట్టుకొనిన వానివలె నసదృశ ప్రభావ సంపన్నులగు రఘువీరులం గొని వచ్చితిననియు, వారిని జంపఁబోయె దననియుం బలుకుచున్నావు. ఇక్కార్యము నీకు సాధ్యమగునా? న్యాయమగునా? ఒక పనిని చేయ నెంచినపు డది యుక్తమైనదా? కాదా? యనియు, శక్యమైనదా? కాదా యనియు, క్షేమకరమైనదా? కాదా? యని తొడరిన పని నెరవేర్పగలమా? యనియు మొద టనే బాగుగా నాలోచనఁజేసి, యొకవేళ తగిన పద్ధతి తోఁచకుండి నయెడల నిష్కపట చిత్తులైన బుద్ధిమంతుల నడిగి వారు చెప్పిడి యుపాయములం దెలిసికొని, కాలా కాలంబులును, ఫలా ఫలంబును విచారించి, మఱి యాపని నొనరింపవలయును. ఇట్టిది యోగ్యుఁడగు బుద్ధిమంతుని లక్షణము. ఇవ్విధమున నాలోచనఁ గావించి యొన ర్చిన పక్షమున, యత్నించిన కార్యమువలన ఫలము గలుగును. ఒక వేళ నది ఫలవంతము గాకపోయినను, దానిచే నాపద యేదియును బొసంగదు. ఇపుడు నీవన్ననో, యనాలోచనా పరుండవై, యశ

క్యంబును. నాపత్కారంబును నగు దుష్కార్య మొనర్పఁ దలంచితివి. ఇది తగునా ? నీకు మేలు చేకూరునా ? కల్ల—కల్ల.

మఱియొక విషయము నాలోచనఁ జేయుము. ఆ రఘుకులేశ్వరుఁడు గాని, యతని తమ్ముఁడుగాని, యేదైనను నీకొక యపకృతినిఁ గావించిరా ? ఏదీ ? చేసియుండిన దానిం బలుకుము ? వారికిని నీకును విరోధ మేమైనంగలదా ? అదియును లేదు. రిత్తకు రిత్త యిటువంటి బల వద్విరోధమును నెత్తికిఁ దెచ్చుకొనినాఁడవు. ఇందువలన నెద్దియో గొప్పతనమును, లాభమును సంభవించునని యెంచి, యీ యకార్య మొనరించుటకుఁ గంకణముఁ గట్టితివి. కాని యిసుమంతయును నీకు మేలు గలుగఁబోవునది లేదు. మేలు గాకుండుట మాత్రమేగాదు ప్రాణహానిని సయితము గలిగించును మహాప్రభూ! పాతాళ లంకానాయకా! అన్ని విషయములు తెలిసిన వివేకవంతుఁడవయ్యు తెలివిలేని వాని విధంబున వర్తించి గొప్ప తప్పు చేసితివి. ఈ విపత్తు నుండి తప్పించుకొనుట యెట్లు ? చెడితిమి. నిక్కముగా చెడినవారమే! అకటా! ఏ దుర్విషయములందును బ్రవేశింపక నెమ్మదిగా, నెట్టి చింతయును లేక సౌఖ్యమనుభవించు చుండిన వాఁడవగు నీకు యిటువంటి చెడ్డ తలంపు గలుగఁజేసిన దైవము నేమనవలయును ? ఆ పాపాత్ముఁడగు రావణుఁడే నీపాలిటికి మృత్యువుగా నేర్పడినాఁడు. పరమ మిత్రుఁడని తలంచెదవు కాని, కాదు కాదు. అతఁడు పరమ శత్రుఁడు. వాఁడు చేసిన వన్నియు నపరాధములే! యొకటియైనను మంచి పని నొనరించెనా ? వేలుమడిచి చెప్పుము ? సాధువులైన జనులను బాధించెను. తపోధనులగు మహర్షులను పడరాని పాటులొందఁజేసెను. పతివ్రతలను చెఱబట్టెను. దేవతల నల్లాడించెను. ఒకటియైన గదా ? నుడువుటకు ? అన్నియు నక్రమ కృత్యములే! అటువంటి దుశ్శీలునకా సహాయము చేయవలసినది ? శుభగుణాకరుండైన శ్రీరామచంద్రుని ధర్మపత్నిని—పరమసాధ్విని—జనకరాజనందనను చెఱదెచ్చి తనపురయులోఁ బెట్టుకొనెను. అమానుష ప్రజ్ఞాబల కలితుఁడగు నమ్మహాత్ముఁడు కౌసల్యాపుత్రుం డది యెఱింగి, లోకంబునఁ గనియు, వినియునుండని యద్భుత ప్రకారమున వనచర బలములఁ గూర్చుకొని వారిధిఁగట్టివచ్చి లంకముట్ట

శించి యాక్రూరకర్ముని, సుత, హిత, సోదర, బాంధవ ప్రముఖులైని మహావీరుల నెల్లరను బొరిగొనెను. వాని యెడల దశరథ పుత్రుఁ డొనరించిన నేరమేమిగలదు ? కలవారినందఱను గోల్పోయి, యొంటరియై చిక్కి, రామచంద్రునిచే తనకు మరణము గలగుట నిశ్చయమని తెలిసికొని, యిప్పటికైనను బుద్ధిఁదెచ్చుకొని పతివ్రత యగు సీత నామె భర్త కప్పగించి శరణుజొచ్చి ప్రాణంబులు రక్షించుకొనఁ దలంపక, కోరలు దీయఁబడిన మహాసర్పంబువలెను; వ్రేటువడి సత్వంబుడిగి చావనుండెడి సింగంబు లాగునను, నేమియు నుజేయ లేకున్నను, తన చెడు పట్టుదలను విడువనివాఁడై తన పంతమును గెలిపించుకొను తలంపున నిన్ను రావించి, దీనత్వము దోపగా, కనికరము బుట్టు తెఱంగున సహాయముఁజేసి రక్షింపుమని ప్రార్థించి, వంగి యేడ్పులేడ్చి పాదంబుల పైఁబడి నంతమాత్రమున నే, వాని కపట నటనంగాంచి మదిగరంగి, మిత్రుండుగదా! యని యెటులనేనియు సహాయ మొనరించి యతని నుద్ధరించుటకుఁ దలంచి, వాగ్దానముఁజేసి వచ్చితివి కాఁబోలు. కాని, ప్రియవల్లభా! నీవు తలంచినట్లు కార్యమును నెరవేర్చుటకును, దురాత్ముఁడగు పం కంతుని రక్షించుటకును నీకు సాధ్యము గానేరదు. శక్యము గా పోవుటయే గాక యా క్రూరకర్ముఁడు పొందబోయెడి దుర్గతియే నీ ను తటస్థింపఁగలదు. తప్పదు.

నాథా! ఈ గొడవ మన కేమిటికి? రామ లక్ష్మణులుగా యా వానరులుగాని, సామాన్యులుగదా? యని తలంపకుము, వా కీడు గావించుటకు బ్రహ్మ రుద్రేంద్రాదులకు సయితము శక్య కాదు. నీవలన నేమి గాఁగలదు? మనపై విరోధము లేనట్టియు మనకే నాడును నెట్టి యుపకారమును గావించి యుండనట్టియు సత్పురుషులగు రఘువీరులకుఁ, యొక దుశ్శీలునికిఁగా మిత్రుండని తలంచి, తెగించి ప్రాణంబులు మారొడ్డి సహాయము జేయ నెంచి యశక్యపు పనికిఁ బూనుట యోగ్యలక్షణము గానేరదు. తెలిసి యుఁ గన్నుబోయెడి కాటుక నేల బెట్టుకొనవలయును? తన చావును దలంపక పరునకు సహాయము జేయుటయు నొక వివేకవంతుని పద్ధతి యగునా? ''స్వయంతీర్ణః పరాంతారయతి''—అని యభిజ్ఞులు బలుకుదురు. దాఁటనేర్చి దాటింపుమని యర్థము. నీవు [illegible]

ఎటుల జరుగవలసి యుండునో యవ్విధంబున దైవసంకల్పప్రకారము జరుగఁగలదు. సమర్థుఁడననెడి పేరు వహించిన నేను చావునకు వెఱచుట హాస్యాస్పదము. ఎంతదలఁచితినో, యంతయు నొనరించుటకే ప్రయత్నించుట యుక్తము. ఇపుడీ శుభాంగికిఁ గలిగిన భయమును, దుఃఖమును నివారించి, తడవుగావింపక యిచ్చోటు విడిచిపోయెద''— అని తలంచి, దృఢనిశ్చయ మనస్కుఁడై భార్యను గనుగొని ప్రియంబుగదుర నిట్లనియె.

మైరావణుఁడు భార్యకు దుఃఖోపశమన వాక్యంబులు జెప్పుట.

''చ॥ అతివరో! యీవిధంబున భ - యంబునుజెంది కలంగి చింతచే
ధృతివిడనేల? నన్నును మ - దీయ బలంబుఁబరాక్రమంబునుం
జతురత నీవెఱుంగవె! వి - చారము మానముమానసంబునన్
శతమఖుఁడడ్డువచ్చినను - జంపుదు నిన్నిసిరాజ పుత్రికన్.

చ॥ దుడుకుతనంబుగా మదినిఁ - దోఁచెనదేమొకొ నీకు మత్క్రియల్
మిడికెదవిట్లు నన్ను మది - మెచ్చక యాపదయేల గల్గు? నె
క్కడి నరులేడ వానరులు? - కానకబల్గెదు వెఱ్ఱిదాన యా
బడుగులు గీడుసేయఁగల - వారలె? వింతలు నీదువాక్యముల్.

మిత్రునకు మాట యిచ్చితి, ప్రమాణమొనరించితి. నే నెయ్యదియో తనకు గొప్ప మేలు చేయఁగలనని రావణుఁడు గట్టిగా నమ్మియున్నాఁడు. అతని నుద్ధరించుట కొఱకు పనిఁబూని మూఁడుపాళ్లు నెరవేర్చితి ఇంక నాకోరిన కోరిక కొనసాగుటకు చేయవలసిన పని యత్యల్పముమాత్రము కొఱంతయున్నది. అదియుం దీర్చుటకు ప్రయత్నమంతయును జరుపఁబడి యున్నది. ఒకగడియ కాలములో నదియును సంపూర్ణముఁ గావింపఁ బోవుచున్నాను. ఇంత పనినిఁ జేసి మైనంతట, ఇపుడా? కార్యము తుదముట్టబోవునపుడా? భయమొంది, విరక్తిఁజెంది చేతగాని యంబేదచందమ్మునఁ జేతులు ముడుచుకొని కూర్చుండుట? ఇది సమయమగునా? నీవేయోచించి నుడువుము? ఇసీ! నవ్వులచేటుగాదా? పదుగురిలోనను పలుచదనము గలుగదా? పరువుదక్కునా? నాకీర్తికి భంగము గలుగదా? ఈపనిని నేను చేయక విడిచితినేని, కారణము తెలియని యన్యులు శక్తిలేక వెఱచి మానితినని పరిహసింపరా? పిమ్మటనొక యల్పభటుం

డైనను గణించి విధేయుఁడై వర్తించునా! పాతాళ లంకేశ్వరుం డనెడి గొప్పపేరు వహించి మయ, శంబర, మారీచ, రావణ, మేఘ నాథ, వాతాపేల్వలుల కన్నను మించిన, తిరస్కిరణీ, శాంబరీ విద్యలు నేర్చి వర్తించు చతురుండనని యెల్లరుం గొనియాడఁ దగిన వాఁడ నగునేను ?—మైరావణ విఖ్యాత నామధారినైన నేను ? — సర్వకార్యము లందును మహాసమర్థుండనగు నేను ?—బళీ ! నరులను, గోతులనుం గని, వారివలన నేదియో యాపద గలుగునని భీతిల్లి, చేయఁబూనిన పనినిఁ జేయక విడువఁదగునా ? విడువఁదలంతునా ? తరువాత యీ బ్రతుకేమిటికి ? మానవంతుఁడు, ప్రాణములు గోల్పో వుటకైనను సమ్మతించును గాని, తన గౌరవమునకు హానిజేకూరు కార్యమొనరింప నొల్లఁడు. అట్టిది బుద్ధిమంతుని లక్షణమునుగాదు. నామహరీ ! సుందరాంగీ ! మాతంగీ ! నీవు వివేకము గలదానవు. ఏదేనియు నొక విషయమును జెప్పినయెడల, యందలి మంచి చెడు గులను తెలిసికొని యుచితభంగి నివర్తించునట్టి శక్తిగల దానవు. కావున నిక్కార్య విషయంబున నేను వెనుదీయక నెరవేర్చుటయుక్త మో, కాదో చక్కగా యోచించి చెప్పుము. నా వాక్యంబులలోని యుచితానుచితముల నెఱుంగనేర్తువనెడి తలంపుతో నాయభిప్రాయ మును వివరించితి. ఎట్లును రావణుని కొఱకై యీకృత్యము యోగ్యమగునది యైనను, కాకున్నను, తుదముట్టింప వలయుననెడి దృఢ సంకల్పముతో నున్నాఁడను. ఎవరెన్ని చెప్పినను, నాతలంపు మాఱి పోవునది కాదు. పట్టుదలను నేను విడుచువాఁడనుగాను "— అని ధృఢముగాఁ బలికెను.

మాతంగి విభుని యత్నంబు ప్రాణహాని కరమగుటం దెలుపుట.

ఈ తెఱంగున తెలివి గలవాఁడయ్యును, మూఢునివలె పట్టు వీడక యక్రమ కృత్యంబునకుఁ గడంగి నిజాభిప్రాయమును గట్టిగాఁ జెప్పిన, మాతంగి యతని యుద్దేశంబునుఁ దెలిసికొని, చెడుకాలము సమీపించుటచే యటువంటి దుర్బుద్ధిబుట్టెనని నిశ్చయించినదై, యధిక మగు దుఃఖమును బొంది, మఱియుం బ్రబోధించి యేలాగునఁగానియు విపత్కరమైన యీదుష్కార్య ప్రయత్నంబు నందుండి భర్తచిత్తం బును మరల్పవలయునని యెంచి శోకాశ్రువులు కనుగొలంకులనుండి జాఱుచుండఁగా రాల్పడిన కంఠరావముతో దీనవదనయై యిట్లనియె.

ప్రాణవల్లభా! మంచి చెడుగుల నెల్ల బాగుగ నెఱింగి నిపుణుఁడవై వర్తించువాఁడవు గదా నీవు? అటువంటి నీవివేక మిప్పుడెక్కడికిఁ బోయినది? తెలియని వారికి గదా చెప్పవలయును? అయ్యో! ఇపుడు చేయఁబూనిన దేమి మేలు కార్యమని యెంచితివి? సుఖముగా నుండలేక, ప్రాణహానిని గలిగించెడి యాపదను దెచ్చి తలపైఁ బెట్టుకొన్నాఁడవు. రామలక్ష్మణుల నేమి? నీవేమి? చంపుటయేమి? న్యాయాన్యాయముల విషయ మట్లుండ నిమ్ము. ఇది నీకు శక్యమగు పనియగునా? నెరవేర్పఁగలవా? ఆడుదాననగు నాబుద్ధికి యసాధ్యమును, హానికరమును నైన పనియని తోఁచుచుండఁగా, మేధావి వనఁ బ్రసిద్ధినొందిన నీకు—మంచి నడతగల వాఁడవగు నీకు—ప్రతిష్ఠాపరుండవైన నీకు అర్థంబుగాని యసాధ్య కార్యంబని తోఁచకుండుట యెంతయు నచ్చెరువు గానున్నది. అంత్యగాలము చేకుఱుటవలన వివేకము నశించినది కాఁబోలు. చెడు బుద్ధులు బుట్టినవి కాఁబోలు. "చెట్టు చెడు సమయంబునఁ గుక్కమూతి పిందెలుబుట్టు"—ననెడి సామెత నీయందు తార్కాణగాఁ గనుపట్టుచున్నది. క్రవ్యాద నాయకా! నా మనోవల్లభా! ఇప్పటికైనను, నీ క్షేమమునే గోరుచుండు. ప్రియ సతినగు నా సద్బుద్ధి నిరాకరింపక విని చేయనుండెడి దుష్కృత్య వాంఛను విడిచిపెట్టుము. అతివననియు నల్పబుద్ధిగల దాననియుం బెడచెవినిఁ బెట్టక, నాయందు కరుణించి, మదీయ ప్రార్థనమూర్జిత మొనర్చి, మన జాతిని, నిన్నును, నన్నును, రక్షించుకొనెడి మార్గమును దెలిసికొని వర్తింపుము. ఏకీడును మనకు చేసియుండని రఘువీరులతో వైరమును బెట్టుకొనవలదు. నా వాక్యముల నాదరింపక, రావణుని రక్షించుటకై యీ రఘువీరుల కపకృతిఁ జేయఁ దలంచితివేని, యీ దుశ్శీలుఁడు దశముఖుఁడు జీవించి యుండఁ బోవునది లేదనుట మాత్రమే గాదు. వానికన్న మున్నుగా నీవు ప్రాణములు గోల్పోవుదువు. ఈ మాట గట్టిగా నీమదిలో నిలుపుము. నన్ను మన్నించి, నాయందు నీకుఁ గల్గు ప్రియంబు దెలియునట్లు నామనవి నంగీకరించి, దురాలోచనయు, దురపేక్షయు మాని సౌఖ్యవంతుఁడవై మనుటకుం దలంపుము"— అని మఱి మఱియుం బ్రార్థించి, పదంబులపైఁ వ్రాలి, కరంబులును

చుబుకమునుఁ బట్టుకొని, కౌఁగలించి, మించిన చింతతో, దిగులుతో పలుకుచున్న భార్య తత్తరబాటును, భయమును గాంచినపు డా మైరావణుని కామె పై మిక్కిలి జాలిగలిగెను. కాని పట్టుదల మాత్రము తొలంగలేదు. దైవోపహతుఁడై యంత్యకాల మాసన్నమై యుండెడి వానికి, సద్బుద్ధి యేల కలుగును? హితోక్తులు పథ్యముగ నేల తోఁచును? భార్య చెప్పిన విషయ మెల్లను నిక్కమేయనుట నెఱింగియు, రావణుని గావవలయుననెడి తలంపుతో, చావునకు సయితము తెగించి పట్టువీడక, యుద్దేశించిన పనిని నెరవేర్చుటకే నిశ్చయించిన వాని వివేక మెట్టిదని చెప్పవలయును? అన్నివిధముల వేడుకొనినను, తన యర్థాంగి నీతి వాక్యములను పెడచెవి నిడి, తల పంకించి నవ్వుచు, తన నిర్భయత్వ మేర్పడు మాటలతో నిట్లనియె.

“ప్రాణనాయకీ! నీవు మిగుల వెఱ్ఱిదానవు సుమీ! నీకుఁ గల బుద్ధి వైభవమంతయు నిపు డెందు బోయినదియో తోఁచకున్నది. ఏమి మహోపద్రవము కలిగెనని యిపుడు భీతినొంది పరితపించెదవు? నాబల, పౌరుష, సామర్థ్యంబులను చక్కఁగాఁ దెలిసికొని యుండెడి దానవయ్యు, తెలివిలేని దాని పగిదిఁ బలికెదవేల? ఇసీ! ఊరకుండుము. ఈయల్పపు పనిని గూర్చి యింత దిగులొందవలయునా? వలదు వలదు. ధైర్యముతో నింక గడియసేఁపు గడపుము. ఎటులఁ జేయుదునో, ఏమి జరుగునో దెలిసికొనఁ గలవు. నిన్ను మెప్పించి సంతోషింపఁ జేసెద. ఇక నే నిచ్చోట తడయ కూడదు. చేయవలసిన ప్రయత్నమంతయుం జేసి యైనది. ఆయుధముల, దశరథ పుత్రుల గాళికి బలిచేసి, తృప్తినొందించి యతిశీఘ్రముగ వచ్చి, యీ శుభవార్తను చెవుల పండువుగ నీకుఁ జెప్పెదను. అనుజ్ఞ నొసంగుము. పోయి వచ్చెద” — అని నిబ్బరంబుగాఁ బలికి, యటనుండి యరుగుట కుద్యుక్తుండగుటయు నమ్మానవతి తనలోన అతనికి యంత్యకాలము సమీపించెనని నిశ్చయించుకొని, మఱియుం దనవలన నైనంతవరకు నతని ప్రయత్నము నుండి మరల్చుటకు దగినట్లు బోధింపనెంచి యడ్డువచ్చి నిలువరించి యిట్లని చెప్పెను.

మాతంగి రామలక్ష్మణుల మహిమను మైరావణున కెఱిఁగించుట.

"ఓ రాక్షసవల్లభా! నన్ను వెఱ్ఱిదాననినియుఁ, దెలివిలేనిదాననినియుం దలంచి పరిహాసముగాఁ బలికితివి. కాని, నేను నీవు చెప్పినట్టి యవివేకినిగాను. ఆమూఢత్వ మంతయును నీయందే మూర్తీభవించి కనుపట్టుచున్నది. నా సద్వాక్యములు నీకు రుచింపకున్నవి. ఎందువలన? చెడుకాలము సన్నిహితమైనది. ఇది యేకారణము. నాపై నీవు కోపమును జెంది, యేమిచేసినను జేయుదువు గాక. కడపట నేనింత భయమును బొందుటకు నిమిత్తమై, యెఱింగియున్న రహస్యమును నీకు దెలుపక మానను. అది యెట్టిదనగా చెప్పెదను వినుము. రఘువీరుల సామాన్యమానవ మాత్రులని యెంచి వారి కపకారము నొనరింపఁగడిగినాఁడవు. మున్నొకనాఁడు ప్రస్తావవశమున నాతండ్రి నాతో చెప్పియుండిన వృత్తాంతమును వినిపించెద, దానిని వింటివేని, నీపూనిన కార్యము కొనసాగునది కాదనియు. హానికరమైన దనియుం దెలిసికొన గలవు.

కథాసరణి–ద్విపద.

ప్రబలి నిశాచరుల మాను ల – బాధించుచు నెపుడు
నబలల సాధ్వీమణులను గర్వం – బడరి భంగపఱచి
లోకంబున నల్లోలంబును క – ల్లోలముఁ గావించి
వ్యాకులమొందఁగఁ జేయుచుండ ని – ర్వాహణ శక్తిలేక
భీతిలి వేల్పులు నత్తాపసులును – ధాతకడకుఁ బోయి
దైతేయుల దుండగముల నెల్లను – తనరఁగ నెఱిఁగించి
"పాలింపుము కరుణామతివై" యని – ప్రార్థించిన నతఁడు
జాలినిఁ బొంది యుపాయము దనలోఁ – జక్కఁగఁ దలపోసి
వారల నెల్లరఁ దోడ్కొని రయమున – వైకుంఠ పురంబుఁ
జేర నేగి భయభక్తులతో ల – క్ష్మీవిభు దర్శించి
చేతులు మోడిచి ఫాల తలంబులఁ – జేర్చిసన్నుతించి
"ప్రీతుఁడవై దీనుల మముగావుము – పీతాంబరధారీ!
శరణాగతులము వచ్చితి" మని రా – క్షసుల దుష్క్రియలను
సరవిని విన్నప మొనరించిన విని – జలజదళాక్షుండు
కనికరించి "భయమొందకుఁడా! మీ – కష్టములను దీర్తు

దనుజులనెల్లర నాశమొనర్చెద – తద్విధ మెట్లన్న
ధరలోన నయోధ్యాపుర పతియగు – దశరథ రాజునకు
నరరూపంబుల నేనును శేషుఁడు – నాచక్రాబ్జములు
నరుదుగ నలుగురు పుత్రులమై తగ – నవతరింపఁ గలము
ఇందిర మిథిలా నాథుని సుతయై – మేదినిఁ బుట్టెడిని.

ఈ ప్రకారము జన్మించినంతట నేను సీతానామమొంది యొప్పు జనకరాజనను బెండ్లియాడి, తండ్రియాజ్ఞ యనెడి నెపముతో, భార్య తోడను, లక్ష్మణుం డనెడి తమ్మునితోడనుగూడి దండకాటవిం జేరి, దుర్మార్గులగు రక్కసుల నుక్కడంగించెద మఱియు సీతనిమిత్తంబున లోక కంటకుఁడై ఁ వర్తించు, లంకాధిపతిని, సపుత్రబంధుమిత్రముగా సంహరించి లోకంబులకుం గల భీతి నివారించెద. మదాజ్ఞం గొని మీరలు భూతలంబున మీమీ యంశంబుల ఋక్షవానర గణంబుల, బుట్టించి, కిష్కింధ యనుచోట, వాలి, సుగ్రీవులను నామములతోఁ నగచరవరుల నేర్పఱిచి తక్కిన వనౌకసులు వారలం గొలుచుచుండు నట్లు చేయుఁడు. రావణసంహారమునకుఁ బోవునపుడా వృక్షచరులే నాకు సహాయులై యుండఁగలరు. ఇదియ మదీయ నిశ్చయంబు, దైన్యంబు మానిపోయి నాచెప్పిన లాగున నొనరింపుఁ"డని యాదేశించెనఁట.

కథాసరణి–ఢోరా.

భుజగశయను డవ్విధమునఁ జెప్పిన – బుద్ధిబుద్ధి యనుచు
నజముఖ్యామరులుం దాపసులును – నచోటు వాసిపోయి
హరియానతిచే శాఖామృగనిచ – యంబును సృజియించి
సురరిపులడఁగెడి తరికై యెదురును – సూచుచుండిరంట.

చ॥ జలరుహనాభుఁడుల్ దనుజ – సంతతఁ జేగ్రతుభుజ్మునివ్రజం
బులునిరతంబు నెక్కుడుగ – బొందెడికష్టములంపఁగా
నిలనుకుమారుఁడై దశర – థేశునకుల్ ప్రభవించెమూడుత
మ్ములుదనరల్; విదేహనృప– పుత్రికయైజనియించె లక్ష్మియల్.

వారలు సామాన్య మనుజులును గారు, యీ విషయ మసత్య మును గాదు ఆ హృషీకేశుండే రామచంద్రుఁడు—రాక్షస కులాం

తకుఁడు—అనంతుఁడు లక్ష్మణుండుగను, శంఖచక్రములు భరత శత్రుఘ్నులుగను జన్మించిరి. ఇందిరాదేవియే సీత, ఇట్లు దనుజకులమును హరణముఁజేసి శిష్టులను పాలించుటకై రఘువీరుండు, అనుజునితోడను, భార్యతోడను గూడివచ్చి, దండకాటడవిలోఁజేరి, రక్కసుల, రెక్కలుద్రెంచి యుక్కడంచెను. మహా బలవంతులగు ఖరదూషణ త్రిశిరుల సైన్యయుతముగా తుద ముట్టించెను. అట్టి కాలముననే మదీయ జనకుఁ డీ వృత్తాంతమంతయు నొకనాఁడు చెప్పి, "ఎవ్వఁడా రఘుపుంగవున కపకారముఁ జేయునో—చేయఁదలంచునో — ఎదిరించునో, వాని కంతటితో కాలము సమాప్తమైనట్లు నిశ్చయింప వలయును సుమీ! మన మతని జోలికి బోవక జాగరూకతతో మెలంగుచుండుట శుభస్కరము" అనియెను,

అంతటి మహానుభావుఁడగు రామచంద్రుని మహిమ నెఱుంగలేక, మహా పతివ్రతయగు సీత లోకమాతయైన పద్మాలయ యగుటను దెలిసికోనఁ జాలక, రావణుఁడు రాముని కపకృతిఁయ జేయనెంచి, సతను దెచ్చి తన పురంబులోఁ బెట్టి, కులనాశకుఁడై యేర్పడి యిపుడు తన వారినందఱను జంపుకొని, చావునకు సిద్ధమై, నిరాధారస్థితిని బొంది యల్లాడుచున్నాఁడు. ఆ పాపాత్మునకా? సహాయముఁ జేయవలసినది? చేయ నెంచినను శక్యమగు పనియైనగదా? అసాధ్యమును, ప్రాణ హానినిఁ గలిగించునదియు నిక్కార్యమును జేయవలసినంతటి కర్మము మనకేమి పట్టినది? మంచి చేసినను, చెడుగుఁ జేసినను చేసినవాఁడు తత్ఫలము ననుభవించును. ఆపత్సంపదలు రమ్మనిన వచ్చుటగాని, పొమ్మనిన పోవుటగాని లేదు. సమయము తటస్థించి నపుడవి యవి తమకుఁ దాముగనే సంభవించుచు తొలంగి పోవుచుండును. నీవు మిత్రుండని చెప్పెడి దశముఖుఁడు పాపకర్ముడు. వాఁ డొనరించిన కార్య ఫలమును వా డనుభవింపక తప్పదు. నీవు వాని నుద్ధరింపఁ జాలవు. ఏమై పోయినను పోవునుగాక. వాని మాటయే దలంపవలదు. నామనవి నంగీకరించి మిన్నకుండి మమ్ముందఱను రక్షించుకొనుము"—అని విన్నవించెను.

ఆ యుత్తమాంగన చెప్పిన పద్ధతి మైరావణుని మనస్సునకెక్కనే లేదు. అతని తలంపు కొంచెమైనను మాఱినది కాదు.

"ఇనీ! ఇదియేమి ప్రసంగము? ఆలస్య మగుచున్నదే!" యని తలంచి యామెను జూచి "బేలా! నీ హితోపదేశ మింతమట్టుకుఁ జాలును. ఇంక నోరు మూసికొని మిన్నకుండుము. నా యుద్దేశ మును నీవు మార్పఁజాలవు. నీవలన గాదు. ధైర్యముతో నుండుము. శీఘ్రమున నరుగుదెంచెద"—నని పలికి, సుతియు నయ్యబల యేదో బలుకఁ గడంగినను నవ్వాక్యంబులు చెవుల నిడక దిగ్గన లేచి వెడలిపోయెను. తరువాత నమ్మాతంగి తన నాథునకు మృత్యువా సన్నమయ్యెనని నిశ్చయించి చేయునది లేక దుఃఖ వారిధిలో మునింగి యల్లాడుచుండెను. అపుడు మైరావణుండు కొలువు మందిర మున కరిగి కర్తవ్యమును గూర్చి మంత్రులతో యోచనఁ గావింపఁ దొడంగె. అంతటి పట్టుదలతో, ధైర్యముతో, పాపకృత్య మొన రింప నిశ్చరించియున్న యతని కపు డాలోచనఁ జేయవలపి నంతటి యగత్య మేమి గలిగినది? రామలక్ష్మణులఁ జంపు విషయమును గూర్చి యటుల యోచింపలేదు. మఱి యేల? అందువలనఁ దనకు మేలు గలుగునా? లేక నొకవేళ కీడు సంభవించునా? యనుటయే యాలోచన. తుద కేమియైనను పూనిన పనిని నెరవేర్పక మాన రాదని నిశ్చయముఁ గావించుకొనెను. ఇదియే వారి మంత్రాలో చనలో కడపట దేలిన నసారము.

అవ్విధమున మైరావణుండు మంత్రులతో సంభాషించు చుండు సమయమున నట తోరణ స్తంభము నొద్దనుండిన యసంఖ్యాకులగు రక్కసులు హనుమంతునితోఁ బోరి హతులగుటయు, నందు తప్పి దారిన, ప్రేటులువడి భీతిల్లి పరుగె త్తివచ్చిన హతశేషులు కొందఱు, తమ యేలిక యొద్దకుఁ జేరి దండముఁబెట్టి, నడిచిన వృత్తాంతము సర్వమును విన్నవించి, హనుమంతునిచే తోరణ స్తంభంబు దగ్గఱ నుండిన వీరు లెల్లరు హతులైరనియు, తామెట్లో ప్రతికి వచ్చితిమని యుం జెప్పిరి.

భటులు యిట్లు చెప్పినది వినఁగానే మైరావణునకుఁ గలిగిన యాశ్చర్యం బింతింత కాదు. ఆ వచ్చినవాఁడును, తన వీరభటులను సంహరించిన వాఁడును నాంజనేయుండు దక్క మఱి యొక్కఁడు కాఁడ నియు మఱి యొకని కంతటి సామర్థ్యము గాఁగదనియు నతండు

గ్రహించెను. యోచింపఁ దొడంగెను. తనలో "హనుమంతుఁడే యగును గాక. అయిన? అతఁడీ పాతాళపురమున కెట్లు రాఁగలిగెను? ఇచటికి వచ్చుమార్గము నెట్లు దెలిసికొనెను? దారిలోని గడువరాని యాటంకముల నన్నిటినిఁ దప్పించుకొనిన దెట్లు? ఆహా! ఈపని యెవనికి సాధ్యమగును? అద్భుతముగాఁ దోఁచుచున్నది. రామలక్ష్మణులను నేను గొని వచ్చుటయు. సూర్యోదయ మగుటకు పూర్వమే వారినిఁ జంపులాగున శపథమును జేసియుండుటయు, సమరభూమిలోని తిరుచర వీరులెట్లో తెలిసికొనిరి. రాజపుత్రులను నా బారినుండి తప్పించుకొని పోవుటకై వారు వాయుపుత్రునిఁ బంపి యుండుదురు. ఉండుదు రననేల? అదియే నిజము. వారి యాజ్ఞానుసారముగా నంజనీ నందనుఁడు వచ్చెననుట నిశ్చయము. మహాసమర్థుం డగుటచే, యసాధ్యంబైన యిక్కార్యంబున కతఁడే బూనుకొనెనని తలంచెద కాని, దారినిఁ దెలిసికొనుటకును, నచ్చటచ్చటం గల భయంకరములైన యడ్డంకులను దాఁటి వచ్చుటకును నెట్లు నేర్చెనో, యనుటయే వింతయగు విషయము.

అహో! సరిసరి! ఇపుడు మనస్సునకు జరిగినరీతి తట్టినది. ఇదియంతయు, పాపాత్ముఁడును, కులనాశకుఁడును, కుత్సితుఁడును, ద్రోహబుద్ధియు నైనవాఁడు. ఆమూర్ఖుఁడు—ఆవిభీషణుండు చేసిన కార్యముదక్క వేఱుగాదు. ఈమాయాతంత్రములను వాఁడుబాగుగ నెఱింగినవాఁడు. రాక్షస మాయలందు వానికి దెలియనిదియే లేదు. నేను భానుకులజులఁ దెచ్చినంతట, వారింగానక శాఖామృగవరులు చింతించుచుండఁగా. దీనుఁడై పోయి వారి మరుగుఁజొచ్చి కాలముఁ గడుపుచున్న యాహీనుఁడు—ఆపలువ—ఆయగ్రజాపకారి—వనచరులకు నడిచిన తెఱంగును దెలిపి, యాంజనేయు నిక్కార్యమునకుఁ బురికొల్పి యొప్పించి, యిప్పురంబునకు వచ్చుటకు మార్గమును, రావలసిన విధమును నిచ్చోటగల యాటంకములను, దానిని గడవఁదగిన యుక్తులును దెలియఁజెప్పిపంపెను ఇదియే నిజము. సందేహించవలసినదియే లేదు. అటులగానియెడల, నిప్పురమునుజొచ్చుట కెవనికి తరమగును? అరరే! గొప్ప యాటంకమేర్పడినది. ఇంతకు మున్నే నేనాదశరథ పుత్రులను జంపియుండవలసినది. నా భార్య బలుకుచుండిన వ్యర్థపు మాటలను వినుచు నట్టి తామస మొన

దించినాఁడను. నాయత్నమున కది యిపుడాటంకముగ నుండునట్లై నది. రామలక్ష్మణులం గొనిపోవ వచ్చిన హనుమంతుఁ డా విషయమున నప్రమత్తుఁడై యుండును. వానిని గెలిచి చంపినంగాని యింక రాకుమారులను వధించుటకు వలనుగాదు తడవుజేయక మొదట నమ్మర్కటుని నంత మొదింపవలయును, పిమ్మట తక్కినపని జరుగఁగలదు '' అని యివ్విధమున యోచనఁగావించి, యటహతశేషుల మాటలు వినుచుండిన మంత్రులకు తనకుఁ దోఁచిన యాలోచనయు, చేయ నెంచిన రీతియునుం జెప్పి, యూత్కటంబ యుద్దండ, మహోద్దండులను సేనాపతులను బిలిపించి, వృత్తాంతబు సర్వంబును నెఱింగించి వారితో నిట్లనియె

మైరావణుండు సేనాపతులను హనుమంతునిఁ జంపుటకై పంపుట.

కదాసరణి—ఢోరా.

''సేనాపతులారా మీరిప్పుడు – చయ్యన బోవలయు
వానరుఁ డొకటి వాఁడని దలఁపఁగ – వలదు మీరు వినుఁడు
ఆంజనేయుఁడను వాఁడా వచ్చిన – యతఁడతి బలశాలి
కుంజరవైరిస మానవిక్రముఁడు – కోతిగ నెంచకుఁడు
అలరావణుని యశోకవనంబును – హతమును గావించి
యలఘు బలాన్వితుఁ డగు నయ్యక్షుయు – నసువుల నెడబాపి
అసమున సుందరమగు లంకాపుర – మంతయు దరికొలిప్పి
వెస నేగినవాఁ డీశాఖామృగ – వీరుండే నుండీ!
అలఁతిగ నెంచి ప్రవర్తింపకుఁడా! – యతనిపట్ల మీరు
బలముల నెక్కుడుగాఁ గొనిచని వడిఁ – బట్టి తెండు వాని
పట్టువడక యుండినచోఁ జంపుఁడు – భయమున మరలకుఁడు
చట్టన నరుగుఁడు తడవొనరింపఁగ – సమయముగా దిపుడు''.

అని యాజ్ఞాపించెను. అంత నమ్మహాశూరులగు సేనానాయకు లిరువురునుం జని, సింగంబులవలెను, గార్దభంబులవలెను, గజ, తురంగ, గో, మహిషంబులవలెను, నొంటెలవలెను, పందులవలెను, - నక్కలవలెను, కుక్కలవలెను, మేకలు, పొట్టేళ్లు, తోడేళ్ళు, శివంగులవలెను, మొసళ్ళవలెను ముఖంబులు గలవారును, ఏనుంగుల చెవుల వంటి చెవులు గల వారును, గాడిద చెవులును, గుజ్జుపు చెవులును

గలవారును, మిగుల పొడవుగ నుండువారును మిక్కిలి పొట్టివారును, స్థూలదేహులును, వక్రశరీరులును, నొంటిచేయియు నొంటికాలును, రెండు తలలును, మూడునాలు, గైదుతలలును గలవారును, నిడుద కోరలును, వ్రేలాడు ముక్కులును, వెడదనోళ్లును, వెలికి జాఁచిన పొడవు నాలుకలును, పెద్దపెద్ద పెదవులును, గలిగిన నల్లని వికార రూపములు గల మూడుకోట్ల రాక్షస వీరభటులు, తమతమ యా కృతులకుం దగిన వాహనంబు లెక్కి, పరశు, పట్టస, తోమర, భిండివాల, ముసల, ముద్గర, గదా, ఖడ్గప్రముఖ నానావిధాయుధం బులను బూని, యఱపులు, నట్టహాసములును, పెడబొబ్బలును సతిశ యింపగా, తమ్ము పరివేష్టించి వచ్చుచుండ, తా మ్రమకల్పితములైన తేరుల నారోహించి, భేరీ, కాహళ, తమ్మట ప్రముఖవాద్యధ్వనులు మిన్నుముట్టగాఁ గదలి యతిరభసంబున "నాంజనేయుని పట్టుకొని బంధించెదము కాదేని చంపెద" మని తమ ప్రతాపం బేర్పడం బలుకుచు తోరణ స్తంభంబు దగ్గఱకువచ్చి, అచ్చోట నుండినవారిని సంహరించి, యలసటఁ దీర్చుకొనుచు పరిఘాహస్తుండై కూర్చుండి యున్న, యమ్మహా బలాత్మజుం గాంచి, రోషంబు మీఱగాఁ జుట్టు కొని "ఓరీ! కీశాధమా! ఎక్కడివాఁడవు? ఏల వచ్చినాఁడవు? ఎట్లు వచ్చితివి. ఇది మైరావణ ప్రభుని నగరంబని తెలియదా? ఇచటి కరుదెంచిన నీకిఁక బ్రతుఁకెక్కడిది? మృత్యువు కుత్తుకఁజొ చ్చినట్లే యని తెలిసికొని చావునకు సిద్ధమగుము" అని బెదరించి పలుకుచు, తోలుత పట్టుకొనుటకుఁ బ్రయత్నించిరి. కాని యా వా నరయూధ ముఖ్యుఁడు దాపున వచ్చిన వారల నత్యాగ్రహముతో, తనచేతి పరిఘాయుధముతో మోది మడియించెను. ఇంక పట్టుకొన నలవిగాదని యెంచి, సేనాపతు లతనిఁ జంపుటకై సేనలను గవి యించిరి.

హనుమంతుఁడు వారలం గని చీరికిఁగొనక "ఓగు రక్కసు లారా! నాచేత మీరేల వ్యర్థముగాఁ జచ్చెదరు? నన్ను జయించు టకు మీకుగాని, మఱి పరమేశ్వరునకుఁగాని శక్యముగాదు. నేను వాయుపుత్రుఁడను. హనుమంతుఁడను వాఁడను, సుగ్రీవుఁ డనెడి వానర రాజునకు మంత్రిని. సూర్యకులశేఖరుఁడగు రామచంద్రుని బంటను.

మీప్రతాప బల సామర్థ్యంబులు నాముందు జెల్లవు. శీఘ్రముగా మరలిపోయి, దుష్టుఁడును పాపశీలుఁడును నైన యీమాయకానిని— మీప్రభుఁడగు కుటిలుని—ఆమైరావణునిఁ గొనిరండు. నేను చెప్పిన మాటలు వానికిఁ దెలుపుఁడు. కాదేని మిమ్ము నిమిషమున యముని యింటి పూటకాపులం గావించెద''—అని యందఱకును వినునట్లు గొంతెత్తి యఱచి పలికెను.

అతఁడు నుడివిన యీమాటలు చెవుల సోఁకగనే యుద్దండ మహోద్దండుల కోప మధికరించెను, "ఆహా! ఈబికారికోఁతి యీమనల జయించునది? ఈమర్కటమా మనకు బుద్ధిగరపుట. బాగు బాగు. గర్వమున కన్నుగానక వదరుచున్నాఁడు. బ్రమందింపుఁడు బ్రమందింపుఁ" డని సైనికులఁ గవియించిరి. మారుతి వారి గర్వమును గనుఁగొని "ఎట్లూ? చంపెదరా? అదియేలాగో చూచెదఁ గాక''—యని విజృంభించి, పరిఘాయుధంబుతో బ్రేయుచు, తలలు బ్రక్కలుజేసియు, కాళ్ళును చేతులును విఱుగం గొట్టియు, నురంబులు బగిల్చియు. నడుములు దునుఁగనేసియు, వాహనంబులఁతోడ గుట్టలు పడనేలగూల్చి నెత్తురు వెల్లువ పాఱునట్లు చేసిన, రక్కసులు యెదిరించి నిలిచిపోరలేక, వెఱచి నలుగెలంకులకును పరుగెత్త దొడంగిరి. సేనాపతులు తమ బలంబులు మూఁడుపాళ్లు హతమగుటయు, ఒగిలిన వారు భీతిల్లి పరువిడుచుండుటయు, నాంజనేయుండు వెన్నంటిమోది వారిని చంపుచుండుటయుం జూచి, మండెడి నిప్పులో నేయిబోసిన విధంబున, నత్యంత కోపావేశంబుతో బ్రజ్వలించుచు, పరువిడుచున్న బలంబులను నిలువరించి ధైర్యంబుఁగఱపి కూర్చుకొని వచ్చి భయంకరముగా నంజనీనందనునిం దాఁకిరి. అపు డతనికిని వారికినిపోరు ఘోరంబుగ నయ్యెను.

మైరావణుండు కాళికాలయమున రామలక్ష్మణులు లేకుండుట

నెఱింగి చింతించుట.

పూర్వోక్త క్రమంబున సేనానాయకులకును, హనుమంతునకును యుద్ధము జరుగుచుండఁగా, మైరావణుండు, "తాను దశరథ పుత్రులను భద్రకాళి గుడిలో బెట్టియుండుట నొకవేళ నాంజనేయుండు దెలిసికొని, వార్ల నచ్చోటనుండి గొనిపోయి మఱియెందైన

నునిచి యుండునేమో"—యని సంశయించి, యారీతి నెఱుంగఁ దలంచి జల్లి, జగజ్జల్లి యను వారలంబిలిచి "మీరు భద్రకాళి గుడికిఁ బోయి, యచ్చట నేను పెట్టిన రామలక్ష్మణులు గల పెట్టియ నెత్తుకొని, నా చెల్లెలు దోర్దండి యచ్చటికి వచ్చి యుండును గాన, యామెను వెంటఁ బెట్టుకొని త్వరితముగా నరుగుదెండు పొం" డని యాజ్ఞాపించె. ఆ రక్కసు లిరువురును నతి వేగంబుగ కాళీ దేవళమున కరిగి చూచిరి. అచట మైరావణు డునిచి వచ్చినట్లు చెప్పిన పేటికగాని, యతని తోడబుట్టువు గాని వారికిఁ గనుపడక గుడిలో నలుగెలంకులను వెదకిరి. సందు గొందులలో చూచిరి. వెలుపటను, లోపల పలుమారు పరికించిరి. కాని, ప్రయోజనము లేకపోయినది. పెట్టెగాని, దోర్దండిగాని కనుపడనేలేదు. ఎట్లు పోయినది దోర్దండి? పెట్టెయెక్కడ? ఏమో! ఎవరికిఁ దెలియును? ఆశ్చర్యమునొంది వెదకి వెదకి వేసారి, జల్లీ జగజ్జల్లులు పోయినట్లే మరలి వచ్చి, "పెట్టెగాని, దోర్దండిగాని, కాళిగుడిలో తమకు కనుపడలేదు. కడు జాగ్రతగా వెదకి వృథా ప్రయాసనొంది వచ్చితి"—మని విన్నవించిరి.

మైరావణునకు మిక్కిలి యాశ్చర్యముగ దోచినది. తనలో ఏమో? యద్భుతముగా నున్నది? గుడిలో పెట్టెలేదా? దోర్దండిలేదా? నేను తెచ్చిపెట్టిన పేటిక యెందు బోయినది? ఒకవేళ నా మర్కటుండు రామలక్ష్మణుల నుంచియున్న పెట్టె గుడిలో నున్నదని తెలిసికొని, దానిం గొనిపోయి మఱి యెచ్చటనేనియు దాచియుండునా? అలాగు జరిగియున్నను, దోర్దండి లేకపోవుట కేమి కారణమైయుండును? "అభిషేక జలమును గొనివచ్చి గుడిలోఁ బెట్టుకొని యుండుమని గదా? ఆజ్ఞాపించితిని. ఇంతలో పెట్టెయు, నమ్మగువయును గాన రాక పోవుట యెట్లు? నా మాయలకు మించిన మాయగా యున్నది. ఈ వింతకు నిమిత్త మెటులఁ దెలియును? హనుమంతుని వెంట మఱి యొకఁ డెవ్వఁడైనను వచ్చియుండి యాపేటికను గొనిపోయి యుండునా? అది యెట్లు సాధ్యమగును? ఈ పురములోనికిఁ జేరినంతట్లు, నాకుకాని వాఁ డెవ్వఁడైనప్పటికిని నేను బ్రతికియుండగా, నిందుండి మరలి పోవుటకు శక్యమగునా? అవ్విధమునఁ గదా? బ్రహ్మచే వరమును బొందియున్నాను. ఆలాగున జరుగుటకు వలను గాదు.

జరిగియుండదు. ఏదో యిది తంత్రముగా దోఁచుచున్నది ఈ వచ్చినకోతి వానికి లోఁబడి దోర్దండి యాపేటి కొనిపోయి పెట్టుకొని యెందైనను దాగి యున్నదేమో'' యని పెక్కు తెఱంగులఁ జింతించి, తన ప్రయత్నమునకు భంగము వాటిల్లెనని వగచి, "హనుమంతునిఁ జంపిననే గాని యుద్దేశించిన పనిని నెరవేర్చుట కింక వలనుగా''దని నిశ్చయించి, మరల జల్లీ జగజ్జల్లులం బిలిచి "విరోధి మాటలకు లోఁబడి దోర్దండి పెట్టెను గొనిపోయి యెందైనం బెట్టుకొని కానరాక దాగి యున్నదేమో, కాదేని యాబిడ కనఁబడకుండుటకు కారణము గలుగదు. కావున మీరు వెండియుం జని పురంబున రహస్య ప్రదేశంబుల నన్నియెడలను జాగ్రతగా వెదకుఁడు. ఉపేక్షింపఁ దగిన పని గా''దని చెప్పి పంపెను. వారతని యనుజ్ఞను గొని వెదకుటకై వెడలిపోయిరి. మైరావణునకు మాత్రము సంశయము తీరినది కాదు. మహా బల పరాక్రమశాలురైన సేనాధిపతులు హనుమంతుని నెట్లైనం జంపి రాగలరనియు అటమీఁదట తానెంచిన పని నెరవేఱఁగలదనియుం దలంచి, వారికై నిరీక్షించుచుండె.

## హనుమంతునిచే, నుద్దండ మహోద్దండులు చచ్చుట.

అట నుద్దండ మహోద్దండులు మహాపరాక్రమముతో మారుతాత్మజునిం దాకి యతనిపై శరవర్షమును గురిసి, పలువిధములైన యాయుధములతో నొప్పించుటయు, నయ్యగచర సత్తముఁడెంతయు నొచ్చి, మహాదాగ్రహముతో ప్రళయకాళరుద్రుని తెఱంగు నుగ్రమూర్తి దనర, దిక్కులు భేదిల్లు లాగున నార్చి పరిఘను బూనినింటికెగిరి, మహాశైలంబుపై నుండి పడిన తెఱంగున నుద్దండుని తేరుమీఁద గుభాలున దుమికెను. దుముకుటయు, నయ్యరదంబు మార్గంబయ్యె. నపు డారక్కసుండెటులనో తప్పించుకొని, గదను గొని యాంజనేయునిం దాకిన, నిరువురకును భయంకర యుద్ధము జరుగఁదొడంగె. ఆశ్చర్యకరమగు వారి పోరాటమునుగాంచి యేమి చేయుటకును దోఁచక సైనికులు వెఱగుపడి యంతంతటనిలిచి చూచుచుండిరి.

అపుడు పవన నందనుండు తనలో "ఓహో! నాలవజాము ప్రారంభముగా నున్నది. ప్రొద్దుచాల గడచిపోయినది. ఈరక్కసులతో నివ్విధంబునఁ బెనగుచు కాలహరణముఁ జేసినయెడల వచ్చిన పనిని నెరవేర్చుకొని పోవుట యెట్లు! చేయవలసినపని యింకనుం జాలగలదు. సూర్యోదయమగుటకు పూర్వమే నేను రఘువీరులం గొని సుగ్రీవాదులయొద్ద కరుగవలయును గదా? తడవుగావింపకూడ" దని యెంచి గదను గిరగిరం ద్రిప్పి వ్రేయుటకై తనమీఁదికి వచ్చుచున్న యుద్దండుని వ్రేటుం దప్పించుకొని తటాలున నెగసి వాని యురంబును బెట్టుగా దన్నెను. ఇంద్రుఁడు పర్వతంబు నేసిన వజ్రాయుధంబు వ్రేటునుంబోలె, యాతాపు దగులుటయు, వానిరొమ్ము బ్రద్దలుగా బగిలి నోటను, ముక్కులను నెత్తురు పెల్లుగా వెడలుచుండ దిగ్గన నేలఁబడి గిజగిజ దన్నుకొని ప్రాణంబులు విడిచె.

ఉద్దండుండు పడినది చూచి, మహోద్దండుఁడు మహోద్దండదండ ధరాకారుండై మండుచు, మరుత్సుతుని దరియ తేరుఁదోలించి, యార్చి యట్టహాసం బొనరించి, తన సామర్థ్యం బేర్పడునటు వాఁడి మిగుల బలుతూఁపులు బరపి, యలంచిన, హనుమంతుఁడు బాణఘాతములచే నొచ్చి, నెత్తురులురుల పూఁచిన మోదుగునుం బోలె గనుపట్టుచు, కోపంబు మించుటయు, నుద్దండుండు నేలఁబడచియున్న గదనుగొని, తేరుమీఁదికి లంఘించి, బెట్టిదంబుగాఁ ద్రిప్పి మోదుటయు, నవ్వ్రేటుచే మహోద్దండుని భుజంబొకటి మొదలంట దునిఁగి క్రిందఁబడెను. వాఁడు నగరంబంతయు బెగ్గడిల్లులాగుననార్చి వాలును గొని, యాంజనేయునిఁ దెగనేయ గమకించుటయు, నమ్మేటివీరుండు ఖడ్గంబునొడిసి గైకొని, వాని రెండవ భుజంబును ఖండించి, తేరును గుఱ్ఱములను ధ్వంసము గావించెను.

వాఁడు మిగుల నాగ్రహముతో దిక్కులు బగులులాగున నార్చి కొండ గుహనుం బోలె నోరుఁదెఱచుకొని రక్తసిక్తాంగుఁడై హనుమంతు మ్రింగవచ్చెను. అమ్మహావీరుండైన వానరోత్తముఁడు "ఔరా! ఇంకను నీ పోతర మడంగలేదా?" యనుచు గదతో పిడుగుపడిన విధమున వాని తలపై బలమైన యొకవ్రేటు వేసెను. ఆదెబ్బతో మహోద్దండుని శిరంబు వ్రక్కలై, వాఁడు నేలగూలె.

అంత హనుమంతుఁడు వానికి సహాయుఁడై వచ్చి, చావగా మిగిలి యున్న రక్కసులను మర్దించి యమపురంబుఁ జేరునట్లు జేసి, మైరావణ వధోపాయంబును గూర్చి యోచింపుచు తోరణ స్తంభముపైఁ గూర్చుండె. కాని యతఁడు తలంచి నట్లు పాతాళ లంకేశునిఁ జంపుట సులభముగాని పని యేర్పడినది. దెబ్బలఁదిని పాఱిపోయిన యొకరిద్దరుని నిశాటులు మైరావణుని చెంత కరిగి, యుద్దండ మహోద్దండులును, వారి సేనయును నిర్మూలం బగుట నెఱింగించిరి. వనచరుని బల పరాక్రమంబు దలంచి యచ్చెరువొంది, ఇంద్రాది "దేవతలను సయితము చీఁకిఁ గొనని శక్తి యుతులగు తన సేనానాయకుల నొక వానరుండు వధించెనుగదా?" యని వగచి, ఏవిధమున నేనియు వాయుపుత్రుని మడియింప వలయుననెడి యుద్దేశముతో, ఘటోదర, కిటిముఖ, జ్వాలావక్త్ర, విభీషణ, రక్తాక్ష, ప్రముఖుల, పేరుపొందిన మహా వీరులం గొందఱను రావించి హనుమంతుని వధింపుఁడని యాజ్ఞాపించెను, ఒక్కొక్కఁడే లోకంబంతయుఁ గబళింపఁ జాలినవారై యొప్పుచుండెడి యా యసుర వీరులు 'మహాప్రసాదం' బని వీడ్కొని చని, మహా బలీయులగు నాలుకోట్ల దనుజులతోఁ గూడి, వరుసగా, సింహ, వ్యాఘ్ర, భల్లూక, శరభ, భేరుండాది. వాహనము లారోహించి వివిధాయుధంబులు దాల్చి, పాతాళ లోకంబు గ్రక్కదలగాఁ గదలి, వాద్య ఘోషములును, భయంకర గర్జన ధ్వనులును నతిశయింపగా రయంబునఁ నగరి తోరణ స్తంభముపై నుండు వాయుపుత్రునిం జుట్టుకొని, బాణములచేతను నాయుధంబులచేతను మిక్కిలి నొప్పించిరి.

ఆంజనేయున కత్యంతమైన కోపము గలిగినది. రౌద్రాకారుఁడై పరిఘను బుచ్చుకొని తనలో "వాఁడేడీ? ఆ పాపశీలుఁడు. మైరావణుఁ డెక్కడనున్నాఁడు. వాఁడురాక. యీ యధమ రాక్షసుల గుంపు వచ్చినది. ఏమి ప్రయోజనము?" అని తలంచుచు క్రిందికి దుమికి, యసుర సేనలోఁ జొచ్చి, మందించిన సింగంబు, జింకల గుంపులోఁ బ్రవేశించినట్లును, మత్తకరి తామర కొలనులోని కరిగినట్లును, దైత్య బలంబులను ఛిన్నాభిన్నంబుఁ గావించి, మొత్తములుగా చచ్చి నేలఁ గూలునట్లు మర్దించి, మొనగాండ్రని యెన్నికకెక్కిన ఘటోదరాదుల నొరికనైన తప్పక యొడలున నెత్తురు గాఱు

లాగున మోదిన, వారు మిక్కిలి నొచ్చియుఁ జలింపక, నెదిరించి, పోరఁ దొడంగిరి.

అటుల భయంకరముగా సమరముఁ జేయుచున్న సమయమున యాదనుజ వీరులలో, ఘటోదరుఁడను వాఁడనిల నందనునిపై పెల్లుగా, మింటికెగిరి రాళ్లవానఁ గురియించె. కిటిముఖుండు, ప్రచండమగు గాలి నిఁబుట్టించె. జ్వాలావక్త్రుఁడు మంటలు బుట్టించి మీఁద బర్వునట్లు గావించె. విభీషణుఁడు పెను ధూళింగప్పె. రక్తాక్షుండు, శర నికరంబుఁ బరపి, యంధకారం బతిశయించునట్లు జేసె. ఇవ్విధమున నొక్కొక్కరు నొక్కొక తెఱంగున సంకటము గలిగించి యలంచు టయు, మహా సమర్థుండయ్యును, కేసరీ పుత్త్రుం డెట్లు చేయుటకును దోఁచకయు, వలను గాకయుఁ జిక్కువడి, సత్క్రియా దీక్ష వహించిన తనకు సహాయులై రక్షింపుఁడని తనలో త్రిమూర్తులను, పంచ భూతములను, దిక్పతులను, నవగ్రహంబులం దలంచి ప్రార్థనగావించి, పుణ్యపురుషులగు కౌసల్యా, సుమిత్రాత్మజుల యాపన్నివారణ కార్యార్థియై వచ్చిన తనయందు కరుణాదృష్టులం బరపి, కర్తవ్య ప్రకారంబు నాదేశించిన, పరమ పావనియు. జగన్మాతయునైన భద్రకాళి సంస్మరించి యిట్లని స్తుతించె.

చ॥ అసమమహాప్రభావమున - నగ్గలపుం గృపనెల్లలోకముల్
విసువక సర్వదావెలయు - వేడుకమైనొగిఁ గాచుచుండుసా
రసరిపుమౌళి రాణిశుభ - లక్షణశోభిత కీరవాణియా
యసురులమా యలందొలఁగు - నట్లుగఁజేయఁ గదమ్మశాంభవీ!

కథాసరణి - ద్విపదరా.

తడవగుచున్నది జాముదాత్రినా - త్రం బేగలదింక
మడియుగ లేదీవరకును దుష్టుఁడు - మైరావణుఁడతనిఁ
జంపిగాని నేరఘువీరులఁ గొని - చనఁగ తరముగాదు
పెంపగు కరుణాదృష్టులఁ గనిగెలి - పింపుమునను జననీ!

అని స్తుతించిన, తక్షణంబ యారక్కసులు చేయుచున్న మాయాకృత్యములు భద్రకాళి కృపావిశేషంబువలన, సూర్య రశ్మిచే తొలంగిన మంచువలె పటాపంచలయ్యె. పరిపూర్ణమైన దైవ

సహాయము గలవానికి, మహాపర్వతములు బెండువలెను, సముద్రములు పిల్లకాలువల వలెను నగుచుండును గదా ! హనుమంతుని కృత్యములు నిరాటంకముగా నెరవేరుచుండుటలో, నతిశయమేమిగలదు? అతఁడు దైవబలము గలవాఁడు. కావున తలంచిన పనులన్నియు ననుకూలించుచుండును. కాళీ మహిమచే, ఘటోదరాదుల కృత్యములు వమ్మగుటయునన నిలజుండు సంతసించి విజృంభించి వారలపైఁ గవిసి, వీరావేశం బతిశయింప, నయ్యసుర బలంబులను పరిఘతో మోదియు, చేతులతో నలిపియు, కాళ్ళతో నేలఁబడవైచి రాచియు, తోఁకతోఁజుట్టి త్రిప్పి భూమిమీఁద నలియునట్లు గొట్టియు, నిర్మూలించి సైన్యనాయకులుగా వచ్చిన వారలను దిట్టతనంబుతో నొక్కొక్కనిఁగాఁబట్టి పడఁగొట్టి నిరవశేషం బొనరించి, మైరావణ వధోపాయంబు నెంచుచు, తోరణ స్తంభంబుపైఁ గూర్చుండెఁ.

అంత సమర వృత్తాంతంబు నంతయు విని మైరావణుఁ డాంజనేయుని బలపరాక్రమంబుల కెంతయు విస్మయించి, ఎట్లును నతని సంహరించియే తీరవలయు ననెడి దృఢసంకల్పము గలవాఁడై, చండ, ప్రచండ, విబుధద్వేషి, యజ్ఞధ్వంసి, ఘూకనేత్ర, సింహవిక్రమ, శూలరోమ, కంటక, కుటిలదంత, మహాశిర, నామములుగల యధిక బలపరాక్రమ వంతులగు పదుగురు పరవీరభయంకర దనుజ వీరులం బిలిచి "వింటిరా ? ఎట్లో మహాసత్వ సంపన్నుండైన హనుమంతుఁ డనెడి మర్కటుండు రేయికిరేయిగ మనపట్టణంబునకువచ్చి, యిందు గల, లెక్క యిడరాని సత్వవంతులను మనయసురవీరులను సంహరించెను. పేరొందిన మేటి రక్కసుల లెల్లరును వానిచే నిహతులైరి. వాఁడు యింతకు మున్ను దశముఖ పాలితం బగు లంకాపురంబుఁ జొచ్చి, పెక్కండ్రు రాక్షసులం జంపి, యా నగరంబును గాల్చి, పెక్కు దుండగము లొనరించి పోయెనఁట. యిపుడు మన పురంబునందు సయితము నిశ్చయముగా మనసేనలం జంపుచు తోరణ స్తంభంబునొద్ద నున్నాఁడఁట. మీరు శీఘ్రముగా ప్రబల దలంబులతోఁ బోయి వానిని పుడమిఁ బడఁగూల్చి, యతి శీఘ్రముగా నరుగుదెండు పొం" డని యాజ్ఞాపించె.

ఆమేటి రక్కసులు తమ యేలిక యాజ్ఞను తలఁదాల్చి "మహాప్రభో! అసురవల్లభా! కోతి యొకటి గొప్పసైన్యములను, శూరాగ్రేసర సముదయంబును హతిమొనరించెనని మీరు పలికిన మాటలు వినఁగా మాకు మిగుల నాశ్చర్యముగాఁ దోఁచుచున్నది. ఎంతబలము గలిగి యుండినను కోతియే గదా? దానికింతగర్వమా? మొదటనే మీరు మమ్ముఁ బనిచియుండవలసినది. ఆపుడే మర్కటునిపొగ రడఁగించి యమపురమునుజేర్చి యుండుదుము. ఆలంకా పట్టణములోనాడిన వానియాటలు మన నగరములో మనముందటఁ జెల్లునా? వాఁడెంత? వానిబలమన నెంత? ఈక్షణంబ మేము పోయి పనుగురమును, సాధ్యమగునంత వరకునుం బ్రయత్నించి వానిని మీసన్నిధానమునకు పట్టితెచ్చెదము" అని భుజంబులు దట్టి ప్రగల్భోక్తులు పలికి యట గదలి, తమతమకుం దగినవియు, సకలాయుధములతోఁ గూడినవియు, పిశాచముఖ గార్దభంబులు బూన్చినవియు నైన రథంబులారోహించి, జముని సయితము చీరికిఁ గొనని యుద్దండి కలితులగు నేడుకోట్ల వీరభట సముదయంబును వెంటఁగొని మిక్కిలి యాడంబరముతోఁ బోయి, వారి రాకంగని యుగ్రుండై ధ్వంస మొనరింప వలయుననెడి యుద్రేకముతో నుండెడి యాంజనేయుని సమీపించి, "ఓహో! అదుగో! దుష్ట మర్కటుఁడు. పాఱి పోవ లేదు. ఉన్నాఁడు. ఉన్నాఁడు. ఇంకఁ జచ్చినవాఁడే! మన దృష్టికిఁ దోఁచినంతట వీనికి బ్రతుకెక్కడిది? చుట్టుముట్టి, సాక్షి సోలి తోరణ స్తంభము మీఁదఁ బడునట్లు మీమీ యాయుధంబుల నుపయోగింపుఁడు. చావక యుసురులతో నుండినేని, మన దొరయొద్దకుఁ గొని పోవుదము. లేక చచ్చెనా? చావనిండు. ఎటులనైనను మేలేయగును" అని యొండొరులు, బెట్టుగాఁ బలుకుకొనుచు, పరశు, పట్టిశ, భిండివాల, శక్తి తోమర, కరవాల, చక్ర, గదా, కుంత, త్రిశూల, ప్రముఖ బులైన యాయుధంబులం బ్రయోగించియు, క్రూర శర నికరంబును బరపియు, తమ సామర్థ్యంబంతయు వినియోగించి హనుమంతునిఁ జంపుటకుఁ బ్రయత్నించిరి.

హనుమంతుఁడు సేనాయుతంబుగా చండాదులగు రాక్షసవీరులఁ బొరిగొనుట.

భగవత్కరుణా విశేషంబువలనను, భద్రకాళి యనుగ్రహంబు చేతను, క్రూరులైన యా నిశాటులు ప్రయోగించుచున్న యాయుధంబులవలన ననిలసుతున కిసుమంతయును బాధ గలుగకుండుటయె గాక యా సాధనములతని మేనుదాకి పొడి పొడియై రాలుచుండె. ఆ తెఱంగుఁ జూచినంతట, చండ ప్రచండాది వీర దశకమున కాశ్చర్యము గలిగినది "బళీ! కొండల నేనియుం బిండి చేయఁగల మన యాయుధంబులు గాని, మన భుజ బలంబుగాని, యీకోతి వానిపట్ల నిరుపయోగ మగుచున్నది. ఇది యేమి వింతయో తెలియలేదు. వీఁడెద్దియో, జాలవిద్య నేర్చినవాఁడని తోఁచుచున్నది. అగుగాక వీని టక్కుటమార విద్యలు మనయొద్ద ఫలించునా? చూతముగాక" అని యుగ్రులై గర్జనఁ జేయుచు, నార్చుచు, బెదరించుచు, మఱి మఱియుం దమవలనైనంతవరకును వానర యూథ ముఖ్యు నయ్యాంజనీ నందనునిఁ జంపుటకు యత్నించిరి. కాని వారి కడంక కొనసాగినది కాదు. ఇట్లు వారు గడిసి వివిధ సాధనంబులను దన మీఁదఁ బ్రయోగించుచుండగా, పరిఘాహస్తుండై, పరాక్రమవంతుఁ డామరుత్సుతుఁడు, దిగ్గన తత్సైన్య మధ్యమున దుమికి, యెండిన యడవిలోఁ గార్చిచ్చు బొడమిన విధంబున కోపాగ్నిచే ప్రజ్వలింపుచు, పరిఘతో మోదియు, పాదంబులు గ్రహించి త్రిప్పి నేలఁగొట్టియు, దన్నియు, నవయవంబులు విరిచియు, నొకనితో నొకని వ్రేసియు, తోఁకతోఁ గొట్టియు, నఖములతోఁ జీల్చియు, గఱచియు, నేలరాచియు, మారి మసంగిన చందమున, మేకలగుంపులో బెబ్బులి ప్రవేశించిన తెఱంగున, ఛిన్నాభిన్నముఁ గావించి, విచిత్ర విహారం బొనరించిన, పగిలిన తలలును, విఱిగిన యంగంబులును, గిజగిజ దన్నుకొను మొండెములును, తునిసిన యెమ్ములును, గలిగి యాయుద్ధరంగము నెత్తురు వెల్లువలు పారుచుండ, శవమయంబై, భయంకరమై కనుపట్టుచుండె.

చావక మిగిలిన రక్కసులు. "ఓయబ్బా! వీఁడు వానరుఁడుగా దోఁచలేదు. రాక్షసకులమును నిర్మూలముఁ జేయుటకై వచ్చిన

కోతి రూపుదాల్చిన మృత్యువుగాని వేఱుగాదు. అయ్యో! తెలియక వచ్చితిమి. వీనిబారిం జిక్కితిమి. బ్రతుకుటెట్లు ? తప్పించుకొని పోవుటకు వెరవెయ్యది? వీనిచే జావవలసినట్లు విధాతమన నుదుట వ్రాసెను కాఁబోలు'' నని వాపోవుచు, ఎటుచూచినను తమ కన్నులకు హనుమంతుని యాకృతియే దోఁచుచుండ, దీనులై యరచుచు, నే వంకకు దిరిగినవాఁ డావైపునకు తిరిగి చూడక, వస్త్రంబులు సడల, తలలు వీడ, నాయుధంబులు పడవైచి మహా భీతితో పరుగెత్తి పోయిరి.

అపుడు చండ ప్రచండాదులగు రథికులు పదుగురును, హనుమంతుని విజృంభణమును, తమ దళంబులకుఁ దొడరిన దుర్దశయుంజూచి, మహాదాగ్రహంబున, త్వరితముగ రథంబులను దోలించుకొని పోయి, పాఱిపోవుచున్న హతశేష పదాతి సముదయంబు నడ్డగించి ధైర్యంబు గఱపి, మొక్కమొగంబు జేసి కూర్చుకొని యతిరభసంబునఁ జనుదెంచి హనుమంతుని ముట్టడించిరి.

మెఱపు మెఱసిన రీతిగా మారుతి రెప్పపాటులో మింటికెగసి, చండుని తేరుపై దూకెను. ఆయతిభారము గల యతని దూకుడచే రథమును, గుఱ్ఱములును చండుఁడును రూపమే తెలియ పిండిపిండియై కూలెను, వెంటనే ప్రచండ ప్రముఖుల యరదంబులం గూల్పఁ బూని యొక్కొక్కటిగా విఱుగఁదన్ని నాశ మొనరించిన వారు తొమ్మండుగురును విరథులై కోపావేశంబు రెట్టింప, సింహనాదములు సేయుచు వరుసగా, కుంతమును, పరశువును, ముసలమును, కరవాలమును, గదయును, శక్తియు శూలమును, ముద్గరమును, తోమరమునుం గొని యొక్కసారిగ నాంజనేయునివలయాకారముగ జుట్టి నిలిచి, తమ తమ యాయుధంబుల నతనిపైఁ బరగించిరి. కాని యావనచరవీర ముఖ్యునకు వారి యాయుధములు గడ్డిపోచతోఁ గొట్టినంత మాత్రము కూడ దేహమునకుఁ దగులలేదు నూవుగింజంత గాయము సయితము గలిగినది కాదు. ఆవింతం జూచి రక్కసుల మొనగాండ్రు విస్మయమొంది, వెలవెలఁబోయి విసుగుఁగొని యలసి నిలిచిరి. హనుమంతుఁ డదియు మంచి సమయమని యెంచి, యలుపుఁజెంది యధిక సత్వహీనులై

యున్న యాతొమ్మండుగురను నొక్కొక్కని నొక్కొక్క దెబ్బతోఁ బడఁగూల్చి విగతజీవులంజేసి, దళంబుపై గవిసి మర్దించి మడియించిఁ సింహనాద మొనరించెను. ఆధ్వనిచే పాతాళ లంకా పురములోని రాక్షసుల హృదయంబులు గలంగి పోయెను. "ఆకాశము విఱిగి కూలినదా ? ఏమి ?" యని మైరావణుం డెంతయు విభ్రాంత చిత్తుండయ్యె. అంతలో హతశేషు లరుగుదెంచి, జరిగిన విధంబును విన్నవించిరి. అతఁ డప్పటికిని తన పట్టుదలను విడువరాదనియే నిశ్చయించెను. వానరుండు వచ్చినది చేయనుండిన కార్యమున కాటంకముగా నేర్పడినది. "వానిని వధించు టెట్లు ? పెక్కండ్రు మహావీరులగు రక్కసులును, వారితోడ నరిగిన యసంఖ్య దళంబులును హతులైరి. పుడకతోఁ గొట్టిన చచ్చెడికోతి. ఆ హనుమంతుఁ డొక్కరుం డందఱు రాక్షసుల సంహరించుట యత్యాశ్చర్యముగా యున్నది. వాని నెవ్విధమున నేనియు మోసగించి వధింపవలయును" అని చింతించి, ఘోటకర్ణ గుండోదరు లనెడి పేరులు గల మహా ప్రజ్ఞావంతుల మాయా ప్రవర్తన ప్రవీణుల నిరువురను రావించి వారికి కొన్ని రహస్యముగా నొనరింపవలసిన పద్ధతులనుపదేశించి ,'పొండు కృతకృత్యులరై త్వరితముగా నరుగుడెం" డని పనిచినయంత భయానక మహాబాహు, పిశాచముఖ, భూమలోచన, వరాహపాద, మనుజాంతకు లనెడి త్రిజగద్భయంకర బల పరాక్రమ యుక్తుల నైదుగురు శూరాగ్రేసరుల నధిక సైన్యయుతముగా మరున్నందన వధార్థంబుగాఁ బనిచెను.

వారలు తోరణ స్తంభ ప్రదేశమును సమీపించుటకు పూర్వమే చండాది వీరులను సైన్యమును సంహరించి, మైరావణ వధోపాయంబుఁ జింతించుచున్న యాంజనేయుని యొద్దకు హటాత్తుగా, మైంద, ద్వివిదులను వానరవీరు లరుగుదెంచి ముందు నిలిచిరి. వారినిఁ జూడఁ గనే, యనిలజునకు గలిగిన యాశ్చర్య మింతింతగాదు తనలో "ఔరా! వీరు యేల వచ్చిరి ? ఎట్లు వచ్చిరి ? దుర్గమమైన యీపాతాళ లంకామార్గము నెఱింగి, యంతరాయముల నన్నిటిని దహించుకొని యిచ్చోటికి వీరెవ్విధంబునఁ జేర నేర్చిరి ? వీరి రాకకు కారణ మేమై యుండును" అని చింతించి వారింజూచి "వానర వీరులారా ! మీర లరుగుదెంచుటకు నిమిత్త మెయ్యదియో తెలిసి

కొనఁ జాలకున్నాను. అది యట్లుండఁగా, నేను నానా కష్టములును బడి "చావు దప్పి కన్ను లొట్టబోయె" నని నట్లు చేరిన యిప్పురంబునకు యింతలో నింత సులభముగా నేతెఱంగున రానేర్చితిరి ? వృత్తాంతము త్వరితము నెఱింగింపుఁడు. నా సంశయమును నివారింపుఁ" డని యడిగెను

మైంద ద్వివిదులు మారుతికి సుగ్రీవ సందేశం బెఱింగించుట.

క॥ మేమరుదెంచిన విషయము । నేమనిబలుకుదుముచాల – నెగ్గు ఘటిల్లెఁ । ధీమంతా! హనుమంతా! క్షేమంబికేడమనకు ?–జెడితిమి సుమ్మా!

సీ॥ క్రూరచిత్తుండగు మైరావణుఁడు రఘు –
కులులఁ దోడ్కొనిపోవఁ–గోరినీవు
వచ్చుటనెఱిఁగియే – వగనైనపంతంబు –
నెర వేర్చుకొననెంచి – నిన్నెదిర్చి
యుద్ధంబుఁగావించు – చుండగఁ బెక్కండ్ర –
మేటిరక్కసుల నీమీఁదికనిచి
యదియ యుక్తంబైన – యవకాశముగనెంచి
సరగున రామల – క్ష్మణులఁజంపి

గీ॥ భద్రకాళికి బలిఁజేసి – పంక్తిముఖుని ।
చెంగటికివేగఁ బోయితాఁ – జేసినట్టి
కార్యమును దెల్పితీఱెసి – కష్టమింక ।
తప్పెగండంబసుచు నమ్మఁ – జెప్పెనంట

ఆ దురాత్ముఁ డిపు డిప్పురంబున లేనేలేఁడు. నీ విచ్చోట నుండి వెడలి పోవువరకును రాఁడని యొంచెను గాఁబోలు. అచట లంకలో, రావణుని యొద్దనే యున్నాఁడఁట. ఈ వృత్తాంతమును, కలదు గదా విభీషణి భార్య—సరమ—యామె చాటుననుండి వినుచుండి, మిక్కిలి దుఃఖముతో రహస్యముగా భర్తయొద్దకు వచ్చి చెప్పి, యన్యులకు దెలియక మరలిపోయెను. ఈ దుఃఖవార్తను విభీషణుండు మా కందఱకుం దెలిపి, శోకించుచున్నాఁడు. సుగ్రీవాంగద జాంబవంత ప్రముఖులైన వనచర సత్తము లందఱును తలలు మోదు

కొని మొగముల చేతు లిడుకొని రోదనముఁ గావించుచున్నారు. ఇంకేమి గలదు? అందఱమును నగాధంబగు విప త్సముద్రములో మునింగి పోయితిమి. ఎవరివలన మనము ధన్యులము కాగలమని నమ్మియుంటిమో, యట్టి పుణ్యాత్ములను, దశరథ రాజ నందనులను గోలు పోయినారము. ఆ సుగుణాకరులు మోసపు తెఱంగునఁ జంపఁ బడిరి. దుశ్శీలుఁడు. పాపబుద్ధి — ఆ రాక్షసాధముఁడు — మాయ కాఁడు—మైరావణుండు—తన పంతమును పట్టువీడక చెల్లించుకొనెను. రేపటిదినము రాఘవేశ్వరుండు దశాస్యుని వధింపఁగలడనియు, సీతా మహాదేవి కష్టము తొలంగి పతితోఁ జేరగలదనియు మన మెల్లర మును పరమానందమును పొందగలమనియు, నువ్విళ్ళూరుచుంటిమి గదా? తుద కిపుడేమైనది. ఎట్లు పరిణమించెనో చూడుము. దైవ సంకల్పము వేఱువిధముగా నుండగా తలంచిన కార్యము తలంచిన లాగున సమకూరునా? అయ్యో! యిక మనకేమి గతి గలుగునో తెలిసినది కాదు.

నిన్ను ముట్టడించిన రక్కస మూఁకలతో పోరాడుచు సంగర క్రియా నిమగ్నుండవై యున్నందున, మైరావణ ఖలుం డొనరించిన దుష్కృత్యము నీవు తెలిసికొన లేనైతివి. తాను చేయుపని కాటంకము గలుగకుండుటకే వాఁడు. సమరమును గలిగించెను. నిన్ను మోసగించెను. అపు డచటి విభీషణాకృతిఁ దాల్చి వచ్చి యేమ రించి భానుకులులం దెచ్చెను. ఇపు డీవిధంబున పన్ను గడనొనర్చి నీకు దెలియకుండులాగు నింతటి పాపకార్యమును నిర్దయుఁడై కావించినాఁడు. ఇచ్చట నుండినచో నొకవేళ తన యక్రమ క్రియ నెఱింగినంతట నీవలన నాపద యేదైనం గలుగవచ్చునని కాఁబోలు లంకా పురమునకుఁ బోయి పంక్తి కంఠునియొద్ద గూర్చుండి యున్నాఁడు. ఆహా! ఎంతపని జరిగెను. విపరీతకాల మిప్విధమున నేర్పడెను. సుగ్రీవాదులు తమ దుఃఖము నెట్లో నుంత యడంచుకొని మమ్ముఁ బిలిచి "మీ రిరువురునుం బోయి హనుమంతునిఁ దోడ్కొనిరండు. జరిగిన వృత్తాంతము దెలియక, యతఁ డచ్చోట వ్యర్థముగా నల యుచుండును. ఏమి ప్రయోజనము గలుగును, కావలసి యాప త్కార్యము కానేయైనది. లాభములేని పనికై కష్ట మొంద నేమి

టికి ? శీఘ్రముగాఁ బోయి వెంట బెట్టుకొని రావలసినది'' అని యాజ్ఞాపించిరి.

అంతలో జాంబవంతుఁడు. ''ఓహో ! వీరికి కామ రూప ధారణ శక్తి లేదే! ఎట్లు పోఁగలరు? ఆంజనేయున కాసామర్థ్యము గలదు. కావున నతఁడు బోవ గలిగెను. వీరికి శక్యమగునా ? దీని కుపాయ మెయ్యది? ఆలోచింపుఁడు. పోవలనసి మార్గమన్నో నూఱ్ఱన్నతంబులగు పలు తెఱంగుల యాకృతులుదాల్చి పోవలసి యున్నది. విభీషణుం డాంజనేయునకుఁ దెలుపుచుండఁగా వింటిమి గదా ? ఆటువంటి కష్టమార్గములో వీరు పోవనేర్తురా ?''—అనెను సుగ్రీవుఁ డామాటలువిని ''ఔను! జాంబవంతుని పలుకులు నిక్క ములే! అయిన నయ్యనిల నందనుకు వృత్తాంత మెవ్వరును బోకుం డిన నెట్లు తెలియును? తెలియదే! అతఁడు సూర్యోదయ సమయ మునకు గదా? వచ్చునట్లు చెప్పిపోయెను? రాకుండునా ? ఇంతలో వీరల నేల బంపవలయునని యెంచి యూరకుండుట సరిగాదు. రామ లక్ష్మణులకు గలిగిన యాపద దెలియమిచే, వారినిఁ గానక యా మాయకాఁ డెచ్చటనో దాచియుండునని యెంచి యొకవేళ వెద కుచు రాక తడవుచేసినను చేయవచ్చును. అంజనేయుఁడు వచ్చిననే కాని యింకమీఁదట మనము చేయవలసిన విధానమును గూర్చి యోచించి నిశ్చయించుటకు వలనుగాదు. కావున పోయియతని బిలు చుకొని వచ్చుటయే మంచిది. కాని జాంబవంతుఁడు చెప్పినది తలంపఁగా గొప్ప యాటంకముగాఁ దోఁచుచున్నది. దీనికిఁ దగిన యుపాయ మేమిగలదు ?'' అని నిరాశా మానుండై బలికెను. అపుడు సుషేణుండు వానరేశ్వరునితో నిట్లనియె.

''సుగ్రీవా! దీనికై చింతింపవలదు. ఒక ఋషివలన పడసిన యోషధి యొకటి నాయొద్ద నున్నది యెపుడును దానిని నాదగ్గఱ దాచుకొనియే యుండుదు. దాని ప్రభావ మేమనఁగా, ఎవనియొద్ద నది యుండువాఁడు యెచ్చోటికిఁ బోవఁ దలంచునో, యచ్చటికి క్షణములోఁ జేర్చును. ఒకడు దగ్గఱ బెట్టుకొనిన చాలును వాని చేయి బట్టుకొనినయెడల వానిని సయితమా యోషధి గలవానితో వాఁడు పోవు చోటునకుఁ జేర్చును. ఇచ్చెదను కొనిపోయి మరల

వచ్చినంతట దానిని విచ్చివేయుఁడు. "ఇదిగో! అది" అని భద్రముగా దాచి పెట్టుకొనియున్న వేఱొకదానినిచ్చెను. అందఱును సంతోషించిరి. దాని మహిమచే రెప్పపాటులో మేమిచ్చోటికిఁ జేరితిమి. మాకు నే యాటంకములును గలుగలేదు. ఆ యద్భుతపు వేఱు. ఇదిగో చూడుము. దీని శక్తిచే క్షణములో సుగ్రీవాదుల దగ్గఱకు బోవచ్చు" నని పలికి యొక వేఱును చూపిరి.

వారు చెప్పిన వృత్తాంతమును వినఁగానే హనుమంతునకు మితిలేని యాశ్చర్యమును, మహా దుఃఖమును పొడమెను. రామలక్షణులు వధింపఁబడి రను వాక్యము చెవులలో శూలములు గ్రుచ్చినట్లు తోఁచినది. ప్రపంచము క్రుంగి పోయినట్లుండెను. అతఁడు "హా! హా! రఘుకులవీరులు చంపఁబడినారా? అయ్యయో! ఇఁక నేమిగతి గలదు? ఆ క్రూరకర్ముఁడు యుద్ధము చేయునట్లు నొకొక యాటంకము గలిగించి నేను యీ సమర క్రియా నిమగ్నుఁడనై యుండగా గూఢ యవకాశముంజూచి యిట్టి ఘోర కార్యము నొనరించెను కాఁబోలు. అకటా వాని కపట ప్రయత్నమును తెలిసికొనలేనైతినే, మోసపోయినాఁడనే, పుణ్యపురుషులను వధించిన యా దుష్టచిత్తుఁ డిపు డిచ్చోటనుండిన వాని ప్రాణములు దీసియుందును. వాఁడు లంకలో రావణుని చెంత నున్నవాఁడని చెప్పితిరి. ఇప్పటికి వానిచావు తప్పినవి.

నేను యిచటికి వచ్చినపుడే భద్రకాళిగుడికిఁ బోయి ప్రార్థించి, రామలక్ష్మణుల కపాయము గలుగకుండులాగునఁ జేయఁగోరినాఁడను ఆ దేవి పొడచూపి, వారికెట్టి యాపదయును సంభవింపకుండునట్లుచేసి రక్షించెదనని వరమొసంగెను. ఆరక్కసుఁ డింతటి యకృత్యము నొనరించుచుండగా, యా దేవి యెట్లు సమ్మతించియుండెను. నాకామె యొసంగినవరము మాట యేమి? ఔరా! తామసాహారిణిగదా? మహాశక్తిగదా? అందువలన మాట నిజములేదుగాఁబోలు. దేవతలు సయితమ నమృతము బలుకఁగడంగిన, నితరులను గుఱించి చెప్ప నేటికి? బళీ! ఎంత కార్యము జరిగెను? ఇన్ని ప్రయాసలుపొంది నేను వచ్చియుం బ్రయోజనము లేకనేపోయినది." ఇంక నీయధమ రాక్షసులతో పోరాటమేమిటికి? కాళికాలయమున కరిగి, పరాశక్తి

యయ్యును, తానొసంగిన వరమును కల్లఁజేసినదెట్లో తెలికొనిపోవు దము రండు ''—అని వారినిఁ దోడ్కొని, దుర్గాలయమున కేగెను.

సన్నిధి కరిగి చూడఁగనే కుత్తుకలు ద్రెంచఁబడిన దశరథ పుత్రుల కళేబరములు తలలు వేఱుగను, మొండెములు వేఱుగను నచటఁ బడియుండుటయు నాస్థలంబంతయు నెత్తురుచేఁ దడిసి ఘోర ముగా నుండుటయు నతనికిఁ గనుపట్టెను. మైందద్వివిదు లారాజ సుతుల దేహములంగాంచి రొమ్ములు బాదుకొనుచు, ''అయ్యయ్యో! సుగుణాకరులారా! దయాకరులారా! దీనరక్షకులారా! మీకయిటు వంటి దుర్మరణము సంభవించినదిగాదా? మేము దిక్కులేనివార మైతిమిగదా?'' యని వాపోయిరి. ఆంజనేయుం డన్ననో, తను దాను తెలిసికొనలే నంతటి విస్మృతితోఁగూడిన శోకమునుఁబొంది ''ఓమహానుభావులారా! దీనమందారులారా! ఆశ్రితవత్సలులారా! మహాశూరులారా! మీశౌర్య పరాక్రమము లెందుబోయినవి? ఈ పాపచిత్తుని చేఁజిక్కి వధింపఁబడినదెట్లు? విపరీతకాలమగుటచే మీ సత్వము భ్రంశగిపోయెనా? ఈరక్కసునిచేఁ జావవలసినట్లు విధి నిర్ణ యముగాఁబోలు. క్రూరదానవుల నెందరెందఱనో పొరిగొని రాక్ష సాంతకు లనెడి పేరులు నొందిన, మీరు యీయధముని. మాయ కానిఁ జంపలేక వానిచేఁ జిక్కి చచ్చినరీతిఁ దలంపఁగా వింతగాఁ దోఁచుచున్నది. మిమ్ము గొనిపోవుటకై నానాప్రయాసలును పొంది వచ్చితిని. నాప్రయత్నమంతయును వమ్మైపోయినది, ఇంక మాకు రక్షకు లెవ్వరున్నారు? ఓరామచంద్రా! నీపదములే నాలో నాధా రముగ నమ్మియుంటినే! ఇటువంటి దుస్థితి యేర్పడినది. ఏమిచేయు దును?'' అని గోడుగోడున రోదనముఁ గావించెను.

రామభక్తిపరుఁడైన యతని దుఃఖమును గని, మైందద్వివిదులు ''వాయునందనా! ఇట్లు శోకించుటచే కాలహరణము దక్క మఱి లాభమేమైనంగలుగునా? వానరేశ్వరుని యాజ్ఞను మీఱి మనము వర్తింపకూడదు. ఆలస్యమగుచున్నది మనరాకకై యతండు పరీక్షించుచుండును. రమ్ము పోవుద'' మని వేగిరింపఁ దొడంగిరి. అప్పు డంజనీసుతుఁడు, భద్రకాళి కభిముఖుండై చేతులు మోడ్చి యిట్లనియె,

## ద్విపద.

ఓసుగుణాకరీ !-యోజగదంబ। యోసుర మునివంద్య-యోపుణ్యచరిత
యోకాళికాదేవి - యోపరాశక్తి। "కాకుత్స్థకులులకే - కష్టంబుఁగలుగ
నీయకగాచెద - నే"ననిభీతి। బాయగ వరమిచ్చి - పలికిన వలుకు
వమ్ముగా నివ్విధివారు నీయెదుట। నమ్మహాఖలుఁడై-త్యాధముఁడదయుఁ
డై జంపుచుండఁగా-నట్టిగన్గొనుచు। నేజాడనోర్చినీ-వెట్లుంటివమ్మ
తల్లి యిట్లైనచో-దైవమెక్కడిది?। చెల్లెడిపట్టు కేది-చెల్లని దేది ?
వేల్పుల నుడువులే-విపరీతమైన। యల్పులకేడ సౌ-ఖ్యంబుచేకూరు ?

అని దుఃఖానిల మానసుండై పలుకుచున్న తరి, భద్రకాళి దిగ్గన నతనికి బొడసూపి యిట్లనియె "ఆంజనేయా వెరవకుము. మున్నుగా నీవెంట వచ్చినవారిం జంపుము. వీరు వానరులుగారు. యిట్టిరూపములు దాల్చి నిన్ను మోసగింపవచ్చిన మాయకాండ్రగు రక్కసులు సుమీ ! సంశయింపక యీదుష్టులను వధించినం గాని నీకు మేలు గలుగదు. పిమ్మట సర్వవిషయములును నీకెఱింగించెద. రామలక్ష్మణులును, దోర్దండియు నేయడరునులేక సుఖముగానున్నారు." అనెను. ఇట్లు జరుగునని తలంచి యుండని వారగు హనుమంతుని వెంట వచ్చియున్న యయ్యిరువురును, జాజ్వల్యమానంబైన యాపరాశక్తి స్వరూపమును జూచి, యామె పలికిన మాటలు విని విస్మయించి భయభ్రాంతినొంది "ఓహో ! గుట్టుబయలుపడినది. నిమిషమైన నింక నిచట నిలువరాదు. తడవుఁజేసినచో కీడు మూడుట నిక్కము. అయ్యో! చచ్చితిమి చచ్చితి"మని యొకని నొకఁడు చేయిఁబట్టిలాగికొని, గుడిలోనుండి వెలువడి పాఱిపోవుటకు యత్నించిన కాళివారితలంపునెఱింగి "వాతాత్మజా ! పట్టుకొనుము. పట్టుకొనుము. విడిచితి వేని కీడు గలుగును. వధింపుము, వధింపుము" అని తొందఱ పెట్టెను. వారు తన సహచరులగు మైందద్వివిదులు గారని రక్కసులనియు జండిక చెప్పినంతట హనుమంతుఁడు తటాలున వారలను వాలముతో చుట్టిపట్టి గిరగిరఁద్రిప్పి యా గుడిలోననే బలముగా నేలఁవేసి కొట్టెను. ఆయిరువురును, ముక్కులలోనను నోళ్ళయందును పెల్లుగా నెత్తురు గారుచుండ, ముందున్న వానరరూపములు విడిచి, భయంకర రాక్షసాకృతులతో గిజగిజ దన్నుకొని

ప్రాణములు విడిచిరి. అదిచూచి యారక్కసులొనరించిన టక్కును దెలిసికొని నంతట హనుమంతునికిఁ గలిగిన యచ్చెరువునకు మితియే లేదయ్యెను. ఆహా! ఎంత మోసము మెంత మోసము?

భద్రకాళి మైరావణుండు చేసిన టక్కుల నాంజనేయున కెఱింగించుట.

అవ్విధమున మైందద్వివిదాకృతులతో మోసగింప వచ్చిన నిశాచరులను, హనుమంతుఁడు చంపి నంతట భద్రకాళి యతనితో నిట్లనియె "మర్కటవీరోత్తమా! మైరావణ! నియతులైన రాక్షసులతో నీవు పోరాడుచుండఁగా, దుర్మతి యగునతండు. చావును దప్పించి, ఇక్ష్వాకువంశ శేఖరులను నీవు తోడ్కొనిపోవుదు వేమో ననియు, సమరముఁ జేయుచున్నపుడే నీకుఁ దెలియకుండునట్లు వారిని జంపవలయుననియు నెంచి, యిచ్చోట నుండి రామసౌమిత్రులం దన యొద్దకుం దెచ్చుటకై యిరువురు మాయరక్కసులం బనిచె. నేను వాని దురాలోచన నెఱింగి, రాజసుతులను, దోర్దండిని వారికిఁ గనుపడకుండునట్లు చేసితిని, కొనిపోవ వచ్చిన యిరువురును నంతటను వెదకిరి. కాని కనుఁగొనలేక మరలిపోయి తద్వృత్తాంతమును జెప్పిరి. వాఁడు మిక్కిలి యాశ్చర్యమొంది, దోర్దండి సయితము కానరాకుండుటచే సంశయమొంది' ఒకవేళ నామెను లోబరచుకొని రఘువీరుల నామె సహాయముతో నెచ్చటనైనను నీవు దాచియుండుదువేమో యని యెంచి, మొదటఁ బనిచిద యా దనుజులనే మరల నంతటను వెదకుటకై పనిచియున్నాఁడు. వారు పురంబులో నెల్లచోట్లలోనను, సందుగొందులందును వెదకుచు తిరుగుచున్నారు.

కపట వర్తనుఁ డమ్మైరావణుం డంతటితో నూరకుండక, ఇచ్చోట నుండి నిన్ను వెడలిపోవునట్లు చేసి, నీవు పోయినంతట రఘువీరులను వెదకి కనుఁగొని వధింపవలయునని దురాలోచనఁ గావించి, మోసగించి యిప్పురములోనుండి కొనిపోవుటకుగా నీయొద్ద కియ్యిరువురను బంపెను. వీరు సామాన్యులు గారు. మయ శంబరులం బోలు మాయకాండ్రు. నమ్మించి గొనిపోవుటకు గావారు వానర రూపములతో వచ్చి చేసిన తంత్రమును చెప్పిన మాటలును నీకు తెలియును గదా? యీ దుష్టులు, నీవు నిరాశనొంది వెడలి పోఁగలవని యెంచి, రామలక్ష్మణులు వధింపఁబడినట్లు నీకు కనబడు భంగి

నిచ్చోట మాయఁ గావించిరి. నేను చెప్పకున్న యెడల నిదియంతయును నిజమనియే యెంచి వెడలిపోయియే యుందువు. హనుమంతా! రామలక్ష్మణులును, వోర్దండియును క్షేమముగా యున్నారు. వారె చూడుము" అని చూపి చెప్పి, వెండియు నిట్లనియె.

"వనచరోత్తమా! ప్రొద్దు చాలలేదు. నీవు చేయవలసిన పని చాలయున్నది. నాలవయామము ప్రారంభమై యొక గడియ గడచినది. మైరావణుని వధింపకుండినచో, దశరథసుతులను గొని పోవుటకు నీకు శక్యముకాదు వీరి కెట్టికీడును గలుగనీయక నేను రక్షించుచుందును. నీవు శీఘ్రముగా, కార్యమును నెరవేర్పుము" అని యాదేశించెను. ఆ శుగాత్మజుం డాదేవికింగల కరుణాతిశయంబున కెంతయు సంతుష్టినొంది మ్రొక్కి యానుజ్ఞంగొని తోరణస్తంభము నొద్దకుఁ బోవుటయు మైరావణునిచేఁ బంపబడిన మేటి రక్కసులు సైన్యసహితులై వచ్చి ముట్టడించి తాఁకిరి. కపికులోత్తముఁడా బలంబులపై నడరి పరిఘాయుధంబుఁ గొని విజృంభించి, మిత్తియా క్రమించిన తెఱంగున నొక్కొక వ్రేటునకు పదులు, నూరులుగా సైనికులు చచ్చి నేలఁ బడుచుండ మర్దించుటయు, భయంకర రూపుడై కనుపట్టుచున్న యతని నెదిర్చి నిలువలేక, రాక్షస భటులు "కుయ్యో! మొఱ్ఱో" యని యార్త నాదములు సేయుచు, "ప్రాణములు దక్కినఁ జాలును. దేవుఁడా!" యని భీతిల్లి చెల్లాచెదరై పరుగెత్తి పోయిరి. చావఁగా మిగిలిన యల్పదళం బవ్విధంబున పరుగుటయు, నాయకులుగా వచ్చినవారు వారిని మరల్పంజూచిరి. కాని, యాభటులు తమ నాయకుల పలుకులు చెవులనిడక, మేలును గంపింపఁగా మరలి వైపుం జూడక పోయి పురంబులోఁ జొచ్చిరి, నాయకులు చేయునది లేక తామే వచ్చి హనుమంతు నెదిర్చి, తమ తమ పట్టిన యాయుధంబులతో నొక్కసారిగాఁ గదిసి నొప్పించుటయు, నత్యంతమైన కోపావేశముతో కపివీరుఁడు గదిసి, నొక్కొకనింగా దేహంబుల రక్తధారలు గారునట్లు ప్రహరించి గతజీవులను గావించె.

ఈ వృత్తాంతము మైరావణునకుఁ దెలిసినది. అతఁడు తాను చేసిన సర్వ ప్రయత్నములును, మాయాకృత్యములును, నిష్ఫలము

లగుటయు రామలక్ష్మణులును, తన చెల్లెలును, కనంబడరై రని వెదక బనిచిన వారలువచ్చి పలుకుటయుం దలపోసి, మిక్కిలి రోషమును బొంది, "ఎవ్విధముననైనను, పంక్తి రథాత్మజులను జంపవలయును గాని, విడువరా"దనెడి దృఢ నిశ్చయము గలవాఁడై, మొదట హను మంతుని సంహరింపకుండిన, ప్రయత్నము నెరవేరదనుట తనలో యోచించి "ఇంక నన్యులను బనుచుటవలన ప్రయోజనము లే"దనియు, "బలవంతుఁడైన యమ్మర్కట వీరుని నొరులు జంపలే"రని యును, "తత్కార్యమునకుఁ దానే కడంగవలయు"ననియు నాలోచన గావించి, త్వరితముగా సమర సన్నాహముఁ జేయుటకై మంత్రుల కాజ్ఞాపించి, వడివడిగా తానును యుద్ధమునకు వెడలుటకుం దగిన విధంబున సన్నద్ధుండయ్యె. అంతలో బంగారు తేరును గొనివచ్చి సారథి ద్వారమున నిలిపెను

## మైరావణుండు యుద్ధమునకు వెడలుట.

పూర్వోక్త ప్రకారంబుగ, పాతాళలంకా వల్లభుండు, మహా సమర్థుండనఁ బేరొందిన యాంజనేయునితోఁ బోరుట కలఁతి బల్మం బులతోఁ బోవుట యుక్తము కామిండలంచి, ప్రబలదళంబులతో సువర్ణ రథంబు నెక్కి సమరమునకు వెడలెను. అపు డతని యాజ్ఞాబ ద్ధులై సువర్ణరోమ, కరాళ, జీమూతవర్ణ, వర్తులాక్ష, గజపాద, మార్జాలముఖ, వజ్రనఖ, శూర్పకర్ణ, ప్రముఖులైన మంత్రులును, క్రూర, తామ్రకేశ, వికార, రక్తాక్ష, తాళజంఘ, త్రిబాహు, దుర్ధమ, కంకనాస, ప్రముఖులైన సేనాపతులును, దురిత, రక్తదంత, కుత్సిత, వ్యాఘ్రదేహ, శృంగశిర, అయశ్శరీర, ఘోషణ, కర్కశ, ప్రముఖులైన భటనాయకులును, సింగములును, పులులును, పందు లును, గాడిదదులు, నేనుంగులును, గుఱ్ఱములును, నెద్దులును, కొరవ గండ్లును, నెలుగుబంట్లును, నొంటెయలును, మఱియుం బెక్కుజాతుల మృగంబులను వాహనంబులుగాఁ గొని, ముసల, ముద్గర, భిండి వాల, తోమర, పరశు, పట్టస, గదా, ఖడ్గ, చక్ర, శక్తి, శూల, పరిఘాది బహువిధాయుధంబులు ధరించి, రక్తగంధమాల్యాం బరాద్యలంకారము లెసంగ వీరాలాపంబు లెసంగ, భేరీ, మృదంగ, కాహళ, శంక, తమ్మట, ఢక్కా, ప్రభృతివాద్యరవంబులు మిన్ను

ముట్టుచుండగా, గర్జనలును, నార్పులును, నట్టహాసంబులును, కేకలును, పెడబొబ్బలును, కిలారింపులును, నతిశయింపగా మహాసేనలతోఁగూడి నడువఁ దొడంగిరి. పాతాళలోకమంతయును, సైన్య, వాహన, పాదఘట్టనలచే, గ్రక్కదలుచుండె.

ఒంటరివాఁడైన వాతాత్మజునిఁ జంపుటకు మైరావణుండంతటి మహాప్రయత్న మొనరింపవలసి వచ్చినది. అతని సామర్థ్యంబును, బలపరాక్రమమును రావణాసురుండు చెప్పగాఁ వినియుండుటయకాక, తాను నిగ్రహార్థముగాఁ బనిచిన మహాబలశాలులను పెక్కండ్రు వీరులను, లెక్కింపరానిరాక్షసదళంబులను సంహరించిన వాఁడగుటచే నతని నెదిరించు విషయమున నల్ప ప్రయత్నముఁ జేయరాదనియెంచి, దైత్యనాథుం డవ్విధమున ప్రబల సన్నాహముఁ జేసి మహాడాడంబరమున బయలు దేరెను.

సరభసంబున నెత్తెఱుగునంబోయి, హనుమంతుఁడున్న తోరణస్తంభమునకు నలుదెసలను మూఁగి నిలిచిన యసురసమూహంబును జూచి, ఆడంబరమువలన వచ్చినవాఁడు మైరావణుం డగుటఁ దెలిసికొని యుగ్రుండై, యాంజనేయుండు దళంబులను మార్కొనుటయు, నతనికిని. యాపాల దిండితండంబులకు పోరాటంబు మిక్కుటంబయ్యె, ఉత్సాహంబును, గర్వంబును, పరాక్రమంబును, బలమును నతిశయింపగా దైత్యసైనికులు వెఱచి వెనుకంజవేయక కదిసి, జగత్ప్రాణాత్మజునిపై క్రూరబాణచయంబును బ్రయోగించియు. కరవాలంబులంగొని వ్రేసియు, నీటెలతోఁ బొడిచియు, శూలంబులతోఁ గ్రుచ్చియు, గదలతో మోదియు, ముసలంబులతోఁ గొట్టియు, పశువులతో చీలనేసియు, మఱియుం గల వివిధాయుధంబుల నుపయోగించుచు, నెటుజూచినను తామయై యలంపఁ దొడంగిరి.

మదించిన యేనుంగుపై ముసరిన యినుశ్ళతండము తెఱంగున తనమీఁదఁ గవిసిన యారక్కసులం జూచి, రుద్రాంశమున జన్మించిన యనిలజుడు కాలరుద్రునివలె నత్యుగ్రాకారంబుతో వారిలోఁ జొచ్చి వారణంబు తామరకొలనుఁ గలంచినరీతిదోఁప సైన్యములను ఛిన్నాభిన్నములుగాఁ గలంచి తనచేఁగల పరిఘాయుధముతో వ్రేసి ఛీకాకుపఱచుటయు, తలలు పగిలి పడువారును, నంగంబులు దునిసి

కూలువారును, రొమ్ములుబగిలి యొఱఁగువారును, యెమ్ములు పొడి యై వ్రాలువారును, నై నేలఁగూలి త్రుటిలో లక్షలకొలఁది రక్క సులు మడిసిరి.

ఆ పాటుంగాంచి, ప్రఖ్యాతిఁజెందిన ముఖ్యులగు నిశాట భటులు కోపావేశంబున నెదిరించి, పండ్లు గొఱుకుచు, పెదవులు గఱచు కొనుచు, నాలుకలు జాపుచు, గ్రుడ్లు ద్రిప్పుచు, నోళ్లు దెరచుచు, నార్చుచు, చంపుఁడు, నొంపుఁడు, పట్టుఁడు, కొట్టుఁడు, డాయుఁడు, వ్రేయుఁ''డని బెదరించుచు పోరాడఁ దొడంగిరి. వాది యాట లాంజనేయుని ముందు సాగునా? అతఁడా దనుజులంగని వెడ నవ్వు నవ్వుచు ''ఓరి! దేబెలారా! రాక్షసాధములారా! బ్రతుకఁ దలం చినచో, పాఱిపొండు. పోనియెడల మీలో నొకనినైన విడువను. అందఱను నంతకుని పురంబునకుఁ జేర్చెద. పోరఁదలంచిన యెడల మీకు రాజుగానుండెడి దురాత్ముని—మాయా ప్రవర్తకుని—ఆక్రూ రుఁడైన మైరావణుని వచ్చి పోరాడునట్లు చేయుఁడు. అయ్యో! పాపము. దుష్టుండగు వాని మాటలువిని వానికొఱకు మీ రేల చావ వలయును? నన్ను జయించుటకు మీకు శక్యముగాదు'' అని గొం తెత్తి యందఱకును వినునట్లు బలికెను.

మొనగాండ్రగు నాయకులు తమ సేనయంతయును వానరునిచేఁ జంపఁబడి ఛిన్నాభిన్నమగుటయు, కొందఱు నిలువలేక భయమొంది, పరుగెత్తి పోవుటయుంగని రోషం బతిశయింపగా, వెనుకటి బలంబు లఁజేపిచి పిలిచి తాము మునుకొని హనుమంతునిం దాకి ''ఓరీ! దుష్టవానరా! నీకింతటి గర్వమా! నీకండలు చెండెద'' మనియును, ''బికారికోతీ! నీకు చావు మూడినది మా బారింబడితివి. ఇదె నిన్ను బట్టుకొని మ్రింగెద'' మనియును. ''వనౌక సాధమా! వెఱపులేక కొందఱు దుర్బలులంజంపి, పట్టవచ్చినఁ జిక్కక నగరంబుఁ గాల్చితివని వింటిమి. అటుల జేసి పాఱిపోవుట కిది యా లంకా పురముగాదు. నీచేఁ జచ్చిన యల్పులవంటి వారము మేముగాము. ఇది మహా వీరుండగు పాతాళ లంకేశ్వరుని పట్టణమనియు, మేము మృత్యువునైనను సరకు సేయని మహా వీరులమనియు దెలిసికొను మనియును. ''ఇంకఁ గొన్ని నిమిషములే నీకు జీవితము కొఱంత

యున్నది. చావు నిశ్చయము. తల్లిదండ్రులను, స్నేహితులనుం దలంచుకొని మరణమునకు సంసిద్ధుండ వగు''మనియు పలు తెఱంగుల వీరాలాపంబు లాడుచు, బెదరించుచు, నదలించుచుం జేరవచ్చి, తమ తమ పట్టియున్న యాయుధంబులచే నొప్పించుటయు, ఘన బలుండైన మర్కటోత్తముండు ప్రళయకాల ఘనా ఘనంబువలె గర్జించి వారి నెదిరించి.

చ॥ బలిమిని నేలమీఁద నిడి - పాదయుగంబున రాచి దేహముల్
నలియఁగ మోది రక్త పలలంబులు వెల్వడ గోళ్లఁ జీల్చి వె
మ్ములు పొడిగాఁగఁ గొట్టి శిర - ముల్ శకలంబులుగా బగిల్చి యు
గ్గలమగు కోపమొప్పలయ - కాలుఁడువోలె భయంకరాకృతిన్.

ఉ॥ కొందఱ ముష్టిఘాతములఁ - గూల్చియుఁ గొందఱఁ దన్ని జంపియున్
కొందఱ మధ్యముల్ విఱిచి - కొందఱ గట్టిగఁ బట్టి వీచియుం
గొందఱ కంఠముల్ దునిసి - కుంభినిపైఁ బడ నేసి ధీరుఁడై
చిందఱ వందఱై యడఁగఁ - జేసెను దైత్యబలంబున త్తతిన్.

క॥ అరదముతో నరదంబును। కరితోఁడం గరియుఘోట-కముతో బలిమిం
దురగముఁ బదాతితోన॥ చ్చెరువుగను బదాతి నేసి-సేనల నడఁచెన్

హనుమంతుఁడు సేనాపతులం జంపుట.

ఇవ్విధంబున బలంబుల హతంబుగావించి యా నాయకులను రూపు మాపుటయు, నైనమండుగురు సేనాపతు లొక్కసారిగా నడచి పోరాటమునకుఁ గడంగిరి. కపివీరుండు వారలంగని లేశమైనను చలింపక, వీరావేశంబుతో వారిని నూర్కొని "అధములారా! మీ రేల వచ్చితిరి? నాచేఁ జచ్చుటకా? వాఁడెక్కడ? మీదొర—ఐరావణుఁడు—వాఁడేఁడీ? వానిఁ దోడ్కొనిరండు"—అని పలుకుచు, నొక్కొకనిం దప్పక, పిడుగు దాకిన చందమున తలలపై నొక్కొక పోటుఁ బిడికిటం బొడిచెను.

అట్టి వారలా పోటులు దాకి నిలువలేక మూర్ఛిల్లి వాహనములపై నుండి క్రింద బడిరి. అపు డాంజనేయు డావాహనములం జంపెను. అంతలో వారు మూర్ఛదేరి లేచి, తమ వాహనములు చంపఁబడి యుండుటం గాంచి మహా దాగ్రహముతో "బళీ! ఇంత

పోగరా? నీవా మమ్ము జయింపగలవాఁడవు? వనచరా! ఇంకఁ జచ్చితివి. ఇదిగో! ఈమా వ్రేటుపోటులను దప్పించుకొని బ్రతుకుము నీ సామర్థ్యమును జూచెద'' మని కడు బెట్టిదంబుగాఁ బలుకుచు నొకఁడు గదతోఁ గొట్టెను. ఒకఁడు పట్టసముతోఁ బ్రేసెను. ఒకఁడు బల్లెతో బొడిచె. నొకఁడు శూలమును గ్రుచ్చె. నొకఁడు శక్తిని వైచె. నొకఁడు చక్రమును ద్రిప్పికొట్టె. నొకఁడు ముసలముతో మోఁదె. నొకఁడు పరశువు నుపయోగించె. ఇటుల నొక్కొకఁడును నొక్కొక యాయుధమును గొని యేకకాలమున చుట్టి నిలిచి నొప్పించిన, నమ్మహాబలుండగు మహాబలాత్మజుండు కోపంబున మొగంబు జేగురింప వారి గండడంప నేతెంచిన దండధరుండో యన విజృంభించి, ఎవఁ డెవఁ డేయే యాయుధముచేఁ దన్ను నొప్పించెనో, వాని వానిచేతి యాయా సాధనము నొడిసికొని, దానిదాని చేతనే వరుసగా నందఱను జంపి, సింహనాదం బొనరించె. ఆవిధం బంతయుం జూచుచుండిన మైరావణునియొక్క మంత్రులైన మంద్రుఁడు, నధికాగ్రహ చిత్తులై, యసంఖ్య దైత్య బలంబుతో వచ్చి చుట్టి తాఁకిరి.

## వాయునందనుండు మైరావణుని మంత్రులను బొరిగొనుట.

అష్ట మంత్రులును, నసుర సేనయు నేక కాలమునందు గవిసి శరవర్షమును గురిసియు, క్రూర తరాయుధములచే నలంచియు చేయాడనీయకున్న మదించిన యేనుంగుపై నీగలు ముసిరిన చందమునఁ గనుపట్టుచు తనపైఁ గదిసి తమ శక్తిని గనపఱచుచున్న బికారి రక్కసులను లెక్కసేయక హనుమంతుఁ డొక్కింత తడవు చలింపక యట్టె నిలిచి, వారి బింకమును గనుచుండి, యంతట కాలహరణము జేయరాదని యెంచి, పరాక్రమించి, యటఁ బడియున్న పరిఘ నొకదానిం గొని, కృషీవలుఁడు కళ్ళములో రాగి కంకుల నెండఁబోసి, గింజలు రాలుటకై బడితెంగొని మోదిన చందమున, రాక్షస బలంబులఁ గొట్టుచుండ, నొక్కొక వ్రేటునకును, దనుజ భటులు కుప్పలు కుప్పలుగాఁ గూలుచుండిరి. తొడలును, బాహువులును, నడుములును విఱిగినవారును, తలలు వ్రక్కలైనవారును, నెమ్ములు చూర్ణమైనవారును, కండ లూడినవారునునై సైనికులు మెటుగాంచినను

ప్రోవులు ప్రోవులుగా బడియుండుటయు నెత్తురు వెల్లువగా బాఱుటయు, జూపరుల కా సమర స్థలంబు భయావహంబై గనుపట్టుచుండె.

సైన్యంబు దైన్యమంది కూలి క్రుంగుచుండిన, తత్సమయంబున మంత్రు లయ్యంజనీతనయుని, బలమును, ధైర్యమును, సామర్థ్యమును, శౌర్యమునుంగాంచి. యాశ్చర్యముతో నొకరితో నొకరు. "ఔరా! ఈ వానరుఁడు సామాన్యుఁనఁడఁ దగిన వాఁడుకాఁడు. బల పరాక్రమంబులచే మించిన మేటి వీరుండు. వీనిని సులభముగా జయించుటకు శక్యముగాదు. అసాధ్యుడుగాఁ గనుపట్టుచున్నాఁడు. ఇంతటి శక్తి గల్గవాఁడగుట చేతనే నిర్భయముగా నొక్కరుండు వేలుపులు సయితము చొరరాని లంకలోఁ జొచ్చి, యశోకవనమును ధ్వంసముఁజేసి, రావణపుత్రాదులైన పలువురు మహావీరులను, మితియిడరాని సైన్యమును మడియించి పురంబునుగాల్చి యగ్నిహోత్రున కాహుతిజేసి యేబాధయును బొందక సముద్రము దాటిపోయెను. ఈపనులు సామాన్యుఁ డొనరింపఁగలవగునా? రూపమున వానరమాత్రుఁడేగాని, వీడు నిజముగ కోతియని యెంచకూడదు. మహాతపస్సంపన్నుండని తోఁచుచున్నది. కాదేని యిందఱు పరాక్రమవంతులగు వీరులను, కోట్లసంఖ్యలఁగల సేనలను నొక్కరుండు సంహరించుటయు, తానేసంకటమును జెందకుండుటయు నెట్లు ఈయొక్కని ప్రభావమే యిట్లున్నది. ఇంకను రామచంద్రునియొద్ద నెంతెంత వేసి వారు గలరో గదా? ఇట్టి వంటివారితో, మనదైత్యేశ్వరుండు వృథావిరోధముఁ దెచ్చుకొనెను. తుదకిది యెవ్విధమునఁ బరిణమింపఁ గలదో యూహింపరాకున్నది. ఏమైనను, ప్రాణములకుఁ దెగించివచ్చితిమి. శక్తియున్నంతవరకును నిమర్కటునితోఁ బోరి, వీనిచేఁ జచ్చుటయో, లేక వీనిం జంపుటయో మనకీరెంట నొకటిదక్క వేఱువిధంబున నాలోచనఁజేయుటకిదియదనుగాదు" అని గలియఁబలుకుకొని పోరాటమున కారంభించిరి.

అసమాన శూరాగ్రేసరుండా హనుమంతుఁ వారిని, వారి సైన్యమును జూచి భయమొందునట్టివాఁడా? నేలఁబడియున్న యినుపరోకలి నొకదానిం గొని, మత్తకరి తామరకొలనులోదిగి కలంచి,

ఛిన్నాభిన్నముగఁ జేసిన విధంబున, నసురదళంబులోఁ జొచ్చి, ముస లంబుతో మోదుచు, నంగంబు లేర్పడకుండునట్లు, కాళ్లు, చేతులు, దేహములు, నెముకలు, తలలును, నలిగిపడుభంగిఁ దనసామర్థ్యంబుఁ జూపి, కూల్పసాగెను. కార్చిచ్చులోఁబడిన మిడుతలలాగున, నతని యెదుటం దోఁచు రక్కసుల గుంపులు నిముషములో రూపు మాసి పోయెను.

ఆరీతిం గాంచి, బుద్ధిమంతులగు నమ్మంత్రు లాంజనేయునితోఁ బోరాడి జయించుటకు తరము గాదనుటం దెలిసికొనినవారలయ్యును తమ ప్రభుని యాజ్ఞానుబద్ధులగుటం జేసి, యతనికొరకుగా సమర మొనర్చి యసువులను విడువ వలసినది తప్ప తమకు వేఱుమార్గము లేదనుటను నిర్ధారణఁ గావించుకొని యొక్కపెట్ట భయంకరముగాన నిలఁబని దాకిరి. అపుడు వారికిని యవ్వీరునకును మహాఘోరయుద్ధము జరుగఁదొడంగెను. మంత్రు లతనిమీఁద నెడతెఱపి లేక బాణవర్షమును గురియించి కప్పిరి. పెనుగొండపైఁ గురియుచిత్త జల్లువలె గనుపట్టుచున్న యయ్యసురులుపరగించు శరపరంపరల కాంజ నేయుండు చలింపక వాలంబును బెంచి, చక్రాకారంబుగ, గిరగిరం ద్రిప్పుచు, దట్టమగు తచ్ఛర నికరంబులు మేనదాకకుండు నట్లుగ నెగరఁగొట్టుచు, పిడికిటం బొడిచియు, గ్రుద్దియు, తన్నియు, క్రిందఁ బడఁద్రోసియు, మోదియు, నీడ్చియు, వాఁడిగోరులతో నొడళ్ళఁ జీల్చి యు, గఱచియు పెక్కుతెఱంగుల సొక్కించిన, యానిశాచరయోధులు, పడియు, మూర్ఛిల్లియు, నొచ్చియు, నలసియు, తొలంగక, రొజుచు, రొప్పుచు, నరచుచు, కొండలపైనుండి సెలయేరులు దిగఁబారువిధం బుగా, ఘనోన్నతములైన తమ మేనులనుండి నెత్తురుధారలు గాఱు చుండఁగా, నత్యుగ్రముగా నగచరోత్తము నెదిరించి, నానావిధంబులు గొని, వెనుకంజ వేయక, పెనంగసాగిరి.

ఆ యుద్ధము త్రిపురాసురులకును, పినాకపాణికినిజరిగిన సంగర ప్రకారము ననుకరించుచుండెను. ప్రొద్దు మిక్కిలిలేదు. మైరావ ణుండు చావలేదు. సూర్యోదయ మగుటకు మున్నుగ సుగ్రీవా దులయొద్దకు రఘుపుంగవులం గొనిపోవలసియున్నది. రాక్షసమంత్రు లన్ననో, కిరిదివియక పోరుచున్నారు. యీ విషయ మంతయును

హనుమంతుఁడు తనలోఁ దలంచి, "? యాలస్య మమృతం విష" మ్మనెడి యార్యోక్తి నెంచి దిగ్గన గుట్టలుగుట్టలుగాఁ బడియున్న యా యుధములలోని యొక గదను బుచ్చుకొని తారుకొని, దేవేంద్రుండు వజ్రాయుధముతో పర్వతములను బడగొట్టినరీతిని తనబలము కొలందిని, యొక్కొక్కని నొక్కొక్క వ్రేటుచేఁ బడవేసె.

మహోగ్రంబైన యావ్రేటులకు నిలువలేక మైరావణుని నిరుపమాన బలోపేతులగు మంత్రు లెనమండుగురును, తలలుఁబగిలియు దేహములు నలిగియు నేలఁగూలి తన్నుకొని ప్రాణములు విడిచిరి. సురాసురు లొక్కసారిగా వచ్చి తాకినను సరకుగొనక నెదిరించి జయింపగల సామర్థ్యవంతులైన మంత్రు లొక్కసారిగా నటుల మృతులగుటం జూచి, పాతాళ లంకేశుండు మిక్కిలి చింతాక్రాంతుఁడై, కోపంబును రోషంబును నధికరించుటయుఁ దనలో "ఓహో! కడపట నివ్విధమున నాయేర్పడినది ? సరి! ఇంక నుపేక్షించియుండ కూడదు. మొదట యీమర్కటునిఁ బొరిగొని, యంతట మదీయ సఖుండగు దశాననునకు పరమ శత్రువులుగానుండు పంక్తిరథపుత్రులను జంపి, నాపంతమును నెరవేర్చుకొని ధన్యుఁడ నయ్యెద" నని దృఢముగా నిశ్చయముఁ గావించుకొని, సైన్యసహితుఁడై ముందునకు సాగివచ్చి, హనుమంతునిపై బలంబులను గవియించిన, మరున్నందనుండు వచ్చినవాఁడు మైరావణుండని తెలిసికొని, మిడుతల దండువలె ముంచు ముందుగ, నెడమును తెలపియు లేక మూగిన రక్కసుల మూకంగని "తొలుత నీ గుంపులను నిర్మూలించినంగాని, దురాత్ముని, మైరావణుని వధించుటకు వలనుగాదు. కావున నిప్పుదాతి సందోహంబును రూపుమాపెదను గాక" యని తనలో నిశ్చయము గావించి, యా సైన్యములోఁజొచ్చి కలంపఁదొడంగె.

హనుమంతుఁడు మైరావణుని సేనలను నాశముఁ జేయుట.

కొందఱును నేలఁద్రోసి కాలరాచియుఁ, గొందఱను వాలమునుజుట్టి త్రిప్పి భూమితోఁ గొట్టియు, కొందఱను పిడికిటఁ బొడిచియుఁ, కొందఱను గ్రుద్దియుఁ గొందఱను మోచేతులతోడను, మోకాళ్ళతోడనుం బొడిచియుఁ, గొంతఱను తన్నియుఁ, గొందఱను మింటికెగరనైచి క్రిందఁబడినవియు నట్లు జేసియుఁ, గొందఱను

ముసలముతో మోదియుఁ, గొందఱనువాడిగోళ్ళతో మేనులుజీల్చియుఁ, గొందఱను తలలు బగిల్చి, నంగంబులు విఱిచియు, విక్రమవిహారం బొనరించిన, మెదడు లడుసు మట్టిగను, నెముకలపొడి యిసుము గను, ముఖంబులు కమలంబుగను, ప్రేవులు తామరతూండ్లుగను, తునిగిపడిన యంగములు జలజంతువులుగను, నాయుధంబులు తరంగ ములుగను, వస్త్రంబులునుగు తెట్టెలుగను, రక్తంబు జలంబుగను నెంచఁదగి యపు డచ్చోట నెత్తురుటేరు ప్రవహించె. ఆ ప్రదేశం బపుడు మిక్కిలి భయంకరమును, నాశ్చర్య కరమునునై కనుపట్టె. ప్రాణములు పోక తన్నుకొనువారును, నంగములు దునిగి లేవజాలక యల్లాడువారును, నఱచుచు నెటుల బోపుటకును దోఁచక నలుగె లంకల్లకును పరువులు బాఱువారును, తిరిగిచూచి చేతులెత్తి మ్రొ క్కుచు పాఱిపోవువారును, భీతిల్లి యాయుధంబులు బడవైచి రోద నంబుఁ జేయుచు, నేదియుం దోఁచక నిలుచువారునునై పదాతులు నానావిధంబుల గనుపట్టుచుండ, తత్సైన్యము ఛిన్నాభిన్నమై యల్ల కల్లోలమై, యా ప్రదేశంబు దరిద్రుని మందిరంబువలె సర్వ శూన్యంబును పాడుపడిన యింటివలె రహిత శోభాకరంబును, విధ వాంగనా ముఖంబువలె తేజోవిలాస విహీనంబును, మూఢుని చిత్తం బువలె నంధకార మయంబును, క్రూర వర్తనుని కార్యంబువలె భయంకరమునునై యొప్పుచుండె.

ఆ రీతియంతయును మైరావణుండు చూచి యచ్చెరువు నొంది "వానరుఁడు కడు గడుసువాఁడు. వీని నెదిరించిన ప్రఖ్యాతి జెంది నవాఁరగు దైత్య వీరులనెల్లను నితండు పొరిగొనియె. వ్యర్థముగా వారిని వీరినిం బంపినచో రాక్షసవర్గమును జంపుకొనుట కన్నను, నేనే యెదిరించి యీ దుష్ట మర్కటునిఁ బొలియించుట యుక్తము" — అని తలంచెను, కాని, "యెక్కండయ్యా, తానే యాపదయును నొందకు శాత్రవ భయంకరుల నత్యంత బలవంతుల నసుర నాయ కులను, మితిమీఱ శక్యముగాని సేనలను, పొలియించిన, యద్భుత శక్తి శంపన్నుండైన వీనితో సమర మొనరించిన జయము గలు గునా ? కలుగదా ?" యనెడి యాలోచన యతనికి గలుగనేలేదు. ఆలోచనయందున, బుద్ధి కుశలతయందును, యుక్తాయుక్త వివేచనా శక్తియందును, మైరావణుండు మిక్కిలి "యధికుఁ" డనియే చెప్పవల

యును. అంతటి తెలివి తేటఁ గలిగియుండెడి వాఁడైనను, నప్పటిలో నతని వివేకము నిరర్థకమైనది. బుద్ధి మంచిదారిని బట్టినదియే కాదు. అంత్యకాలము సమీపించి నందున నేమోకాని, మతి మందగించినది. వాని మానసము వానిని చెడుమార్గమునకే లాగుచుండెను.

హనుమంతుని బల పరాక్రమములు మైరావణుం డెఱుంగని వాఁడా? వాని వర్తనము తెలిసి బావిలోఁ బడిన వాని చందమున నేర్పడినది. విధి యొక వంకకు లాగుచుండఁగా, తప్పించుకొని వ్యతిరిక్తముగా తా నొకవంకకుఁ బోవలయుననినచో నెవనికి సాధ్యమగును. పాపఫలము కట్టి కుడువక తీరునా? ఏకార్యము నెవఁడు చేయునో, దానివలనఁ గలుగు సుఖ దుఃఖముల నాచేసినవాఁ డనుభవింపక తప్పదు. ఇది యార్యోక్తి. ఇపుడా పాతాళ లంకేశ్వరునకు దుష్కాలము. కనుక దుర్బుద్ధులు బుట్టినవి. "తన మిత్రునకు చేసిన వాగ్దానమును నెరవేర్చుటకై దశరథ కుమారులను జంపవలయునే కాని విడువరా"దనియు, "వారలను తన బారినుండి తప్పించికొని పోవుటకొఱకు వచ్చిన యమ్మర్కట యూథముఖ్యునిఁ ముందుగ జంపిననేగాని, నిజోద్దేశ కృత్యమును నెరవేర్చుటకు వలనుగాదగుటచే, తొలుత హనుమంతుని మడియింప వలయు"ననియు నిర్ధారణఁ గావించి, సేనలను పిఱుందను డ నియమించి, రథంబు నాంజనేయుని గదియ దోలులాగున సారధి కాజ్ఞాపించె.

## ఆంజనేయ మైరావణుల యుద్ధము.

వానినిఁ జూడఁగనే, హనుమంతున కత్యంతమైన యాగ్రహమును కార్యోత్సాహంబును నతిశయించినవి. అట్టె వాని పైఁబడి యుసురు వెడలింప వలయుననెడి యుద్రేకముతో పండ్లు గొరుకుచుండె. మైరావణుండు దాపునకుఁ జేరి "ఓరీ! అధమవనచరా! వివేకములేని పందా! ఎవఁడోనని తలంచితి. నీవా వచ్చినవాఁడవు? హనుమంతుడనెడి యోగుమర్కటుడవు నీవేఁగదా? ఇచటికేల వచ్చినాడవు ఎటులరానేర్చితివి? ఇదిమున్ను నీవుకాల్చిపోయిన యాలంకా పట్టణ"మనియు, "నపుడు నిన్ను మడియింపక విడిచి చేతులు బిసుకుకొనుచుఁ గూర్చుండి యుండిన యా దశవదనుని వంటివాఁడనే, నేనును నగుదు"ననియు నలంతిగాఁ దలంచి వచ్చితివి కాఁబోలు,

నీయాట లిచ్చోట సాగునవి కావు "ఇది, సురాసురా భేద్యమైన పాతాళ లంకా నగరం"బనియు నేను బ్రహ్మ రుద్ర మాధవేంద్రాదులకును గెలువరాని, బల పరాక్రమంబులుగల మహా వీరుండ" ననియు నెఱుంగవు కాఁబోలు. ఇపుడైనం దెలిసికొని, పరుగెత్తి పోయి ప్రాణములు దక్కించుకొని మనుము. "కోతిని జంపినచో పాపముగలుగు" నందురు. కాఁబట్టి నిన్ను విడిచెదను. పాపము! వ్యర్థముగాఁ జావనేమిటికి? శీఘ్రముగా నిప్పురంబు విడిచిపొమ్ము. నా పలుకులు నీకు సమ్మతమై యుండనిచో, నిను నిమిషములోఁ జంపి నీ మేనికండలు గృధ్రవాయసముల కాహార మొనరించెద" నని కడు బెట్టిదంబుగను, గర్వ యుక్తంబుగను, నలక్ష్యంబుగను బలికెను.



ఆంజనేయ మైరావణ ద్వంద్వ యుద్ధము.

వాని నుడువులు హనుమంతుఁడు విని కిలకిలార్భటిఁ గావించి వికటముగా నవ్వి "ఏమిరా! వదరెదవు? పాపాత్మకా! సంగరమునకై వచ్చినవాఁడవా పనికిఁ గడంగక, వెఱ్ఱిమొఱ్ఱి కూతలు గూసెదవేల? నన్ను బెనరించినచో వెఱచి నేను పాఱిపోఁగల నని యెంచితివా? ఇసీ! రాక్షసాధమా! నీకొఱకే, నిన్ను జంపుటకే వచ్చినవాఁడగు నేను తలంచిన పనిని నెరవేర్పక పోవుదునా? మహా శూరునివలెను, వీరునివలెను, బీరంబులు బలుకుచున్నావు. నీ ప్రతాపమెట్టిదియో, సామర్థ్య మెట్టిదియో చూచెదను. వృథా మాటలాడక నాముందు నిలుపుము. తొలంగకుము. నీ గర్వము నడంచి యమపురంబునకుఁ జేర్చి నేను శీఘ్రముగాఁ బోవలయును. తడవు చేయనేల? దుర్మతీ? ఏ వ్యసనమును లేక స్వస్థ చిత్తుఁడవై, సౌఖ్యము లనుభవింపుచు కుడిచి కూర్చుండి యుండనొల్లక, మహాపరాధియు దుష్టుండును, ఖలచిత్తుఁడును నగు దుశ్శీలునకు—దనుజాధమునకు—దశముఖునకు—సహాయముఁ జేయుటకుఁ బూని, పరమ పుణ్యులను, లోకవంద్యులను, దయామూర్తులను, రామ సౌమిత్రుల జంప నమ్ము నెల్లరను నేమరించి యిటకుఁ దెచ్చితివి. ఏమి తెలిసికొనఁ జాలకుండుదుమా? వారినిఁ గొని వచ్చినంత ననే నీయత్నము కొనసాగునని యెంచితివా? రావణుని [illegible] వాఁడవైనట్లు సంతసించితివా? నన్ను మోసగించినవు సంచు నాకుఁ దోఁచి యుండనేని యపుడే నీ యుసురు [illegible]కి యుఁడుదును. ఇంకనుం గొన్ని గడియ లాయువు కొఱంత దున తప్పించుకొని వచ్చితివి. కాల మిపుడు తీఱినది. [illegible] బ్రతుకు దుర్లభము. తెలిసికొని చావునకు సిద్ధమగుము. మదోన్మత్తుఁడవగు నీచుఁడా! రామలక్ష్మణులు నీకేమైన నపకృతిఁ గావించిరా? నీకును వారికి నేమేనియు వైరముగలదా? సుగుణ నిధుల వారినిఁ జంపెదనని నీవు కంకణము గట్టుకొన నేమిటికి? ఆ కష్టవర్తనుఁడు—ధర్మదూరుఁడు—సర్వ లోకనింద్యుఁడు—మదోన్మత్తుఁడు—[illegible]పంక్తి గ్రీవుఁడు పుణ్యా పాపములును, యుక్తా యుక్తములును [illegible]రాతరంబులును నెంచక, భవ్యచరిత్రయు, సద్గుణపుంజమును, పతివ్రతా శిరోమణియునైన జనక రాజనందనను, సీతాదేవిని, మారీచుఁడు చేసిన మోసముచే పతి యామెను నివాసమున విడిచిపోయి

నప్పుడు. యేకాకిగా యుండినప్పుడు, మాయవేషముతోఁ బోయి చెఱఁగొని వచ్చి రామచంద్రునకు మహాపకార మొనరించె. అటువంటి దురాత్ముని శిక్షింపక, రఘుకులేశ్వరుం డూరక విడుచునా? విడువ వచ్చునా? వాని గర్వం బడంపఁ బూనుట ధర్మముగాదా? ఇందు కౌసల్యాపుత్రున తప్పిద మేమిగలదు? వాఁడుచేసిన కార్య మక్రమ మగుట నెఱింగి మతిమంతుఁడగు విభీషణుండు, "జానకిని రామభద్రునకు సమర్పించియమ్మహాత్ముని శరణుఁజొచ్చి బ్రతుకు"మని యనేక విధముల హితోక్తులు బలికిన విననొల్లక యతనిందన్ని వెడలనడఁచె.

వివేకి యగుటచే యా గుణాధనుండు మీఁద రాగల యాపదను దెలిసికొని, యగ్రజుండనెడి గౌరవమును సయితము తలంపక యతని విడిచి వచ్చి, శరణాగత వత్సలుండైన రాఘవేశ్వరు నాశ్రయించె. ఈ వృత్తాంతమును నీవు తెలిసికొనియుండియు, క్రమాక్రమంబుల నాలోచింపక, అయోగ్యుండును, దుష్టవర్తనుండును నగు రావణునకు సహాయముఁ జేయువాఁడవై, దేవసముల దాశరథులం [illegible]ంచి, దొంగ వేషముతో వచ్చి, యట మమ్మునందఱను [illegible]వారల నిచ్చోటికిఁ దెచ్చితివి. ఇందు నీయాధిక్యత యేమి [illegible]వును రావణునివంటి వాఁడవే యైతివి. వాని జీవిత [illegible]చియుండునది కాదో, యాలాగుననే నీకును నంత్యకా[illegible]. ఇంత తడవు నీరాకకుగానే నిరీక్షించుచు నీచేఁబంపఁ [illegible]క్కడి రాక్షస మూకలను జంపుచుంటిని. నాకోరిక నెరవచ్చితివి. ఇంకఁ జచ్చినవాఁడవేగాని బ్రతికిపోఁజాలవు" పలికెను.

ఆమాటలు వినుట వలన మైరావణుని కోపం బధికరించెను దండతాడితక్రూర సర్పంబువలెను శ్వసించుచు, హనుమంతుని ముఖంబునను, రొమ్మునను, భుజంబులందును, ననేకములువాడి బాణములను నాటనేసి సింహనాదముఁ గావించె. హనుమంతుఁడు చలింపక, తనచేతనే పట్టుకొనియున్నగదాయుధముతో మింటికెగసి, వాని పాలిటి ధూమకేతువోయన, గుభాలున వాల మల్లార్చుచు దుమికె. భారమైన యప్పాద ఘట్టనముచే, దృఢమును, రమణీయము నగు నిశాచర నాథుని తేరునలిగి చూరమయెం. [illegible]

టకు తడవులేమిచే, విరథుండైన మైరావణుండు గదా హస్తుండై తలపడియె. అపుడా రణవీరుల పోరాటము సంక్రందన వృత్రాసురుల యుద్ధమునను కరించె. ఇరువురునుం జలింపకయుం బిరుదివియకయు భయంకరముగా పరస్పర జయాభిలాష యతిశయింపఁ బెనంగఁ దొడంగిరి.

ఉ. అప్పుడు మాయరావణుఁడ - హంకృతిమీరఁగ నార్చిమింటికిం
గుప్పున నుద్గమించి కపి - కుంజరుపైఁ బెనురాలవానఁదా
దెప్పరమేర్పడం గురిసి - దృష్టిగోచరుఁడై జరింప, యీా
చొప్పు నెఱింగి గంధవహ - సూనుఁడు తానును నుగ్రమూర్తియై.

ఆ-వె॥ అంబరమున కెగసి-యసురునిఁదాకిన । నచట నిరువురకును-నధికమైన-పోరు జరిగెనపుడు-మైరావణుఁడు డస్సి । దిగియె పుడమికపుడు-దివమునుండి.

కథాసరణి-డోరా,

విడువక వాయుకుమారుఁడు తానును - వెనువెంటనె డిగ్గి
యడరి బలంబు కొలందిని గదచే - నట్టె మోదుటయును
నాత్రేటు పయిం దగులకుండు న - ట్లతఁడు తొలఁగినిలిచి
తీవ్రంబగు నొక జ్వాలాశక్తిని - దిగ్గనపై నేసె
మండుచు నది యత్యుగ్రంబుగ హను - మంతుని మైదాకి
బెండువోలె నిస్సారంబై చెడి - పృథివిమీఁదఁబడియె.

మృత్యుతుల్యంబగు తన యుగ్రశక్తి యటు వ్యర్థంబగుటం జూచి, మైరావణుం డచ్చెరువొంది ఖడ్గహస్తుండై దరియవచ్చి వ్రేయ నుంకించుటయు, చతురుం డయ్యాంజనేయుఁడు, వ్రేటుఁదప్పించుకొని రోషావేశంబుతో గదను త్రిప్పి, సూటిగా నసురవరుని వక్షంబు బగులనేసె. ఆదెబ్బ కోర్వలేక యతండు దిగ్గన సొమ్మసిల్లి నేలఁ బడి యంతలో తెలివినొంది, మదించిన కొదమ సింగంబు కరణి భీకరంబుగా గ్రుడ్లు ద్రిప్పుచు వాయుపుత్రుని రొమ్మును జెట్టిదంబుగా పిడికిటఁ బొడిచెను.

మైరావణుండు మాయ చిచ్చును హనుమంతునిఁ గవియఁ జేయుట.

ఆంజనేయుం డించుకసోలి, మరల పురికొని, యధికమైన క్రోధముతో గదను ద్రిప్పి బలము కొలందిని వ్రేసెను. అసురవరుండు తప్పించుకొని, యట్టహాస మొనరించి "ఓరి! పందా! నిన్ను క్షణకాలములో భస్మముఁ జేసెద. నాప్రజ్ఞఁ జూడు" మని పలికి, మహాపావక మనెడి విద్యచే భయంకరమగు మంటను గల్పించి "మర్కటుఁడా! దీనివలన బాడిదవగుము"—అని హనుమంతిని గవియించె. మిన్నంట నాలుకలు జాచుచు, నత్యుగ్రమైన యాపెను మంట కపివీరుని చుట్టును వ్యాపించి మీఁదికి వచ్చుచున్న. యనిలజుం డెటు దొలంగుటకును వలనుగానక, తనలో శ్రీరామనామమును స్మరించి భద్రకాళింగూర్చి యిట్లని స్తుతింపఁ దొడంగె.

సీ॥ జగదీశ్వరీ! కాళి - నిగమస్వరూపిణీ!
యనల కీలలను జ - ల్లార్పవమ్మ!
భవ్యగుణాకరీ! - భక్త కల్పవల్లి!
యనల కీలలను జ - ల్లార్పవమ్మ!
విశ్వసంరక్షణీ! - విబుధౌఘ వందిత!
యనల కీలలను జ - ల్లార్పవమ్మ!
కష్ట విదారణీ! - దుష్టసంహారిణీ!
యనల కీలలను జ - ల్లార్పవమ్మ!

గీ॥ మంగళప్రద కరుణాంతర - రంగ కాళి!
యనల కీలలవేగఁ జల్లార్పవమ్మ!
శంకరార్ధాంగి రత్నభూ - షణి శుభాంగి!
యనల కీలలవేగఁ జ - ల్లార్పవమ్మ!

ఇట్లు సంస్తుతించుటయు. నమ్మహాజ్వాల లడంగి, యగ్నిమాయ యయ్యె. భద్రకాళి కృపచే మంటలు నశించుట మైరావణునకు దెలియదయ్యె. తనచేఁ గల్పింపఁబడిన చిచ్చు నిమిషములో జల్లారి పుటం గాంచి యతం డచ్చెరువొంది, వెల్లబాటుగదుర "నాంజనేయుండ సమాన ప్రభావ సంపన్నుం" డని యెంచి, యెవ్విధమున నైయు వంచించి యతనిం జంపవలయునని తనలో నిశ్చయించుకొనియె.

అంతలో హనుమంతుండు గదియుటయు నిరువురకును మరల ముష్టియుద్ధము సంఘటిల్లినది. ఒకరినొకరు పొడుచుచు, నడఁచుచు, గొట్టుచు, నెట్టుచు, త్రోయుచు, పాయుచు, రోజుచు, రొప్పుచు, నార్చుచు, పేర్చుచు, నిట్లు జయాభిలాషులై, మదించిన యాబోతు లవలెను, నేనుంగులవలెను, సింగపు కొదమలవలెను సర్పంబులవలెను, బోరఁదొడంగిరి. ఆంజనేయుం డత్తరిని విజృంభించి క్రిందఁ బడవైచి యున్న గదను గైకొని యొడలు నలియునట్లు పెల్లుగా వ్రేయుటయు, నసురవరుం డొల్లబోయి నేలఁబడి దిగ్గనలేచి మూర్కొనిన వెండియు నగచర వీరుండు వానిని బలిమి కొలంది నుగ్రంముగా మోదెను. ఆ వ్రేటులకు వాఁడు చచ్చినట్లు భూమిమీఁదఁ బడెను. హనుమం తుం డయ్యసురనాథుండు మృతినొందెనని సంతసించెను గాని యదినిజ ము గాకపోయినది. ఏమి జరిగెను. మైరావణుండు తటాలున లేచెను. కాని యంతట నతఁ డదృశ్యుండయ్యె. ఆ యద్భుతప్రకా రంబును దలంచి "వీనినిఁ జంపెడి రీతియెట్లు?" అని యనిలాత్మజుం డాలోచనా నిమగ్నుండయ్యె.

మైరావణుండు మాయఁగావించి హనుమంతు నలంచుట.

మఱి నిమిషకాలములో, రాక్షస దళంబుగాని, యా పాతాళ లంకా మహా నగరంబుగాని యాంజనేయునకుఁ గనుపడలేదు మాయ మయ్యెను అతఁడు తానొక విశాలమగు బయలులో నుండినట్లు తోఁచినది. ఇంక నెట్లు? దృష్టి గోచరము గాకపోయినంతట నెం తటి సమర్థుఁడైనను నేమి చేయఁగలఁడు? హనుమంతునకు కర్తవ్యము తోఁచినది కాదు. "అయ్యో! కాలహరణ మగుచున్నదే! పాపా త్ముఁడైన యీ మాయకానిని మైరావణుని వధించుట మిక్కిలి కష్ట ముగ గనుపట్టుచున్నదే! ఏమి చేయుదును? నేను వచ్చినపని నెరవేర్ప గల మార్గమెయ్యది!"—అని తనలో చింతా నిమగ్నుండై యుపా యంబు నాలోచింపఁ దొడంగె.

ఇవ్విధంబున నతండు చింతించుచుండు నంతలో, తళుక్కని యొక మెఱపు మెఱసి యంతలో యాబయలుబోయి, యదియొక భయంకరమగు మహారణ్యముగా నేర్పడినది. గర్జించుచు, కాండ్రిం చుచు, నరచుచు, నుగ్రసింగంబులును, బెబ్బులులును, నెలుగుబం

ట్లును నిత్యాది దుష్టమృగంబులు పెల్లుగా చెలరేగి గుంపులై హను మంతునిఁ జంపుటకు సమీపించిరా నారంభించినవి. విషజ్వాలలు గ్రక్కుచు బుసలుకొట్టుచు, క్రూరసర్పములు తండ తండములుగా నలువంకలం గవియ వచ్చుచుండె. ఎంతగుండె నిబ్బరము గనివాని కైనను వెఱపుఁ గలిగించునట్టి యాకారడవిలోఁ జిక్కువడి యంజ నీసుతుఁడు తన మనంబున "ఆహా! ఇది యెంతయు నద్భుతావ హమై జూపట్టెడిని. ఎన్నియో రాక్షస మాయలం గనియున్నాఁ డను ఎందఱనో మోసగాండ్ర నసురులను జంపియున్నాను. కాని, యిటువంటి యాశ్చర్యకరమును, నసాధ్యమును నగురీతినిగన్నదిగాని, వినినదిగాని లేదు. ఈ సంకటములను దప్పించుకొని మైరావణునింజూపి, రఘువీరులం గొనిపోవలసియున్నది. సూర్యోదయమగుట కొలదికా లము మాత్రమే యున్నది. వీనియెడల నాశక్తి యిసుమంత నుప యోగించునని తోఁచలేదు. ఇంతవరకునుం బొసంగిన కష్టములు నివారించి నన్ను రక్షించిన జగన్మాత, యాభద్రకాళియే యీసం కటమును దొలంగించి కృతార్థునిఁ జేయవలయును. కానియొరులు గావనేరరు. ఆదేవి పాదపద్మములను స్మరించెదఁగాక" అని చిం తించి, భక్తి సంకలిత స్వాంతుండై యిట్లని స్తుతించె.

ద్విపద.

నిత్యమై సత్యమై-నిర్మలంబనుచు। ప్రత్యక్షదైవమై-పరఁగుమాతల్లి
నిరతంబు నద్భక్తి-నిన్నెంచువారి। కరమొప్ప రక్షించు-కరుణాంతరంగ
యఖిలంబునసీవ-యాధారమగుచు। సుఖమొందఁగాఁజేయు-సుగుణప్రధాన
సజ్జనతతికిక-ష్టంబులుమాన్చి। ముజ్జగంబులనేలు-ముక్తిపదాఖ్య
కడగిభండాసురు-గర్వంబడంచి। యుడివోని మహిమచే-నొప్పుభవాని
మైరావణుడుచేయు- మాయలు దొలఁచి। కూరిమి జయముఁ జే-కూర్పు
మీవేళ.

ఇవ్విధమున స్తోత్రముఁ జేయఁగానే, భద్రకాళియను గ్రహ ముచే, మైరావణుఁడుచేసిన మాయలన్నియుం దొలంగినవి. ఎప్పటి వలె నన్నియు గోచరించె. దైవంబెపుడును, ధర్మము ననుసరించి యేగదాయుండును? కావుననే న్యాయమైన కార్యమునకు బూనిన రామభక్తుఁడగు హనుమంతునియెడల కాళికాదేవి కంతటి యధిక

మైన యనుగ్రహము గలిగినది. అపుడా మహావీరుండు మునుకొని వచ్చుచున్న రక్షోసైన్యమును తుద ముట్టించి మైరావణుని పైకి లంఘించెను. అంతలో నతఁడు వేఱొకతేరు నాయిత్తముఁజేసికొని యెక్కి యాంజనేయునెదిర్చి శరనికరంబుచేఁ గప్పి యలంచిన, నతం డలిగి, గుప్పున నరదంబు మీఁదికెగిరి, దానిని నలియఁ ద్రొక్కి వానినిఁ గ్రిందికీడ్చి పడవైచి, యొడలు నలిగిపోవులాగున బిడిగిటం బొడిచిన యాపోటులచే నిలువరింపలేక, నెత్తురుగ్రక్కి యయ్యసుర నాయకుఁడు ప్రాణంబులు విడిచె.

" ఈ దురాత్ముండు మృతినొందెనుగదా ? " యని యంజనీ నందనుండు సంతసించి, యటు మరలు నంతలో, మైరావణుండు బ్రతికిలేచిగదఁ గొని యుగ్రుండై వచ్చి " ఓరీ! మర్కటుఁడా ! ఎచటి కరిగెదవు ? పాఱిపోయినచో విడుతునని తలంచితివా ? ఇసీ! నిలునిలు" మని బలముగా వ్రేసెను. చచ్చినవాఁరు బ్రతికివచ్చిన రీతిం గని వాయుపుత్రుఁ డాశ్చర్యమొంది తనలో "వీఁడు కడుప్రభావ సంప న్నుఁడుగా నున్నాఁడు. చేతులారఁజంపి, చచ్చెనుగదాయని సంతో షించితి. ఎట్లో బ్రతికివచ్చెను. చచ్చియుం బ్రతుకుచుండినచో, వీనినిఁ జంపుటెట్లు? ఇది యద్భుతముగాఁ దోఁచుచున్నది" అని తలంచుచు, వెండియు వానితో ఘోరముగాఁ బోరాడి హీన సత్త్వు నిఁజేసి విగత జీవునిఁ గావించె. కాని, రెండునిమిషములలో నతఁడు బ్రతికి తటాలున లేచి హనుమంతునిఁ దాకెను.

"ఔరా! ఇపుడేగదా చంపితిని ? ఇంతలో యనువులొంది, మరల సమరమునకుఁ గడంగె. వీనిని వధించుట కష్ట సాధ్యమగు పనిగాని సులభపు పనిగా నుండలేదు" అని తలంచి, యాంజనేయుండు మరల వానితో భయంకరముగా పోరొనర్చి నేలఁగూర్చె. మరి రెండు నిమిషములకు సజీవుఁడై యతండు యుద్ధమునకు సన్నద్ధుఁడయ్యె. ఈ క్రమంబున పోరాడి పోరాడి హనుమంతుఁడు వధించుటయు, నయ్యె సురుండు జీవించుటయు పెక్కుసారులు జరిగెను. వాయు నందనునకు విసుగుదోఁచినది. యతనిని గీటడంచుటకుఁ దగిన యుపాయము తోఁచదయ్యె "ఏమి చేయుదును? కాలహరణ మగుచున్నది. ఎన్నిసా రులు చంపినను, ఈ దురాత్ముఁడు బ్రతికి యెదిరించుచున్నాఁడు.

వీనినిఁ జంపిననేగాని రఘువీరులను గొనిపోవుటకు శక్యముగాదని కాళికాదేవి చెప్పియున్నది. వెరవు గనుపట్టలేదు " అని యాలోచన జేయుచు, ముసలాయుధ హస్తుఁడై యుగ్ర రోషావేశంబుతో తన మీఁదికి గదియవచ్చిన, నత్యాగ్రహంబున వానితోఁ బోరొనర్చి మిక్కిలి శ్రమతోఁ బడఁగూల్చి, వాఁడు బ్రతికి లేచుటకు మున్నుగ తటాలున కాళికాలయమునకుఁ బోయి నమస్కరించి చేతులు మోడ్చి నిలిచి యిట్లని స్తుతించె.

కథాసరణి – డోరా.

" ఆదిశక్తి కంకాళీచండీ – యంబా జగదంబా
ఖేదవినాశని యాశ్రితజన స – మ్మోద ప్రదదుర్గ
మహిషాసుర మర్దని చాముండీ – మాయాశర్వాణి
యహితభయంకరి నిత్యానంద శుభాంగీ కల్యాణి
శైలసుతాసుచరిత్ర పురాణీ – నీలవేణి కాళీ
జ్వాలాముఖి కామాక్షీ శివదా – తాాయణి ముక్తాఘు
దాసుఁడనగు నామొరవిని కృపతోఁ–దనరగమన్నించి
వేసంకటములడంచి కావుమీ – వేళ వేడినాఁడ.

జననీ! దుర్మార్గుఁడు మైరావణుం డెన్నిసారులు జంపినను మరల బ్రతికి లేచి సమరముఁ జేయుచున్నాఁడు. వాఁడు మృతి నొందిననే గాని, దశరథ నందనులను గొనిపోవుట శక్యముగాదని మొదటనే యాదేశించితివి. ఇపుడన్ననో, నా సామర్థ్య మంతయు నుపయోగించినను వానిని వధింపఁ జాలకున్నాఁడను. రాత్రియన్ననో కొలఁదిగా నున్నది. ప్రొద్దు బొడుచుటకు లోపలనే వచ్చునట్లు సుగ్రీవాదులతో గట్టిగాజెప్పితిని. యిచ్చట నాస్థితి యిట్లున్నది, పుణ్యస్వరూపులగు లక్ష్మణుల సంరక్షణకై శ్రద్ధవహించి యిప్పటివరకును గాచితివి. దుష్టుఁడైన మైరావణునిఁ బొరిగొని మహాత్ముల రఘుకుల వీరులనే యడరును లేక గొనిపోవఁ దగిన వెరవు నెఱింగించి నన్ను కృతార్థునిఁ జేయుము" అని బహువిధముల స్తుతించి వేడుకొనెను.

భద్రకాళి మైరావణ వధోపాయము హనుమంతునకు దెలుపుట.

భద్రకాళి యతనికిఁ బొడసూపి "ఓ వాయుకుమారా! మైరావణుండు బ్రహ్మచే వరముఁగొని తన ప్రాణములు తన యధీనములో

నుంచుకొని యున్నాఁడనుట మొదటనే నీతోఁ జెప్పియున్నాను వానిని చంపవలయుననిన మిక్కిలి కష్టపడ వలసియున్నది. తత్ప్రకారమును దెలిపెదను వినుము. ఇచ్చోట నుండిపోయి, యుదయ పర్వతమును దాటి యవ్వలి వైపునకు జేరినయెడల నాప్రదేశ మంధకార బంధురంబై యుండును. అచట నాలుగు ప్రక్కలను నాలుగును నడుమ నొకటియునుగ నైదు కొండలున్నవి. వానికి ప్రాణ పర్వతములని పేరు. ఆ కొండలలో ప్రతి దానియందును నొక్కొక్క గుహ యున్నది. అవి భయంకరము లగుటచే వానిలో దేవతలు గూడ జొరనొల్లరు. తూర్పు కొండ మొదలుగా వానిలోని గుహలలో క్రమ ప్రకారంబుగ జొచ్చినయెడల ప్రతి దానియందును నొకయినుప యుట్టి వ్రేలుచుండును. ప్రతి యుట్టియందును నొక దృఢ కలశమును, వరుసగ బంగారు, వెండి, రాగి, యినుము, సీసములనెడి పంచలోహ కల్పితములైన నైదు బరిణలు నుండును. ఒక్కొక్క బరిణయందును నొక్కొక్క తుమ్మెద కదలుచుండును. అయిదు బరిణలలోని నైదు తుమ్మెదలునే, మైరావణుని పంచ ప్రాణములు. అచ్చోటికి కగి, యాగుహలు చొచ్చి క్రమంబుగ నైదు బరిణలను గొని యిచటికివచ్చి, మరల మైరావణుని నా గుడిముందుఁ జంపి, వాని కళేబరంబు మీఁద యా తుమ్మెదలను జంపి పడవైచి సత్వంబుగాఁ జని నాల్గు సముద్రములలోనను స్నానముజేసి యరుగుదెంచి వెండియు వాని మృత కళేబరమును జూచినయెడల యతని ప్రాణంబులు శరీరంబు విడిచిపోవును. మఱి జీవింపఁడు. ఇంత పని చేయవలసి యున్నది. మైరావణుని వెంటఁ గొని పోయిననే గాని, ఆకా కొండలుగాని, గుహలు నట్లును, బరిణలుగాని కనపట్టవు. అంధకారమును తొలంగదు. కాఁబట్టి యిపుడు వానిని, సత్వ హీనునిఁ జేసి వెంట గొనిపోయి, యా బరిణలందెచ్చి నేను చెప్పినట్లు జరింపుము. నీకు జయము గలుగును శీఘ్రముగ నరుగు"—మని యాదేశించె.

ఆంజనేయుం డాదేవికిమ్రొక్కి యనుజ్ఞఁగొని పోవునంతలో మైరావణుండు బ్రతికి లేచి, యమ్మారుతిఁ గానక యటు నిటుం జూచుచుండి యతండు వచ్చినతోడనే మిక్కిలి రోషముతో మెదిరించి పోరాడఁ గడంగెను. అంత కపివీరుండు వానితో ఘోర

మైరావణుండు బంధ విముక్తునిఁ జేయుమని వేడుట.

"ఓయి! సుగుణవంతా! హనుమంతా! నీవు బంధించుటచే నేను చాల కష్టపడుచున్నాను సహింపరాని బాధ పడుచున్నాను. నేను చేసినది గొప్ప యపరాధమని యిప్పటికి తోఁచినది. బుద్ధి వచ్చినది. మన్నింపుము. మన్నించి నన్ను విడిచిపెట్టుము. "పుణ్యస్వరూపులగు లఘువీరుల ప్రార్థించి నాతప్పులు క్షమింపు"ఁ డని ప్రార్థించి వారి కృపకు పాత్రుఁడనై, బ్రతుకఁ దలంచినాఁడను, ఆమహాత్ములు దయాహృదయు లగుటచే, శరణాగతుఁడనైన నన్ను మన్నింపఁగలరు. వారలను దోడ్కొని నీవు సుఖముగా బొమ్ము. నేనును మీవెంట వచ్చివారిని యథాస్థానంబునఁ జేర్చి. సుగ్రీవాదుల మన్ననకు పాత్రుఁడనై మరలి నాపురంబునకు వచ్చెదను. విభీషణుం డెట్లో యవ్విధమున నింక నేనును, రామచంద్రునకు భక్తుండనై కాలముఁ గడుప నెంచినాఁడను. అంతంతకును కష్ట మధికమగుచున్నది. కరుణించి విడువుము ఇరువురమును పురంబునకరిగి, తెల్లవారుటకు లోపలనే దాశరథులను వానరరాజ ముఖ్యులయొద్దకుఁ జేర్పుదము.

కటకటా! సహింపరాని సంకటము నొంది యలయుచున్న నామొరాలకించి, దీనుండనైన నాపై కనికరింపుము. దీనదశనొంది శరణని నంతట రక్షింపకుండుట నీవంటి యుత్తమునకు ధర్మమగునా? ఈయడరు తెలివిమాలినాకై నేనే తెచ్చుకొంటిని. ఇపు డివ్విధమున నల్లాడుటకు పాలైతిని. ఆపాపవర్తనుఁడగు దశకంఠుఁ డేమేమిరొమో చెప్పినందున వాని పలుకులువిని బేలుపోయి జ్ఞానహీనుఁడ నగుటచే, మంచి చెడుగు లెంచక, చేయరానట్టియు, సాధ్యముగా నట్టియు దుష్కార్యంబు నొనర్చుట గడఁగితి. ఇది క్షమింపరాని యపరాధమే యగును. అయినను, "శరణుఁజొచ్చి చేసిన తప్పును దెలిసికొని పశ్చాత్తాపమును బొంది వేడుకొనినంతట యెంతటి శత్రువునైనను రక్షించుట న్యాయమగు" నని యభిజ్ఞులు బలుకుదురు. నీకు తెలియని నీతిని నేను చెప్పగలవాఁడనుగాను. ఇదె, నీకు మ్రొక్కుచున్నాను. చూరాడక పోవుచుండెదవేల? నామొర నాలకింపుము. ఓరామచంద్రా! సుగుణసాంద్రా! విభవవిజితసురేంద్రా!

నీకు కీడుజేయ నెంచిన దుర్మతినైన నేను తత్ఫలము ననుభవించుచున్నాను. ఓస్వామీ! పాపశీలుండనైన యీపాపునికి నామీఁద కృపగలుగునట్లు చేయుము. అంజనీనందనా! హా! హా! చచ్చితిఁ జచ్చితి. ఓర్వఁజాలను. నీవాలపుచుట్లు నాదేహమున కప్పటికప్పటికిన్ని బిగియుచున్నవి. దయామానసా! నాయవస్థ నిటు చూడుము. బిగివినించుక సడలింపు" మని యల్లాడుచు మొరబెట్టుచుండెను.

కాళీదేవి యాదేశించిన వాక్యములచే దృఢసంకల్పుఁడై యున్న మారుతి వాని దీనవాక్యములను విని, ఇంచుకేనియు వాని యందు దయజూపలేదు. అతనిమాట లన్నియు టక్కులని యాంజనేయునకు స్పష్టముగా తెలిసియుండఁగా నతఁడేల మోసపోవును. ఎన్నివిధముల మొరబెట్టుచున్నను, ఎంతగా వాపోవుచున్నను, యాంజనేయుడు కనికరించుటగాని బదులుమాట పలుకుటగాని లేక మౌనముతో పోయి పోయి, ప్రాణపర్వతములం జేరి, భద్రకాళి మొదట చెప్పియున్న ప్రకారం తూర్పుప్రక్కకొండ యాదిగవరుసగ నాల్గువైపులం దుండు వానిలోనను కడపట నడిమికొండలోనను గుహలుచొచ్చి, యుసురు తుమ్మెద లుండెడి బరిణలనుగొని త్వరితముగ నటనుండి మరలెను.

అది యంతయుం జూడగానే మైరావణుం డింక తనకు చావు నిశ్చయించుకొని, భయభ్రాంతుఁడై యాంజనేయు వేడుకొనఁ దొడంగెను. అతఁడు మారుబలుకక పాతాళ లంకకు వచ్చి, కాళికాలయమున కెదుటనిలిచి మైరావణుని విడిచిన మహాబలశాలియు, శౌర్యవంతుఁడునై యుండియు నవసానకాలము వచ్చినందు నయ్యమరవైరినాథుండు సత్వహీనుండై ప్రాణభీతిచే పారిపోవుచున్న చూచి మరుత్సుతుడు పోవనీయక యతని నడ్డగించి పట్టుకొని, పిడికిటి పోటులచే విగతజీవునిఁ జేసి, తాను తెచ్చిన బరిణలం దెఱచి వానిలోని చిఱుతుమ్మెదలను నలిపి, యక్కళేబరంబుమీఁదబడవై శీఘ్రముగా చతుస్సముద్రములందును వరుసగా బోయి గ్రుంకివచ్చి మైరావణుని మృతదేహమును చూచెను. అప్పటివరకును చలనములేక పడియున్న యాకళేబర మావిధంబున నాంజనేయుండు సముద్రములలో స్నానము చేసి యరుగుదెంచి చూడఁగానే, యటునిటుఁ గదలి, గిజగిజ దన్ని

కొని, శైలగుహవలె నోరుదెరచి, లోకములు తల్లడిల్లులాగున మహా భయంకరముగా ముమ్మారు లరచెను. అంతట వాని ప్రాణములు

మైరావణుండు మృతినొందుట.

శరీరమును విడిచి వెడలిపోయినవి. ఆవృత్తాంతము దెలిసి వాని భార్యయగు మాతంగి మూర్ఛిల్లి నేలగూలి, పరిచారికల యుపచారములచే తెలివినొంది రోదనము జేయుచు భర్తదేహమునొద్ద కరుదెంచి, యాయొడలిపైఁబడి యేడ్చుచు "ఓరాక్షసేశ్వరా! పాతాళలంకానాథా! నీబలమును సామర్థ్యమును వమ్మై యివ్విధమున మృతినొంది పడియుండుటను చూడఁగలనని నేను కలనైనను తలంచిన దానను గాను. అయ్యో! ఇంక నాకు దిక్కెవ్వరు గలరు? నిన్ను బాసి యనదనై యెట్లు జీవించియుండగలను. నీవు లేనంతటనే సౌఖ్యము గలిగినను నేమిటికి? దుఃఖసాగరములో మునింగిపోయితి. గతిలేనిదాననైతి. ఓవల్లభా! "ఇది ప్రాణహానికరమైన పని" యును, "రామలక్ష్మణులం జంపవలెననెడి దుర్బుద్ధి విడువవలసిన" దనియు బహువిధములఁ జెప్పితిని. నాపలుకులు నీకు విష ప్రాయమై తోఁచెను. వినవైతివి. కాలము దీఱుటచేత కాఁబోలు నీవివేకము నశించిపోయి మూర్ఖపు పట్టుదల యేర్పడినది. అసమాన శౌర్యవంతులును, దేవతుల్యులునగు భానుకులులం జంపుటకుఁ దలంచిన యెడల నది కొనసాగు కార్యమగునా? అటుల తలంచి నవాఁడు జీవించియుండగలఁడా? ఈప్రాణహానిని నీకు నీవై తెచ్చుకొంటివి.

ఆ పాపకారి రావణుండే నీపాలిటికి మృత్యువుగా నేర్పడెను. చేయరాని యకృత్యముఁ జేసి, తాను జచ్చుటకు సంసిద్ధుఁడగుటతో బోవక, క్రూరకర్ముఁడు తనకుఁ గలుగఁబోయెడి దుర్గతిని నీకును సంభవించునట్లు చేసెను. వానిపోహణ పలుకులకు లోఁబడి, పరమ దుష్టుండగు వాని నుద్ధరించుటకుఁ గడంగి నీవే మరణించితి ఆంజనేయుం డిచటి కరుదెంచెనని తెలిసినపుడే, నాగుండెలు బగిలినవి. అపుడె రఘునందనుల నతని వశంబున నప్పగించి, యపరాధమును క్షమింపుమని వేడుకొని యున్నచో నీవును, నీమూలమున మేమెల్లరమును క్షేమమున నుండి యుందుముము. విధికృతము వేఱుగా

నున్నంమున, అటువంటి మంచి బుద్ధి నీకుఁ గలుగక పోయినది. ఇంక నేము దలంచిన నేమి ప్రయోజనము గలుగును, ఎటులజరుగ వలయునని దైవము సంకల్పించెనో యాలాగున జరిగినది" యని యాపతివ్రత పనవి పనవి, తనకుఁ గలిగిన దుర్గతినిఁ దలంచి చూప రులకు జాలి గలుగులాగున వాపోవఁ దొడంగె. పాపము! ఆమె స్థితి మిక్కిలి పరితాపకరముగా నేర్పడినది. మఱియు నయ్యాబల.

"సీ॥ పాతాళలంకేశ - భాస్కరుండాంజనే -
యాపరాశాస్థలి - నస్తమించె -
సమరలోకేంద్ర మ - హానాకయనిలనం-
దనసాగరంబులో - మునిఁగిపోయె
మైరావణోద్దండ - మదహస్తిహనుమంత
మృగనాథునకుఁ జిక్కి - మేనుఁదొఱఁగె
నమరారిపక్షిగ - ణాధారవృక్షంబు
కపివీరదావాగ్నిఁ - గాలిపోలె.
గీ॥ అస్మదాత్మేశ్వరా త్మ్యున్న - తాచలంబుఁ ।
గేసరీపుత్ర దంభోళి - కెడయనడచె
నెంతచింతించినను యిపు - డేమిఫలము? ।
దైవసంకల్ప మిట్లుండఁ - దప్పఁగలదె?

శా॥ ఎన్నోభంగులఁ జెప్పితిన్ వినకదుష్కృత్యాభిలాషామతిన్
సన్నాహంబొనరించె దాశరథులం - జంపందరంబౌనె? నే
మున్నేయివ్విధినా పెఱుంగుదునిలన్ - మూర్ఖుండువర్ధిల్లునే?
తెన్నుండప్పిచరించి మేనుదొఱఁగెన్ - దిక్కేది యీలాగునన్.

ఆ పాపకారి రావణుండేగదా? యీ ప్రాణహానికి కారణము. ఈ యాపదను దప్పింప గలిగెనా? యడ్డగింప నేర్చెనా? కటా! వానికొఱకుగా పనిఁ బూని, నా వల్లభుండు ప్రాణములను గోల్ప డియె. దైవమా! ఏమిగతి" యని శోక సాగర మగ్నయై యల్లా డుచుండె. ఆ సమయంబున హనుమంతుఁడు భద్రకాళి దెలిపిన పద్ధ తిఁదప్పక యన్ని పనులు నొనరించి మైరావణుని విగత జీవునిగావించి కృతకృత్యుఁడై కాళికాలయమున కరిగి యప్పరాశక్తికి దండ ప్రణా మంబులు సమర్పించి చేతులు మోడ్చి యిట్లని స్తుతించె.

కథాసరణి - డోరా.

"అమ్మా! శర్వాణికొమ్మా! దీనజ- నమ్ముపట్టుకొమ్మా!
నమ్మినవారికి కోరినకోర్కులొ-నర్చుపైడి బొమ్మా!
నీదయచే మైరావణుఁజంకితి-నెరవేరెను పనులు
ఈదోర్దండికి మేలొనరించుట-యేకొఱయుకగలదు
రెండేగడియలు రవియుదయించుటకుండెడిఁ గాలంబు
పుండరీక వాహన యాకార్యముఁ-బొసఁగదీర్చివచ్చి
నీ యనుజ్ఞఁగొని రామలక్ష్మణుల-నేఁగొనిపోయెదను
మాయారూపిణి పర్వతతనయా-మన్నింపుమునన్ను."

అని స్తుతించి విన్నవించి, దోర్దండినిఁ దోడ్కొని చని, కారాగృహ బద్ధులై యున్న యా ముగుదపతిని, సుతుని, విముక్తులంజేసి యామెను వారి కప్పగించెను. దోర్దండి జరిగిన వృత్తాంతము సర్వమును, పతికిని, సుతునకుం దెలిపెను. అంతట తమ పాలిటి రక్షకుఁడైన యాంజనేయున కయ్యిరువురును దండ ప్రణామంబు లాచరించి, బహు ప్రకారంబుల సన్నుతించిరి. వాయునందనుండు వారి నాదరించి, యపుడ తగిన సన్నాహ మొనరించి దోర్దండి పుత్రుఁడగు నీలమేఘుని సింహాసనమునఁ గూర్చుండఁబెట్టి పాతాళ లంకా రాజ్యమునకుఁ బట్టంబుగట్టి, తన కుమారుని మత్స్యవల్లభుని రావించి, యతని యొద్దనుండి వచ్చినది మొదలుగ, నప్పటివరకును నడచిన వృత్తాంతమును సంగ్రహముగ నెఱింగించి యతనికి, మంత్రి పదవి నొసంగి, వారు వర్తింపవలసిన రీతినిగూర్చి ముఖ్యములగు నీతులు బోధించి, తన కెంతయు సహాయకారిణియై, మరణమునకు సయితము వెఱవక తాను చెప్పినట్లు తన మాటలు నమ్మి వర్తించిన దోర్దండి నెంతయుం బ్రియంబు గదురమన్నించి, "ఇంక నేకష్టములునులేక, సకల సుఖములు ననుభవింపుచు సంతోషచిత్తులై యుండుమని చెప్పి, నీలమేఘునిఁ బిలిచి వానితో నిట్లనియె.

మైరావణునకు సంస్కార మొనరించుటకై మారుతి నీలమేఘుని నియమించుట.

ఓయి నీలమేఘా! దుర్మార్గుఁడైన మైరావణుండు తనకుఁ దాన చేటుఁ దెచ్చుకొని నమసెను. వాఁడు మృతుండగుటచే నీకు

రాజ్యాధిపత్యము లభించినది. మీ కష్టము లన్నియుఁ దొలంగినవి. ఇంక నీవతని కగ్ని సంస్కారాది క్రియలు జరిగించుటకుఁ దగుయే ర్పాటుఁ గావించి, యతని భార్యయు, పతివ్రతయు నగు మాతంగి యందు మాతృభక్తినిడి, యామెకెట్టి కొఱంతయును గలుగనీయక, పతి మరణించిన దుఃఖము దోఁచకుండులాగున వర్తింపుచు సంర క్షించు చుండుము. ఈ మత్స్యవల్లభుండు కడు బుద్ధిమంతుఁడు. మహాబలశాలి, నీతి నెఱింగినవాఁడు. ఇట్టి యుత్తముఁడు నీకు మంత్రియగుట మిక్కిలి శ్లాఘింపఁదగిన విషయము. ఇతనియాలో చనం గొనుచు యేకొఱంతయు లేక నిర్విచారముగ శాశ్వతరాజ్య భోగంబు లనుభవించుచుండుము''—అని దిట్టము చేసెను.

నీలమేఘుండును, మహాప్రసాదము. మీ యాజ్ఞాబద్ధుఁడనై, ప్రవర్తించెద'' ననియె. అంతె మత్స్యసుతునిం జూచి ''వీరాగ్రే సరా! నీవీ నీలమేఘునియందు రాజభక్తి గలవాఁడవై, యితనికి పట్టుగొమ్మగా యుండి, సదా యితనికి మేలుగోరుచు సంతసంబున వర్తింపుచుండుము. ఇంక రఘువీరులగొని రవి యుదయమునకు మున్నే నేను సుగ్రీవాదుల యొద్దకుఁ బోయెద''నని చెప్పి, తనకు మ్రొక్కిన, దోర్దండిని, యామె భర్తను, నీలమేఘుని మీానకుమా రుని దీవించి యటనుం భద్రకాళి యాలయమున కేగి, సాష్టాంగ దండప్రణామము లొనరించి.

ద్విపద.

''దాక్షాయణీనన్ను-దయఁజూడవమ్మ। రక్షించితివి నీవు-రామలక్ష్మణుల
మైరావణుని యుద్య-మమువమ్ముఁ జేసి। క్రూరచిత్తుఁడు వాఁడె-గూలెడి భంగి
సంకల్ప మొనరించి-సద్గుణాకరుల। సంకటములు దీర్చి-జయమొసంగితివి।
పోవలెనే ప్రొద్దు-పొడువకమున్నె। గావున వేధరా-కాంతు పుత్రులను
గొనిచనంగ ననుజ్ఞ-గోరితి జనని। తనరనాచేయు ప్రా-ర్థన నాదరించి
యనుపుమునన్నింక-నాలస్యమైన। గనలొందునాపై నిఁ-గపి వల్లభుండు''.

అని వేడుకొనెను. కాత్యాయని కనికరించి యతనికిఁ బొడ సూపి ''వాతాత్మజా! మైరావణుండు నా యందు భక్తిగలవాఁడే యైనను అతండు లోకారాధ్యులగు వీరులం జంపఁ గడంగుటం జేసి

మహాపరాధియయ్యె. దుష్కార్యంబుఁ జేయువాఁ డెంతటి భక్తుఁడై యున్నను, వానిని వధింపక విడువరాదు. కావుననే యీ పాతాళ లంకేశ్వరునకు నేను కీడుచేయవలసి వచ్చినది. ఎవఁడు నిష్కారణముగా సాధువులకు చెడుగుఁ గావించుటకుఁ దలంచునో, చేయునో యట్టి వానిని నాశమొనరించి, వానివలనఁ గలుగు బాధలకు లోనైనవారిని రక్షించుటకు నాకు విధి. ఎచట ధర్మముగలదో, యచట జయ మును, కార్యసిద్ధియుఁ గలుగుచుండును. ఇదే యీ పేటికలో, మైరా వణుండు జల్లిన మచ్చుపొడి మహిమచే తమ్ముఁ దామెఱుంగక దశ రథాత్మజులు శయనించి, యే బాధయు లేక సుఖముగా నిద్రించు చున్నారు. గొనిపొమ్ము. వీరు రావణునిం జంపి, జయశీలురై తమ పురంబున కరిగి సకల సౌఖ్యములు ననుభవింగపలరు. హను మంతా మరియొకమేలు మాటం జెప్పెద నాకర్ణింపు'' మని పలికి యా పరాశక్తి యిట్లనియె.

ఇచ్చోటికి నీవు వచ్చునప్పుడు మహా కష్టములు పొంది చేరి తివి ఇపుడన్ననో యటువంటి సంకటము లెవ్వియును, గలుగకుండు నట్లును, యీక్షణంబ మీ వారియొద్దకుఁ జేరునట్లు జేయనెంచితి మహాత్ములగు యీ రాజపుత్రులు శయనించి యుండెడి పెట్టె నెత్తి కొని, యొక నిమిషకాలము కన్నులు మూసికొని యుండి పిమ్మట విచ్చి చూడుము. నీవు యెచ్చట నుందునదియుం దెలిసికొనఁ గల వు'' అని చెప్పెను. కరుణాయుక్తములైన యా దేవి వాక్యంబులు విని యాంజనేయుం డెంతయు నలరి నమస్కరించి పెట్టెకు ముమ్మారు ప్రదక్షిణములుచేసి మ్రొక్కి దానిని నెత్తి పదిలముగా తలపై బెట్టు కొని, భద్రకాళి యాదేశించినట్లు కండ్లు మూసికొనెను.

రెండునిమిషము లట్లుండి కండ్లు దెఱచి చూచెను. అతఁడు యుద్ధభూమిలో లంకాపుర సమీపమన సుగ్రీవాదుల దాపునకుఁ జేరి యుండుటం దెలిసికొని, పరాశక్తిని పలుతెఱంగులం గొనియాడి, కపి రాజ ప్రముఖులం దరియ బోయి, మంజూషమును భూమిపై నిడి నమస్కరించి నిలిచెను. హనుమంతుఁడు రాజనందనులం దెచ్చినది విని, సుగ్రీవాంగద, జాంబవ త్సుషేణ విభీషణ ప్రముఖులు పరమ సంతోషమగ్నులై, పెట్టె యందెరచి దశరథుని నందనులు

మైరావణుని మచ్చు మహిమచే యొడళ్లు తెలియక నిద్రించు చుండు టనుచూచి యానందించిరి. వారిని మేల్కొలుపఁ బ్రయత్నించు టయు, విభీషణుండు వారించి "వృథా కష్టము దక్క లాభము లేదు. మీరు యేమిచేసినను, వీరి మైకము నిపుడ తొలంగింపఁ జాలరు. వీరిమీఁద సూర్యకిరణములు సోఁకినయెడల మచ్చు మహిమ తొలంగిపోయి, తమకుఁ దామే మేల్కొనగలరు" అని చెప్పెను. సరి! యని యా ప్రయత్నమును మాని, యంతటి మహాత్కార్య మొనరించి యెట్టి కీడునుం బొరయనీయక, సూర్యోదయ మగుటకు మున్నగనే రాఘవులం గొని వచ్చిన యంజనీ నందనుంజూచి, యమ్మహాబలుని, బల పరాక్రమ సామర్థ్యంబులు గొని యాడి మెచ్చి యందఱు నేకవాక్యంబుగా నిట్లనిరి.

కథాసరణి — డోరా.

భంజితదానవసముదా యాస — ద్భావ యాంజనేయా
కుంజరవైరి సహస్రబలాన్విత — గురుమాతృవిధేయా
అన్యులకెపరికి సాధ్యముగాని మ — హాకార్యముఁబూని
ధన్యులరఘువీరులఁ దెచ్చుటకై — తరలిపోయి నీవు
మాయాజాల విశారదు, ఖలుఁడగు — మైరావణుఁజంపి,
యేయడరును సంధిల్లకమున్నే — యీపుణ్యాత్ములను
గొనివచ్చితి విచ్చోటికిపుడు నిను — గొని యాడఁగతరమే
వనచరుఁడవె? నిన్నెన్నఁగనాప — ద్బాంధవుఁడవుసుమ్ము
ఇంతకుపూర్వము పలుసారులునీ — వీనృపపుత్రులకు
వంతబొసంగిన యపుడెల్లనుద — ర్పంబు మీరఁగడఁగి
యాసంకటములు దీర్చితివిపుడును — నల్లేచేసితివి
కౌసల్యాసుతు భక్తుఁడవెన్నఁగ — హనుమంతా.

అని ప్రశంసించిరి. అంతట విభీషణుం డెల్లరును వినుచుండఁగా నయ్యాంజనేయుండు పోయివచ్చిన వృత్తాంతము నెఱింగింపఁ గోరి యడిగెను. పవనసుతుఁ డతనింగని, "విభీషణా! దుర్మతియు మోసగాఁడునగు మైరావణుం డొడర్చిన టక్కు నెఱుంగలేక పొర బడి నీవే యవ్విధంబున నొనరించితివని యెంచి నిన్ను దూరి పలికితి. పిమ్మట నిజమును దెలిసికొని, పశ్చాత్తాపమొంది, నా యవి

వేకమును గూర్చి నన్ను నేన నిందించుకొంటిని. నా పలుకులను మదిలో నిడక, యలుగక, యెప్పటి చందమున మైత్రితో మెలంగ వలయునని వేడుచున్నాను. ఇంక నీ యడిగినట్టి నా పోయి వచ్చిన కథను వినుపించెదను. వినుం"డని యెల్లరును శ్రద్ధతో వినుచుండగా, శ్రీరామచంద్రుని చరణంబులు ధ్యానించి యిట్లని చెప్పం దొడంగె.

హనుమంతుఁడు పాతాళ లంక కరిగివచ్చిన వృత్తాంతమును జెప్పుట.

"విభీషణా! నీవు చెప్పిన ప్రకారముగనే, సూక్ష్మరూపముతో తామర కాడలోని సందులో దూరి పాతాళమునకుఁజేరి పోవుచుండు నపుడు దారిలో నాకుఁ గలిగిన యాటంకములు గడువరానివై యుండెను. ఎట్లెట్లో వాని నన్నిటిని దాటి తులాద్వారము నొద్దకు బోయితిని గాని, దానినిఁ గడచి యరుగుట యసాధ్యముగా దోఁచి యటఁ గల తటాకమునొద్ద యవ్వలిగట్టు చెంత గూర్చుండి యుపాయంబు నాలోచనఁ జేయుచుంటిని" అని పలికి, దోర్దండి యచ్చోటికి వచ్చుటయు, నామెతో సంభాషించినరీతియు, నయ్యతివను తన కార్యమునకు సహాయముగా నుండునట్లును, నామెకు తాను చేసిన వాగ్దాన ప్రకారమును, తులాద్వారమును దాటుటకుఁ గావించుకొనిన యేర్పాటును, నందలి రాక్షసులకునుం దనకునుం జరిగిన యుద్ధక్రమంబును, నటనుండి దోర్దండి సహితముగా కాళికాలయమునకుఁ జని యా పరాశక్తిని స్తుతించుటయు భద్రకాళి ప్రత్యక్షమై రామలక్ష్మణు లచ్చట నుండుటను జూపి, తనకుఁ జెప్పిన విషయంబులును, మైరావణ వధోపాయమును కాత్యాయనివలన నెఱింగి దోర్దండిని రఘువీరులను, కాళికాదేవి సంరక్షణయం దుండునట్లుగా ప్రార్థించి, తాను రాక్షసులతో యుద్ధము జేయుటకుం దరలుటయు కోట్లకొలంది దనుజుల సంహరించుటయు, మైరావణునకునుం దనకు జరిగిన సంగర క్రమంబును, వాఁడు గావించిన మాయలును, తుదకు వానిని వాలముతో బంధించి యుదయాద్రి దాఁటిపోయి, యతని మధుకర రూపములతో నుండు పంచ ప్రాణములందెచ్చి వానినిఁ జంపి తుమ్మెదలను జంపి వానిపై వైచి సముద్రంబుల గ్రుంకి వచ్చి చూచుటయు, మైరావణుండు మృతుండగుటయు, కాళీదేవి పునర్దర్శనమును

నీలమేఘుని, వాని తండ్రిని కారాగృహ బంధ ముక్తులంజేయుటయు, తాను వచ్చునపుడు మార్గములో తటస్థించి పోరాడి, కడపట తనకు పుత్రుండనని చెప్పిక మత్స్యవల్లభుని రావించుటయు, నీలమేఘునకు పట్టముఁగట్టి, మత్స్యసుతునకు మంత్రి పదవినొసంగి, దోర్దండికి చేసిన వాగ్దత్తమును నెరవేర్చిన వృత్తాంతమును, మైరావణునకు సంస్కార క్రియలు నెరవేర్చుటకై నీలమేఘుని నియమించి భద్రకాళి గుడికి వచ్చి యాపరాశక్తి యనుజ్ఞంగొని దాశరథులున్న పేటికం గొని యామె చెప్పిన చొప్పును కన్నులు మూసికొనుట వెండియు కండ్లు దెఱచి చూచుట నచ్చో వారిసన్నిధిలో తానుండుటయు, నిత్యాదు లగు సకల విషయములును వివరించెను.

అమ్మహా బలనందనుండు చెప్పిన యద్భుతములను, నసాధ్యములును, భయంకరములునైన విషయంబులు వినుచుండిన వనచర వీరు లాశ్చర్యమొంది "హనుమంతా, బలవంతా! కీర్తిమంతా! ఇంతటి మహాత్కార్యమును నీవు దక్క మఱి యెవ్వఁడు చేయఁ గలఁడు? శక్యమగునా? అసమాన ధైర్య సాహస ప్రతాప శీలుం డవై నీకు సమానుండు మూడు లోకములలో నను గలుగఁడు. ఈ గొప్పకార్య మొనరించి, కీడు బొరయకుండునట్లు నృపసుతుల రక్షించిన నిన్ను నుతించుటకు మాబోంట్లకు తరముగాదు. రామ భద్రునియందు నీకు గల భక్తి శ్రద్ధలను వెల్లడించితివి. నిన్ను మించఁగల భక్తుండు జానకీ జానకి వేఱొకండు లేఁడనుట నిక్కము. నీ వలన దురాత్ముఁడగు మైరావణుండు చేయ నెంచిన కీడు భూపా లసులకుఁ దొలంగి పోయినది. సుఖులై యుండెడి యమ్మహనీయులం గాంచి మేము పరమానందమును బొందునట్లు చేసి, మమ్ము ధన్యులఁ గావించితివి" అని శ్లాఘించిరి.

మైరావణుని కపటాలోచనం దెలిసికొని, పాతాళ లంకకుఁ జనుటకు మార్గంబును, నచ్చటి రహస్యంబులును దెలిపి, హనుమం తునిఁ బనిచి రఘుకులేశ్వరుల ప్రాణములు రక్షించుటకు కారణభూ తుఁడైన విభీషణు నెల్లరును గొనియాడి "రామభక్తుండవైన గుణ నిధీ! నీవు చెప్పకున్న యెడల నెఱుఁగనివారమగు మేము విపత్స ముద్రములో మునింగి పోయి యుండుదుము. ఆయాపదను దప్పించి

పుణ్యముఁ గట్టుకొంటివి. నీ సహాయము గలుగుట చేతనే, రామ లక్ష్మణుల ప్రాణములు దక్కినవి. నీయద్భుతసుగుణములు, నిష్కల్మష ప్రవర్తనమున మాకు ముందటి కంటె యిపుడు మఱియును స్పష్టముగా తెలిసినది.'' అని మెచ్చి పొగడిరి.

ఇట్లు వారు మాటలాడుకొను చుండఁగా మఱికొన్ని నిముషములకు సూర్యోదయం బయ్యెను, క్రమముగ సూర్యకిరణములు తనువులకు సోఁకుటయు, మచ్చుపొడి మహిమ తొలంగిపోయినందున, రామసౌమిత్రులు మేల్కొని లేచి, తామొక పెట్టెలో శయనించి యుండుటం గని యచ్చెరువొంది తత్కారణంబును సుగ్రీవాదులం బిలిచి యడిగిన, వారు జరిగిన వృత్తాంతమును సర్వమును విన్నవించి "రామచంద్రా! ఈ విభీషణుని యుపదేశంబున మన హనుమంతుఁడు పాతాళలంక కరిగి మైరావణునిం జంపి ఇంతకుమున్న మిమ్ము నిచ్చోటికి దెచ్చి చేర్చె" నని పలికిరి. ఆవృత్తాంతమును విని రామలక్ష్మణు లాశ్చర్యమునొంది, తమయందు మిక్కిలి భక్తి గలవారై, విభీష ణాంజనేయులు ప్రాణములు రక్షించు నందుకై వారి నెంతయుం బ్రియంబున నాదరించి ప్రశంసించిరి.

దశకంఠుఁడు మైరావణుండు చచ్చుటను విని శోకించుట.

ఇక్కడిస్థితి యిట్లుండ, లంకలో దశముఖుఁడు తనలో మిత్రుండగు మైరావణుండు రామలక్ష్మణులం గొనిపోయి తెగటార్చి వచ్చి యా శుభవార్త తనకుఁ జెప్పుటకై వచ్చునని యతని రాకకై సంతోషముతో నిరీక్షించుచుండెను. కాని దైవసంకల్పము వేఱగుటచే యతని సంకల్పము నెరవేఱదయ్యె. పాపము! ఆశ లడుగంటినవి. దుర్మార్గుఁ డెన్నటికైనను జెడక తప్పునా? వేగులవార లరుగుదెంచి దండముబెట్టి మైరావణుని మరణవార్తను విన్నవించి, జరిగిన విధమంతయుం జెప్పిరి. ఆపలుకులు చెవులుసోఁకగనే, రావణుండు మిన్నువిఱిగిపైఁబడిన చందమునఁ దోఁచుటయు, నపుడే తాను చచ్చినట్లు నిశ్చయించెను. ఎన్నెన్నివిధములనో యోచించుచు గాలిలో మేడలు గట్టుచుండిన యతనిగోరం తెమ్మ కోరికలెల్ల పొల్లుబోయినవి. "హా! మైరావణా! మిత్రమా! ఎంతటి పనికైనను చాలిన మహాసమర్థుండవగు నీవు పోనినందున సిక్కా

ర్యము నిక్కముగా నెరవేఱుననియు నేను జయంబు నొందఁగలన నియు సంతసించుచుంటిని, అసమాన మాయాతంత్ర కుశలుండవును, బలపరాక్రమముల నెంతయు నధికుఁడవునగు నిన్ను సయితము జంపి రనినచో విపరీతకాలముగాక మఱి యేమనవలయును? అయ్యో! నేను దురదృష్టుండను. నీయంతటి గొప్పవాఁడు సహాయుఁడయ్యును నాపని నెరవేరక పోయెను గదా? తుదకు నామూలమున నీకును మరణము గలిగినది, ఇంక నాకు జయమెక్కడిది? ఉద్ధరించువారె వ్వరు గలరు? ఆరామునిఁగాని, యతని సైనికులైన వానరవీరులను గాని జయించుటకు నాకు సాధ్యముగాదు. సీత నాకు లభింపఁబోవు నదిలేదు. నేను సమరమునకుఁ బోయినను పోవకున్నను నేఁడు రాముని చేఁ జచ్చుట నిశ్చయము. ఎచట డాగినను వారు వెదకి కనుఁగొని నన్ను చంపుదురుగాని విడువరు. ఇసీ! ఇంకమీఁదట యీ బ్రతుకేమిటికి? ఎన్నినాళ్లు జీవించినను తుదకు పుట్టినవాఁడు గిట్టక తప్పదు. నావార లందఱును బొలిసినంతటనే నొక్కండను బ్రతియుండి యేమి సుఖమొందఁ బోయెదను? మావంశమునకు రాము నాశ్రయించియున్న విభీషణుం డున్నాఁడు. వాని మంచి బుద్ధిని వినక యింతటి చేటుం దెచ్చికొంటిని. వానిపలుకులు నిరాకరించి పాదతాడితునిఁజేసి వెడల నడచితి. ఆదోషము నిపుడ నుభవించి నాను. త్రిలోకవి ద్రావణుండనై వర్తించుచుండి కట్టకడపట నన దనై మానవుని చేఁ జచ్చుటకై పాలైతిని. ఇది కాల మహిమ. విధికృతము. తప్పదు. ఇపుడు కర్తవ్యమెయ్యది? సీతను దోడ్కొని పోయి రామున కప్పగించి, శరణాగతుఁడనై ప్రాణములు రక్షిం చుకొనవచ్చునా? ఛీ! ఛీ! ఎంతటి హీనమైనతలంపు గలిగినది? ఇపుడా యీయాలోచన? అంతయును ముగిసిన పిమ్మట నాప్రాణ భీతి? ఎందఱెందఱో హితోక్తులను బలికినపుడు సమ్మతింపని వాని కిపుడు చింతయేల? శక్తియున్నవరకును పోరాడి వీరమరణమును జెందెదనుఁగాక. రామచంద్రుఁడు శ్రీమన్నారాయణుం డనియు, రాక్షస సంహారార్థము దశరథునకు కుమారుఁడై జన్మించె ననియు నెల్లరును బలుకుచున్నారు. అది నిక్కమే యని నాకునుం దోచు చున్నది. కానిచో నిందఱు మహావీరులను సంహరించుటకు సామా న్యునకు శక్యమగునా? కానిమ్ము. రాముఁడు పరంధాముఁడేయైనచో

నతనిచేఁ జచ్చితినేని శాశ్వతమగు కైవల్యపదవినొందెదను. మానవుఁడై యుండి నాచేఁ జచ్చెనేని సీతనుగూడి సామ్రాజ్యభోగములనుభవించెదను. ఇదియే కడపటి తీర్మానము. వారు లంకలోఁ జొచ్చి నన్ను పిరికిపందనుగా నెంచి చంపుటకన్నను, నేనే సంగరమునకుఁ గదలిపోవుట లెస్స. ప్రాణాంతవరకును రోగి కౌషధము నిచ్చుచుండ వలసినది విధియని వైద్యశాస్త్రజ్ఞులు చెప్పెడి రీతిగా నామేన జీవము లున్నంత దనుక పోరాడి తనువుఁ దొఱంగెద. జయము పోరాటములో నెవనికేని యొకనికిఁ గలుగును. కాని యిరువురును జయమొంద వలనుగాదు. అటుల నిరువురును జయించినట్లు తలంపవలసినచో దానికి సంధి సమాధానములు కార్యసాధనము లగును. ఇపు డట్టి సంధి నాకును రామచంద్రునకును గలుగనే కలుగదు. తనువు విడిచినను విడిచెదను కాని, నేను సమాధానమున కొడఁబడనొల్లను. కాలహరణ మేమిటికి ? త్వరితముగా యుద్ధమున కరుగుటకై ప్రయత్నించెదను గాక'' అని యాలోచనఁ జేసి, పంక్తికంఠుఁడు ప్రహస్తునిం బిలిచి, నడిచిన వృత్తాంతమును, నిజాభిప్రాయమునుం జెప్పి. హతశేష బలంబులం గూర్చి సంగర సన్నాహంబును కడుశీఘ్రముగా నొనరింపుమని యాజ్ఞాపించెను.

ప్రహస్తుండును నతని యనుమతంబున, మిగిలియున్న యల్పదళంబులం జేర్చి సకల సన్నాహము లొనరించి యావార్తను రావణున కెఱింగించె. అతండును యుద్ధాలంకారములు గావించుకొని యదియ తనకు కడపటి దివసంబుగాఁ దలంచి యుత్సాహంబు విడువక కాంచన కింకిణీ సంకలితంబైన తేరు నెక్కి భేరీ మృదంగాది వాద్య ఘోషము లతిశయింపగా, మహారథసంబులతో లంకాపురంబు వెలువడి, యార్భాటంబులును, సింహనాదంబులును, పెడబొబ్బలును మిన్నుముట్టుచుండ సైనికులు చనుఁదేర, మహాతేజంబుతో రామచంద్రునితో పోరుటకై పొలికలనున కరుగుదెంచెను.

రగడ.

కరులశ్వంబులు – కాంచనరథములు । ధరయీనినచందమున పదాతులు
భేరీకాహళభీకరరవములు । నారకమునఁ బె – ల్లగువెడనగవులు
మిన్నందుచుఁగడు–మెఱయుసిడెంబులు। నున్నతినెంతయు–నొప్పెడిపడగలు

పరశుగదాశర-పట్టసతోమర । పరిఘముసలకర - వాలప్రముఖము
లగునానాక్రూ - రాయుధచయములు । తగదాల్చిన యోధప్రకరముతో
జగదిగదలసుర - సంతతి బెదరఁగ । తెగువదనరఁగా - ధీరతమీరఁగ
కదురయమునదశ-కంఠుఁడుపురమును । విడిచియనికిదా-వెలువడివచ్చెను

ఉ॥ రావణుఁడట్లువచ్చుటయు-రామవిభుండును లక్ష్మణుండును
సుగ్రీవుఁడు నంగదాదులగు - కీశగణాధ్యులుఁ గాంచియుద్ధతిక్
తీవరమొప్పవానినినె - దిర్చి పెనంకువకుం జొరంబ్రమో
దావహచిత్తులై నిలిచి - రత్తరినందఱు నాయితంబుగన్.

సీ॥ ఉగ్రరాక్షసులను - త్వరఁగూల్తుమిపుడంచు
గట్టిగాభుజములు - దట్టువారు
యరిసేనలోఁజొచ్చి - యల్లకల్లోలంబుఁ
జేసెదమనుచువ - చించువారు
రక్కసులెంతధై - ర్యంబునఁబోరిన
నసమునఁజంపెద - మలెడివారు
తుదియుద్ధమిదినేఁటి - తోదీతెపంక్తికం
ఠునకాయువనిబలు - కొనెడివారు.

గీ॥ కిలకిలార్భటులొనరించి - కేరలువారు ।
చిట్టుగొని సింహనాదము - ల్సేయువారు
నైవనేచర యోధులా - హావమొనర్ప ।
నగశిలాదులు కొనినిల్చి - రార్చులెసఁగ.

ఇట్లు వానరులు సన్నద్ధులై యుండఁగా రాక్షసబలంబులు సమీపించి వారిందాకెను. ఉభయ సేనలకును ఘోరంబైన సమరంబు జరుగఁ దొడంగెను. రామలక్ష్మణుల నెదిరించి దశముఖుండు పోరాడుట కారంభించె. జగదేక వీరుండగు రామచంద్రునకును, లోకవిద్రావణుండైన రావణునకు జరుగుచున్న మహా భయంకర సంగ్రామంబును జూచుటకై దేవతలు విమానారూఢులై వచ్చి మింట నిలిచి కనుఁగొనుచు, భయాశ్చర్యమగ్నులగుచుండిరి. అపుడు పంక్తిముఖుఁడుగ్రుండై రామభద్రునిపై బహుతర క్రూరాస్త్రములు బరగించుచు "ఓయి రామా! ఇంక నీకాయువు దీఱినది. కావు

ననే నాతోడఁ బోరాడఁ గడంగితివి. నాప్రతాపమును, శక్తియును నెఱుంగక యవివేకివై, పోరాటమునకు గడంగితివి. "అయ్యో! నిన్ను చూచిన నాలో నెంతయు జాలి బొడముచున్నది. కావున కరుణించి నిన్ను విడిచెదను. పరుగెత్తి పొమ్ము. వృథా నాచేఁ జావనేల? ఎటకేనియుం జని బ్రతుకుము తమ్ముఁ రక్షింతువని, నిన్ను నమ్మి వచ్చిన యీ ముక్కిడి కోతులను రిత్తకరిత్త యేల చంపు కొనెదవు? వీరలఁ దోడ్కొని శీఘ్రముగా నా బారినుండి తప్పించు కొని యరుగుము. నన్ను జయించుటయు, జానకినిం గొనిపోవు టయు కల్ల. ఆయా సయింక నీవు పెట్టుకొనవలదు. త్రిమూర్తు లును, ముప్పది మూడుకోట్ల దేవతలును నొక్కటిగా కూడి వచ్చి నన్ను తాఁకినను, సీతను గొనిపోవుటకు శక్యముగాదు. ఇంక నీకు సాధ్యమగునా? అడియాసలు విడిచి, ప్రాణ సంరక్షణముఁ జేసి కొనుము" అని బింకపు పలుకులు పలుకుచున్న. రాఘవేశ్వరుండు వాని బుద్ధిహీనపు గర్వోక్తులు విని మిక్కిలి కోపమును బొంది యిట్లనియెను.

"ఓరి! రాక్షసాధమా! దురాత్మా! రావణా! ఇంకను నీకు బుద్ధివచ్చినట్లు తోచకున్నది. మందమతీ! నేను లేనికాలమున దొం గవేషముతో వచ్చి జనక నందనను గొని తెచ్చితివి. కాని కాదేని యపుడే నీకాల మంతమైయుండును. ఓరి! దొంగా! మూర్ఖుఁడా! త్రిమూర్తులు గావలయునా? ఇదివర కెపుడో నీయసురులు బాసియే యుందును గాని, రెండు సారులువచ్చి యెదిరించి నిలిచి నాతోఁ బోరలేక వెఱచి పాఱిపోయి లంకలోఁ జొచ్చితివి. పిరికిపందా! సిగ్గులేక మాటలాడెదవు. ఎందు జొచ్చినను విడువను. తప్పించు కొనవచ్చునని తలంచితివి కాఁబోలు నీయాటలు నాముందట నింక సాగవు. నీ టక్కు పిక్కు లింకఁ జెల్లవు. కొన్ని నిముషములు పరు గెత్తిపోక నిలువుము చాలును. పరమ దుష్టుండవగు నిన్ను సంహ రించి, నీవలన లోకులకుఁ గలుగుచుండిన యుపద్రవమును నివర్తిల్లఁ జేసి, జగంబులకు శాంతి నాపాదించెదఁ గాక. ఎచటికేఁ బోయె దవు? ఎందు దాగెదవు? నిన్ను నా బారినుండి తప్పించి సంరక్షించు వారెవ్వరు గలరు? నేటితో నీకాలము దీరినది. పర వీర భయం కరములైన మదీయ క్రూరాస్త్ర జనిత దావాగ్ని నీశరీర రక్తమును

నింకించి యెండిన ద్రాకునుం బోలె నిన్ను దగ్ధముఁ జేయునట్టి సమయ మిపుడు తటస్థించినది. సాధువులైన మునులను బాధించుటవలను, పతివ్రతలను భంగించుటవలనను, పుణ్య వర్తనులగు వేల్పులనల్లాడించుట వలననుం గలిగిన నీ మహా పాప ఫల మిత్తరినను భవింపఁ బోవుచున్నావు''—అని పలికి రోషావేశం బతిశయింపఁగా, నయ్యసురపతి తనపైఁ బరగించుచున్న బాణంబు లన్నియుం ద్రుంచుచు, జగద్భయంకరము లగు క్రూరాస్త్రంబులచే, రావణుని శిరంబులు పనియును ద్రాఁటిపండ్లు రాలిన విధంబున ఖండించి నేలఁ గూల్చెను.

ఇవ్విధంబునఁ ద్రెంచుటయు, వాని శిరంబు లాక్షణంబ మరల యథాప్రకారముగాఁ బొడమెను. ఆ రీతిం గాంచి రామచంద్రుండు వాని మహిమ కాశ్చర్య మొందుచుండు సమయంబున నతండు సశిర దశకుఁడై పకపక నగుచు "ఓరి రామా! నన్ను జంపు నంతటి వీరుండవా? నీవు. ఇసీ! మానవాధమా! నా హితోక్తులు విన నొల్లక పోరాటమునకుఁ దొడరిన నీకుఁగలిగెడి దుర్గతి యెట్టిదియో-తెలిసికొనవు గాక" యనిపలికి, మహాశక్తి నొకదానిం బ్రయోగించెను. దానిని రఘుకులేశ్వరుండు పొడిచేసి, యత్యుగ్ర శరంబుచే నతని తలలు మహింబడద్రెంచి కూల్చెను. కాని యవి యపుడే మరల నంకురించె. ఇట్లు రామచంద్రుండు తునుముటయు, మరల మరల వాని తలలు మొలచుచుండుటయు పలుసారులు జరిగెను. కాని రావణుండు మృతినొందఁడయ్యె. జానకీపతికి విసుగు బుట్టినది. రావణుని తపః ప్రభావమున కెంతయు విస్మయించి కర్తవ్యము తోఁచక, నతండు తనపైఁ బ్రయోగించుచున్న శరసమూదయంబులం ద్రుంచుటదప్ప వధించు వెరవు గనుపట్టమి యోచింపఁ దొడంగె.

అపుడు రఘువరునియం దధిక భక్తి గలవాఁడైన విభీషణుఁ డమ్మహాత్ముఁడు సంకట పడుచుండుటఁ దెలిసికొని దాపునకు వచ్చి తన యన్నకు మృతిగలుగు విధం బెఱింగియుండు వాఁడగుటచే, సోదర ప్రీతిని సయితము దలంపక, రామచంద్రుని జయమునే ముఖ్యముగా నెంచి మెల్లగా నిట్లనియె. "రాఘవేశ్వరా! చంప్రురీతి,

నెఱుంగలేక యెంత కాలము పోరాడినను, యీ రావణుని వధిం చుటకు బ్రహ్మేంద్రాదుల కైనను శక్యముగాదు, ఇతండు మర ణింపఁగల రహస్య మొకటి గలదు. వివరించెద. నాకర్ణింపుము. ఏమనఁగా, దశాననుని నాభిస్థానమున నమృత కలశ మున్నది. అది యితఁడు తప మొనరించి తనకు చావులేకుండుటకై విధాత వరము వలనపడసినది. అది యుండు వరకు నితండు మృతుండు గాజాలఁడు. తొలుత దానిని భేదించి, పిమ్మట శరప్రయోగ మొనరించిన యెడల సులభముగ మృతుండగును"—అని చెప్పెను.

రామచంద్రుం డతని పలుకులు విని యతనిం జూచి "విభీ షణా! నీవంటి నమ్మఁదగిన భక్తుండు నాకు మఱియొకండు గలు గఁడు అన్నగదా? యనెడి ప్రేమ మనంబున లేశమైన నుంచక, మహాదుష్టుండగు నట్టివాని విషయంబునఁ జేసిన యపకార మపకా రముగ నెంచదగినది కాదనియు నందుచే నట్టి దోషమును గలుగ దనియు నెఱింగిన ధర్మశీలుండవుగాన నాపై నీకుఁ గల యత్యంత మైన భక్తియు, మరియాదయు, నమ్మికయు నెఱుకపడు లాగున నెవ్వరికిం దెలియని పరమ రహస్యముఁ జెప్పితివి. సుగుణనిధీ! నీసత్ప్రవర్తనమును శ్లాఘింప తరముగాదు, నాకు నాప్రియానుజుండగు లక్ష్మణుం డెట్లో యవ్విధముననే, నిన్నునుం దలంచుచున్నాను." అని పలుతెఱగులఁ బ్రశంసించెను. ఆసందర్భము లన్నియుం గను చున్న రావణుండు తన మృతి తెఱంగును రామచంద్రునకు విభీ షణుడు దెలుపుచున్నాఁడని గ్రహించి, వానిపై మహదాగ్రహ మును బొంది, తొలుత నతని వధించి, యనంతరంబు రామునితోఁ బోరాడు తలంపున బిగ్గఱగా, తమ్ముని నుద్దేశించి యిట్లనియె.

కథాసరణి—డో రా.

పాప గుణాకర! యోరి! విభీషణ - పరమ కులద్రోహీ!
నాపిమ్మట రాజ్యము నేలుటకు మ - నంబున నూహించి
పరువెంచకఁ జనివైరి మానవుని - పాదంబులు బట్టి
దురితంబనక నిశాటుల నందఱఁ - దుద ముట్టించితివి
యదిజాలక యిపుడన్న గదా యని - యైన శంకఁగొనక
నదయుఁడవై నేఁ జచ్చు తెఱంగు ర - హస్యము రామునకు

నెఱిఁగించుటకుఁ దెగించితివిఁక ని - న్నేమనఁగా వచ్చు
ఇంతకు మిక్కిలి నీచేయఁగఁ గల - దేమి గలుగునోరీ !
చింత లేదు పోఁజచ్చిన మును నీ - శిరముఁ ద్రుంచి నేను
ప్రాణము లుండెడి వరకును మానక - పద్దున నెదిరించి
త్రాణమీరఁ బోరాడెద నాచే - రాముఁ డీల్గెనేని
జనకజనాథనమగు నంతటనే - సకల భోగములును
ననుభవింతు రాముఁడు నను జంపిన - నదియు మేలె యగును
పరలోక సుఖంబులు నాకొదవును - భయమేమియు లేదు.

వ॥ ఓరి పాపబుద్ధీ ! విభీషణా ! ఇంకొకమాట వినుము.

సీ॥ నీచాత్మకా నీవు - నాచేతఁ జావక
తప్పించుకొని యెవి - ధ్వమున నైన
బ్రతికి పోనేర్చిన - పక్షమం దొదవెడి
యాదాయ మేదియు - లేదు నీకు
యశమొప్పగాని రం - కుశుఁడనై లోకంబు
లేలితి భోగంబు - లెసగ మెసఁగ
ననుభవించిన వాఁడ - నెనలేని సర్వభో
గంబులు నేనిచ్చ - గలిగినట్లు.

గీ॥ బ్రతికితిని బెద్ద కాలంబు - పరువుతోడ
చింత లేదింకఁ జచ్చిన - చెడుగ నీవు
సకలమును శూన్యమైన రాజ్యంబుతలను
గట్టుకొనిదిక్కు లేకరొ - క్కఁడవమనుము.

"ఇదియైనను చావును దప్పించుకొనినే నీకు సిద్ధింపఁగలదు" అని యుగ్రంబుగాఁ బలికి, యత్యంత క్రూరంబైన శక్తినిఁ గొని తమ్మునిపైఁ బ్రయోగించె. భయంకరమైన యాశక్తి/ మిన్నంట మండుచు విభీషణుని భస్మముఁ జేయునదియై వచ్చుటయుఁ గని రామచంద్రుం డొక యుగ్ర శరంబునేసి దానిని ఖండించెను. "అట్లు రఘుకులేశ్వరుండు త్రుంచకుండినచో, యా మహాశక్తి విభీషణునిఁ జంపియే యుండుననియు, గండము దప్పినదనియు నెంచి యా రీతిం గాంచి భీతినొందిన సుగ్రీవాది వానర పుంగవులు సంతోషమును బొందిరి.

అపుడు విభీషణుండు రావణు నెచ్చరించి "లంకేశ్వరా! నీవు పరమ పురుషుండగు రామచంద్రునియెడల మహాపరాధం బొనరించితివి. జ్ఞానములేక యవ్విధంబునఁ జేసితివని తెలిసికొని, అన్నవనియు, తండ్రివంటి వాఁడవనియు నెంచి నీయందు ప్రియంబును, భక్తియుఁ గలవాఁడ నగుటచే, నీమేలుఁ గోరి నాశక్తికొలందిని నీకు హితముఁ జెప్పితిని నామాటల నాదరింపక, నన్ను పాదంబునఁ దాచి వెడల నడచితివి. నిన్ను విడిచి వచ్చునపుడు సయితము నీ యవివేకమును, నహంకారమునుం దలంచి నేను మిక్కిలి ఖిన్నుండనై "అన్నా! ఇది నీకు మేలుగాదు. మహోపద్రవ కరమగు కార్యము. ఇప్పటికైనను హాని వృద్ధుల నాలోచించి, శ్రీరామచంద్రుని దేవి నమ్మహాత్మున కర్పించి, శరణాగతుండ వగుము. సుఖింపఁగలవు. గర్వముతో వర్తించి కులమును నాశ మొనరించుకొని ప్రాణములు బోఁగొట్టుకొనఁ దలంపకు" మని జెప్పితిని. అపుడు నా పలుకులు వింటివా? నానా దుర్భాషలును బలికి నిరాకరించితివి. ఇటువంటి నీయొద్ద నుండుటకన్నను, శరణాగత వత్సలుండగు రఘువీరు నాశ్రయించుట క్షేమకరమని యెంచి, యాపుణ్యపురుషుని మహిమ నెఱింగినవాఁడ నగుటచే నిన్ను విడిచివచ్చి రామచంద్రుని మఱుఁగుఁ జొచ్చితి. అమ్మహాత్ముఁడు కరుణామయుం డగుటచే పగవాని తమ్ముఁ డనని యెంచి వధింపక నికరించి యాశ్రయం బొసంగి మన్నించెను. ఇటువంటి పరమ దయాపరుండు సంగరమునఁ జిక్కులొందుచున్నపు డతని దాసుండనైన నేను శక్తి కొలందిని సాయముఁ జేయవలసినది ధర్మముగాదా? ఇందు నేను చేసిన నేర మేమిగలదు? రావణా! అగ్రజుండనెడి ప్రేమతో నిపుడును నీక్షేమమును గోరి మేలుమాటఁ జెప్పెదను. అహంభావమును మాని యిప్పటికైనను బుద్ధిఁ దెచ్చుకొని, పతివ్రతా రత్నంబగు సీతా మహాదేవినిఁ దోడ్తెచ్చి దాశరధి కర్పించి శరణుఁజొచ్చి బ్రతుకుము, అమ్మహాపురుషుని త్రిమూర్తులును గూడ గెలువఁజాలరు. నీవన నెంతవాఁడవు? అడియాస విడిచినా హితోక్తుల నాదరించెదవేని మనఁగలవు. కాదేని నీకు చావు నిశ్చయము" అని గట్టిగాఁ దెలియబల్కెను. కాని కాల చోదితుండైన రావణున కామాటలు కర్ణశూలములుగా నుండి

నవి. తన మూర్ఛపు పట్టు విడువక రామచంద్రునితోఁ బోరఁ దొడంగెను

రామచంద్రుఁడు రావణుని వధించుట.

ఇట్లు రామ రావణులకు ఘోరయుద్ధము జరుగుచున్న సమయమున దశరథ నంద నాగ్రజుండు మహనీయంబైన దివ్య శరంబుం గొని, విభీషణుండు చెప్పిన చొప్పున దశవదనుని నాభి ప్రదేశంబు నందుగల యమృత కలశమును భేదించి వెలువరించెను. ఆ మహా బాణము సుధాకలశమును వెడలింపఁగానే, లంకేశుని తేజంబు తొలంగి నిస్సత్త్వుండై, శర ప్రయోగమునకు సయితము శక్తి లేని వాఁడయ్యె. అది యెఱింగి రఘువీరుండు వాడిశరములచే నతని తలలు పదియును వరుసగా ద్రుంచి నేలఁబడఁగూల్చిన, శిఖరములు విరిగిన పెనుగొండవలె రావణుండు ప్రాణములు తొలంగి తేరుపైఁ గూలె. అపుడొక విచిత్రంబైన కాంతి యతని శరీరంబులోనుండి వెలువడి మెఱయుచువచ్చి, రామచంద్రునిలోఁ బ్రవేశించి లీనమయ్యె.

ఈ ప్రకారము రామభద్రుండు దశకంఠుని వధించుట లోపలనే వనచర వీరుల రావణుని వెంట వచ్చిన రాక్షస దళంబుల రూపుమాపిరి. హతశేషులు దిక్కుమాలి పాఱిపోయి లంకలోఁ జొచ్చి ప్రాణంబులు గాచికొనిరి, రావణుండు మృతినొందిన నంతట రాముఁడు వనచరులం బనిచి, జనకరాజ నందనం దోడ్కొనిరండని యాజ్ఞాపించిన, వారురయంబునం జని యొక పసిండి పల్లకియందు గూర్చుండ జేసికొనివచ్చిరి. సాధ్వీరత్నంబగు సీత. బహుదినంబుల నుండియు నెడబాసియున్న తన ప్రియవల్లభునిం గాంచి పరమానందమును బొంది భక్తి, వినయ, విధేయత లతిశయింపగా నతని పాదములకు మ్రొక్కి, తనకు నమస్కరించిన, లక్ష్మణుని, సుగ్రీవాదులగు వానరులను, విభీషణుని నెంతయు నాదరంబున దీవించి నిలిచెను.

రాముఁడు సీత పాతివ్రత్యమును పరిశీలించుట.

చ॥ జనవర శేఖరుండవని - జంగని దైత్యుని పట్టణంబులో
మని నివసించియుండె పది - మాసము లింతి యెడంగ శంకమే

యనువున నెద్దిగిల్లునో కో - యవ్విధముం బరిశీలనంబుఁ జే
సినపుడుఁగాని యర్హ్వమని - చేకొనరాదని సంశయాత్ముఁడై.

"కాంతా! నీసుశీలంబును పదుగురు నెఱుంగునట్లు ప్రమా
ణంబుఁ జేసినంగాని నిన్ను నేనంగీకరింపఁజాలను" అనిపలుకుటయు,
నిష్కళంక చిత్తమైన తనయెడల రఘువీరునకు సంశయంబు పొడమి
నందుకై యామె మిక్కిలి వగచి, యపుడే యచ్చోట పెనుమంట
వేయించి యందుఁ బ్రవేశించి తలపూవు వాడక నిలిచెను. అటు
లనే సంకటమును నొందక సంతోషముతో మంటలలో నిలిచియున్న
యామహాపతివ్రతా రత్నమును గనుచున్న వార లందఱును బహు
ప్రకారములఁ గొనియాడిరి. మింటనుండి యారీతిని జూచి దేవ
తలు సంతోషించి స్తుతించి పూలవానఁ గురిసిరి.

అంతట రామచంద్రుండామె నిర్మలత్వమునకు మెచ్చి, నగ్ని
లోనుండి వెలువడి రమ్మని ప్రియంబు మీఱ దగ్గఱకుఁజేర్చి యంద
ఱకును పరమానందమును గలిగించె. లోకంబున ప్రమోదభరితమై
కనుపట్టినది. రాఘవేశ్వరుం డటుల సీతాదేవిని చేపట్టి యపుడు,
విభీషణునిం బిలిచి రావణుని కంత్యక్రియలు నెరవేర్ప నియమించిన,
యతండు తత్కార్యంబు లెల్లం గ్రమంబునఁ గడపి పరిశుద్ధుడైవచ్చి
రామునకు నమస్కరించెను. పిమ్మట దాశరథి సౌమిత్రిని, సుగ్రీ
వాది వానరులను జూచి "మీరు కూడి పోయి మనకు పరమా
ప్తుఁడును, నాయందు మిక్కిలి భక్తి గలవాఁడును, సకలసద్గుణ
పూర్ణుఁడు నైన యీ విభీషణునకు, పట్టాభిషేక మొనరించి రండు
పొం"డని పనిచిన, వార లరిగి లంకాపురంబు నలంకరింపించి శుభ
లగ్నంబున సింహాసనాశీనుం జేసి, పరమయోగ్యుఁడగు విభీషణునకు
పట్టాభిషేక మహోత్సవము జరిగించిరి. ఆ మహోత్సవమునకు
పాతాళ లంకాపతియైన నీలమేఘుండును, నతని మంత్రి మత్స్య
వల్లభుండును పెక్కు విధంబుల బహుమతులు గొనివచ్చి యొసంగి,
విభీషణునిచే సత్కార్యములుబొంది, శ్రీరామచంద్రుని సందర్శించి
పరమానంద చిత్తులై యనుజ్ఞం గొని తమ పురంబున కరిగిరి.

విభీషణుండు పట్టాభిషేకా నంతరము. లక్ష్మణ సుగ్రీవులను
బంగారపు పల్లకిలోఁ గూర్చుండఁబెట్టుకొని మొనలేని కానుకలు బట్టిం
చుకొని రామచంద్రుని సన్నిధి కరుదెంచి, తాను తెచ్చిన వానిని

సమర్పించి, సీతా సహితుఁడగు దాశరథికి నమస్కరించి నిలిచెను రఘువరుఁ డతని నెంతయు నాదరించి ప్రశంసించి, "విభీషణా! ఇంక మేము ప్రయాణమై మాపురంబునకుఁ బోయెదము. ప్రయత్నంబుఁ గావింపు"మని చెప్పెను.

రామచంద్రుండు పుష్పక విమానారూఢుండై యయోధ్యకరుగుట.

రామాజ్ఞను తలఁదాల్చి విభీషణుండు సకల సన్నాహములునుం గావించి, యెందఱికైనను తావు నొసంగు మహిమ గలదగు పుష్పక విమానముం దెచ్చి నిలిపిన, రాఘవేశ్వరుండు సంతసంబున సీతా లక్ష్మణులతోఁడను, విభీషణ సుగ్రీవాంగద హనుమ జ్జాంబవత్ప్రముఖులతోడను, డెబ్బదిరెండు వెల్లువల సైన్యముతోడను, నయ్యద్భుత విమానంబు నారోహించి యయోధ్యా నగరంబునకుఁ బోవదొడంగె. అటుల చనుచున్న సమయమున రామభద్రుండు తత్పూర్వ మచ్చటచ్చటను తాము సంచరించినట్టియు, నివసించినట్టియు ప్రదేశములను, నందందుం దోఁచు విశేషములును జనక రాజ నందనకుం జూపి చెప్పుచుఁ బోవుచుండ నమ్మానినీ మణి యా విశేషముల గాంచి యానందించుచుండె.

వేగంబుగా వారలు విమానారూఢులై పోయి పోయి, నందిగ్రామంబును సమీపించిరి. రఘువరుం డచ్చోట తన పాదుకల నర్చించుచు శత్రుఘ్న సహితుఁడై యున్న భరతునకు ముందుగా తమ రాక నెఱింగింపనెంచి హనుమంతునిఁ బుత్తెంచె. అతండు వాయు వేగంబునఁ జని, రామా గమన వృత్తాంతంబుఁ జెప్పుటయు, నట్టి శుభవార్తం దెలిపిన యాంజనేయునిం గొనియాడి పరమానందంబు జెంది, యనుజ సహితుఁడై, రఘువరాదులను రాబట్టు కొనుటకుఁ దగిన సన్నాహము లొనరించి, యయోధ్యా నగరంబు నలంకరించుటకుం దగిన వారల నియమించి తన యన్నరాకకై నిరీక్షించుచుండె.

మఱి కొంత తడవునకు విమానంబువచ్చి నందిగ్రామంబు కెలనభూమికి డిగ్గి నిలిచినది. అపుడు భరతుండు శత్రుఘ్న సహితుఁడై మంగళ తూర్య నినాదములు భోరుకొలగఁగా, మంత్రి సామంతదండనాయకులును సేనలును గూడి రా మహోత్సాహముతో నెదురేగి, విమానా వరోహణ మొనరించిన సీతా రాములకు సాష్టాంగ

దండ ప్రణామంబు లాచరించి తనకు మ్రొక్కిన లక్ష్మణునిఁ గౌఁగ లించె. రామచంద్రుడును, సీతా లక్ష్మణులును, భరతుని ప్రియంబున మన్నించి కొండికయగు శత్రుఘ్ను నాదరించిరి. అంతట లక్ష్మణు నిచే నెఱింగింపఁబడి భరత శత్రుఘ్నులు, సుగ్రీవాంగదాదులను, విభీషణునిం దెలిసికొని వారు నమస్కరించుటయు నందఱను నధిక సంతోషముతో నాదరించిరి.

పిమ్మట రత్న ఖచితంబైన సువర్ణ రథంబుపై కూర్చుండఁ జేసి, తక్కిన వారలకుం దగు వాహనము లమరించి పురంబునకుఁ బ్రయాణంబు గావించి తత్సమయంబున నప్పటివరకునుం దానుబూజిం చుచుండిన రాముని పాదుకలందెచ్చి భరతుండు సమర్పించి మ్రొ క్కెను. రాఘవేశ్వరుం డతనికిం దనపైఁగల భక్తి విశ్వాసముల కెంతయు నలరి మన్నించి సకల వాద్యములు మ్రోగుచుండఁగా మహావిభవముతో నటఁ గదలి చని శుభలగ్నంబున, పదునాలు గేండ్ల నాఁడు విడిచిపోయిన యయోధ్యా నగరంబులోఁ బ్రవేశిం చెను. రామచంద్రుని రాకచే యుప్పొంగి పురజనులు వారిపై పు ష్పాక్షతంబులు జల్లి తమ భక్తిని వెల్లడించిరి.

రాఘవేశ్వరుండు సీతా లక్ష్మణ సహితుండై నగరుఁ బ్రవే శించి తల్లులకు నమస్కరించిన వారు పరమానంద మగ్నులై వా రల దీవించి ప్రియంబు గదురఁ గౌఁగిళ్ళఁజేర్చి యాదరించిరి. ఇట్లు సర్వంబును సంతోషకరంబై జరిగి నంతట రఘువరుండు తమవెంట వచ్చిన సుగ్రీవాదులకును, విభీషణ ప్రముఖ దనుజులకునుం దగిన విడుదులు జూపి విడియించుటకు నియమించిన, యా కార్యమును శత్రుఘ్నుండు పూని వారి కనుకూలముగా నుండు లాగున నెల్ల కార్యములను జరిగించె.

అంతట కులగురుండగు వసిష్ఠుం డరుదెంచుటయును, రామ లక్ష్మణు లామహాత్మునికి దండ ప్రణామంబు లాచరించి యథ్యాస నాసీనునిఁ జేయుటయు నతండు వారల నాదరంబున నాశీర్వదించి, "రామచంద్రా! నీపాదుకలం బెట్టుకొని నీయందు మిక్కిలి భక్తి గల భరతుండు పదునాలుగు సంవత్సరములు తనకు శక్యముగాని రాజ్యభారము నెట్లో భరించి యుండెను. ఇఁక నతనిపై బరువు మోపుటకు వలనుగాదు. కావున నీ తండ్రి రాజ్యమును నీవు

గైకొని పాలింపవలసిన'' దని చెప్పిన, రాముఁ డామాటల కంగీక రించెను. అందఱును సంతోషించిరి.

వసిష్ఠ మహర్షి రామచంద్రుని పట్టాభిషేకమునకు శుభలగ్నమును నిర్ణయించి చతుస్సముద్రజలం గొని వచ్చుటకుం దగినవారిని నియమించె. భరతుఁడు పురాలంకారముఁ జేయించుటకును, సమస్త వస్తు సంభారములునుం జేకూర్చుటకును, సకలరాజులకును నాహ్వాన శుభలేకలు వ్రాసి పంపుటకును, మంత్రుల కాజ్ఞాపించుటయు, వార లాపనులు శీఘ్రమున నెరవేర్చివచ్చి యెఱింగించిరి. లగ్నదివసంబు నాఁటికి సకల దేశాధిపతులును, బంధువులును, మిత్రులును, నాశ్రితులును, బ్రాహ్మణోత్తములును. మహర్షులును, గుంపులుగుంపులుగా వచ్చి యయోధ్యయందు యెటు జూచినను దామయై క్రిక్కిరిసి యుండిరి.

## శ్రీరామ పట్టాభిషేకము.

పట్టాభిషేక దివసంబున సీతారాముల కభ్యంగన స్నానముఁ జేయించి దివ్యాంభరణ ధారులగు వారలను సర్వాలంకార పరిశోభితంబై యొప్పు కూటంబున రత్నసింహాస నాసీనులం జేసి, బ్రాహ్మణులును ఋషులును వేద మంత్రములు జదువుచుండ వసిష్ఠుండు బంగారపు కలశములలో సేకరింపఁబడిన సముద్ర జలంబుల నభిషేకించుచుండ, సమస్త విధ మంగళ వాద్యములును నంబరమునిఁ బ్రతిధ్వని లెసంగునట్లు మొరయఁగ యెల్లవారులును జయజయ ధ్వానములు గావించుచుండ నపుడు శ్రీరామచంద్రుండు దేవసభయందు చింతామణీ భద్రపీఠంబుపై శచీసహితుఁడై యొప్పు సంక్రందనుని విధంబున సీతాసంయుక్తుండై సర్వజనులకు నేత్రానందంబు గలిగించె.

మంగళాభిషేకానంతరము కులగురుం లగ్నంబుదప్పక పసిండి పట్టమును రామచంద్రునకుఁ గట్టి రమణీయ రత్నకిరీటమును శిరంబున నలంకరించె. అపుడు బ్రాహ్మణాశీర్వచనములును, జనుల కోలాహలములును, రాజుల జయ జయ వాక్కులునుం గూడిన మహాఘోషముచే దిక్కులు పిక్కటిల్లెను. అట్టియెడ పట్టాభిషిక్తుండై సీతామహాదేవితోఁగూడి దివ్య సింహాసనా సీనుండై యున్న పరమ పురుషుండగు రఘుకులేశ్వరునకు భరతుండు రమ్యచ్ఛత్రంబును బట్టె, లక్ష్మణ శత్రుఘ్నులు యిరువంకల చామరంబులం గొని వీచు

చుండిరి. ఆంజనేయుడు పదంబులం బట్టి యొత్తుచుండెను. సుగ్రీవుండును విభీషణుడును పార్శ్వంబుల సువర్ణ దండహస్తులై నిలిచి యుండిరి. తక్కిన వానరులును, రాక్షసులును, నానా దేశాగతులైన రాజులును, ఇతర సర్వ జనంబులును, నలుగెలంకుల మూఁగి సంస్తుతించు చుండిరి.

అందరకును నేత్ర పర్వంబై యొప్పుచున్న శ్రీరామ పట్టాభిషేక మహోత్సవమునకై యరుగుదెంచిన ప్రభువులు నానా విధములైన కానుకలు సమర్పించి రఘుకులేశ్వరుని కరుణాదర పాత్రులై యత్యంత ప్రమోదమును బొందిరి. అట్టి యెడ దేవతలు మింటనుండి చూచి పరమానంద మగ్నులై పెల్లుగా పుష్ప వర్షమును గురియించిరి. అంబరమున గంధర్వ గానములును, నచ్చరల నృత్యములును నతిశయిల్లె. చల్లని మలమమంద మారుతము వీచెను. దిక్కులు తెలివొందె. లోకంబులు సంతోష విలాస పూరితములై విలసిల్లె. యీ క్రమంబున మహా వైభవోపేతంబుగా, నేకొఱంత యును లేక, పట్టాభిషేకోత్సవము నిర్విఘ్నముగా నెరవేరెను.

అంతట రామచంద్రుని యాజ్ఞానుసారముగా, లక్ష్మణ భరత శత్రుఘ్నులు పట్టాభిషేకోత్సవమునకు వచ్చిన, బ్రాహ్మణులకును, రాజులకును, పేద సాధులకును. వారివారికిం దగిన రీతిని బహుమతులును, దానధర్మములును నవ్వారిగా నొనరించి, మృష్టాన్న సంతుష్టులం జేయుటయు నందఱును సీతా రాములను గొనియాడి తమ తమ నివాసములకుఁ బోయిరి.

రామచంద్రుండు సుగ్రీవాది వనచరోత్తములకును, విభీషణ ప్రముఖ రాక్షస సత్తములకును, బహుతర బహూకృతులు గావించి వారు తన కొనరించిన మహా త్సహాయమునకై మిక్కిలి ప్రశంసించి వీడ్కొలుపుటయు, వార లమ్మనుజేశ్వరునకును, సీతా మహాదేవికిని భరత లక్ష్మణ శత్రుఘ్నులకును మ్రొక్కి, తమ తమ బలంబులం గూడి స్వపురంబులకుం జనిరి. పుష్పక విమానంబు కుబేరునియొద్ద కలకాపురంబునకుఁ బోయెను. రాఘవేశ్వరుం డదిమొదలు సర్వ జన నయనానంద కరుండై పెద్దకాలము న్యాయంబుఁ దప్పక రాజ్య పాలనంబుఁ జేయుచుఁ, సమస్త భోగములు ననుభవించుచు, దిగంత విశ్రాంత యశో విరాజితుఁడై యొప్పుచుండెను.

ఫలశ్రుతి.

క॥ ఈకథఁజదివిన వినినం
జోకఁ వ్రాసినను నట్టి-సుమతులకుఁ గృపఁ
గాకుత్స్థాన్వయుఁడగుసీ
తాకాంతుఁ డొసంగుసంత - తంబును శుభముల్.

చ॥ అతులిత భద్రలక్షణస - మన్విత మన్మథ సుందరాంగ, యా
శ్రిత పరిపాలనోత్సుకవ - శీకృత భక్తజనౌఘ మానసా
శతమఖ ముఖ్యసర్వదివి - జస్తుత పాదసరోజ యుగ్మవాం
ఛిత ఫలదాయకా విజయ - సేవిత వేంకట శైలనాయకా!

క॥ భుజగేంద్ర తల్పశౌరీ! వ్రజకాంతా లోలనీల - వర్ణముకుందా
రజనీచర భీకరపం! కజలోచన భవ్యనామ - కరుణాధామా!

ఉత్సాహ వృత్తము.

సామగానలోల పూర్ణ - చంద్ర సన్నిభాస్య మం
గామనోంబు జార్క నిర్వి - కార శాంత భావని
ష్కామరమ్య హేమచేల - చక్రహస్త పావనా
సానుజారి భంజనాయు - జాత్రిలోక రంజనా!

గద్య.

ఇది శ్రీమద్వేంకటేశ్వర వర ప్రసాదలబ్ధ సహజ చతుర్విధ
కవిత్వ మహత్వాభిరాము, పౌరాణిక వంశ పయః
పారావార పర్వ శర్వరీసోమ, శ్రీవత్సగోత్ర
పవిత్ర, సావిత్రీ లక్ష్మీ నృసింహార్య పుత్ర
విజయాశ్వ చరిత్ర ప్రముఖ బహుతర
గ్రంథ కల్పితానల్ప ప్రవీణ సంతత
సద్వర్తనాతి ప్రమాణ సుజన
విధేయ, పిచ్చయ నామధేయ
ప్రణీతంబైన విచిత్ర
మైరావణ చరిత్రంబను వచనకావ్యంబు సర్వంబును
సంపూర్ణము.
శ్రీమద్వేంకటేశ్వరార్పణమస్తు.

ఆనందభారతి ప్రవర్ ప్రెస్, మదరాసు. 6-5-1940—2000.

# శ్రీమద్రామాయణసంగ్రహము.

తెనుగు వచనము.

రామాయణమునందలి ముఖ్యాంశములను సంగ్రహపరచి వ్రాయుటవలన ఈ గ్రంథరాజమును సంగ్రహ రామాయణ మనఁబడును. ఇందు దశరథుని రాజ్యవిభవమును దశరథునికి పుత్రులు లేనందున కుల గురువగు వశిష్ఠులవారి అనుమతిని పుత్ర కామేష్ఠి యాగము జేయుటయు పుత్రోత్సవమును, శ్రీ రామలక్ష్మణ భరత శత్రుఘ్నుల జననము విశ్వామిత్రుడువచ్చి శ్రీరాములను యాగ సంరక్షణార్థము పంపమని దశరథుని కోరుటయు వశిష్టులవారి అనుమతిని విశ్వామిత్రునివెంట శ్రీరామలక్ష్మణుల ననుపుటయు, విశ్వామిత్ర యాగ సంరక్షణమును, తాటకీ సంహారమును, విశ్వామిత్రునివెంట మిథిలానగరమునకు జనుటయు, జనకుని పుత్రికయగు జానకిని వివాహము చేసుకొని అయోధ్యకు వచ్చుటయు, శ్రీరాములవారికి పట్టాభిషేక భంగమును తదనంతరము సీతాలక్ష్మణ సమేతులై పితృవాక్య పరిపాలనార్థము అరణ్యమునకు జనుటయు దండకారణ్య ప్రదేశమున రావణుడు సీతను గొనిపోవుటయు రాముడు సీతను వెదకుటయు, వానర సైన్యముతో సేతువు బంధించి లంకకుజని రావణకుంభకర్ణుల వధించి సీతను గ్రహించి విభీషణునికి పట్టాభిషేకము చేయించి శ్రీ రామలక్ష్మణులు సీతా సమేతముగా పుష్పక విమానారూఢులై అయోధ్యకువచ్చి పట్టాభిషిక్తు డగువరకును ఆయా సందర్భముల చిత్ర పఠముల చేర్చి ముద్దులొలుకు తెనుగుమాటలతో స్త్రీలకు బాలురకుకూడ బోధపడునటుల వ్రాయబడినది. ఇందలి కథ మిక్కిలి యద్భుతముగాను చదివెడువారికి నింపుపెంపొంద జేయదగిన గ్రంథరాజము.

వెల రూ. 1-0-0

# బసవ రాజీయము. (వైద్యగ్రంథము.)

ఇది ఒక మహా గొప్ప వైద్యగ్రంథము. ఆయుర్వేదశాస్త్ర పారీణుండగు బసవరాజునిచే రచియింపబడినది. ఆంధ్రతాత్పర్యసహితముగా గ్లేసు కాగితములపై అచ్చొత్తింప బడినది.

ఇందు నాడీపరీక్ష, వాతము, పిత్తజ్వరము, విషమజ్వరములు, పాండురోగ, క్షయరోగ, సూతికాది లక్షణములన్నియు విమర్శించి వ్రాయించిన మహా గొప్ప గ్రంథము. ధర రూ. 7-0-0

# చంద్రామృతము

## సర్వరోగనివారిణి.

ఇది ఒకసీసా దగ్గరయున్న వేరెవైద్యుడు అవసరంలేదు. అన్నిరోగములను పోగొట్టును. ప్రతివారివద్దను ఉండతగినది రస విషగంధకాదులు కలియలేదు. దీనిని పైకి పూసిన ఎటువంటి వాతనొప్పులు, కీళ్ళనొప్పులు, మొదలగునొప్పులు, పొడ, తామర, చిడుము మొదలగు చర్మవ్యాధులు నిర్మూలమగును, కొన్నిబొట్లు నీళ్ళలో విడచి పుచ్చుకొనిన శీతలజ్వరము కడుపునొప్పి, అజీర్ణము, శూల, దగ్గులు, కడుపులోబల్ల, శీతవాత కఫపైత్యరోగములు, మూలవ్యాధి, బలహీనము మొదలకుసకలరోగములను, పోగొట్టును. పథ్యములేదు డైరక్షను మందుతోకూడా పంపబడును. సీసా **1-8-0**

## జీక్యూర్ అను మేహాతెలుపునకు ద్రావకము.

ఈ మేహాతెలుపు నివారణియను పరమశ్రేష్టమగు ద్రావకము, మేహాతెలుపు కడుపుసెగ, నీరుదారనుండి చీము, నెత్తురుకారుట మంట దినాల పీకట దేహంబున పూరి కొంచము కొంచముగా బట్టలుతడసి కష్టమునిచ్చు నొకవిధమైన బట్టంటురోగము మొదలైనవి స్త్రీపురుష లింగభేదములకు ఎన్నియేండ్లదైనను, అనేకమందులనుదిని, గుణముగాంచనదైనను ఈ ఔషధమును యెంచి 10 దినములు పుచ్చుకొన్నచో రోగంబు కుదుటగానరు. **1-0-0**

## సుగంధ పండ్లపొడి.

ఇది దంతచూర్ణములలో అన్నిటికంటె శ్రేష్టమైనది పండ్లు ఆడుట, చిగుళ్ళు పెరుగుట, పండ్లయందు రక్తముకారుట పంటి శైత్యము, పల్లుపుచ్చిపోవుట, పంటిగబ్బు మొదలగునవి ఖండింమను. డబ్బి 1-కి **0-4-0**

## నేత్రాంజనము



ఈ తైలము ప్రతిదినము ఉదయం కన్నులకు వుపయోగించిన యెడల కన్నునొప్పి, పొట్లుమూతబడుట, నీరుకమ్ముట, మబ్బుగానుండుట పిసికట్టుట, కండపెరుగుట, ఎర్రగానుండుట, కన్నుమంటలు, నేత్రవాయువులు మొదలైన వ్యాధులను హరించును.

సీసా 1-కి **0-8-0**

---

మా విలాసము:—ఎన్. వి. గోపాల్ అండు కో.,
నెం 63, కృష్ణప్పనాయకన్ గుంటవీధి, సౌకార్‌పేటపోస్టు, మదరాసు



# సకలవిధ పొడసంహారి.

శరీరము మడతలుగలకంఠము చంక, తొడలునందు వస్త్రములు ధరించు నడుముభాగము అనగా నడుముచుట్టును, పొత్తికడుపునందును, చిన్నబొబ్బలై ప్రేల్చి దినదినమునకు వృద్ధియై తీరని తీట గల్గి నిద్రను భంగము చేయునట్టితామర, మేహతామర, మేహకారకతామర, దట్టపుతామర, దక్షిణదేశమునగల పురుగుకాటు మొదలగు వాట్లను రెండుదినములలో వున్నచోటుదెలియక మాన్పి సుఖపరచును. సీసా 1-కి 0-8-0

తామరమందు బుడ్డి 1-కి 0-8-0 డిటో డజను 1-కి 5-0-0

# నరసిన వెంట్రుకలను.



## 5-నిమిషములలో నలుపుజేయు తైలము.

దీనికంటె యెక్కువయగు తైలము భూమండలమున లేదు మాయొక్క తైలము నరసిన వెంట్రుకలకు పూసిన 5 నిమిషములలో నల్లని వెంట్రుకలవలెనే జేయును మిగుల కాంతియునిచ్చును దీనిని చరిమినతర్వాత ముఖలక్షణమున్ను వశీకరణమున్ను కలుగుటవలన వయోధిక్యముగల వారున్ను బాలులవలె కనబడుదురు, ఇదినిజము దీనిని ఉపయోగించువిధము మందుతోకూడ పంపెదము. సీసా 1-కి 1-0-0

## అమృతసంజీవిలేహ్యాం అయఃకాంతసింధూరం.



ఈలేహ్యంవలన కడుపునొప్పి, పక్కశూల, గుల్మవ్యాధి, పాండురోగం, పిత్తరోగం, కామాల, రొమ్ముశూల ఎక్కిళ్లు, పైత్యవాయువులు, నోటియందునీరుపారుట, వాంతి, కండ్లుమంటలు, కుట్లు పైత్యాధిక్యముచే స్వప్నములుకలుగుట, నిద్రరాకుండుట మొదలగు సకలరోగములు 48 దినములు సేవించుటచే తీరి దేహమునకు రక్తముగలిగి ధాతుపుష్టినికలిగించి రోగులనుగా చేసి ఆయుర్వృద్ధిని కలిగించునని చెప్పగలము మోతాదుపూట 1-కి అరతులము పాలు, నెయ్యి కావలసినంత చేర్చుకోవచ్చును పత్యంలేదు స్త్రీసంభోగము కూడదు.

24 రోజులకు 1-సేరు అమృతసంజీవిలేహ్యం, అయఃకాంతసింధూరం 2-0-0
48 రోజులకు 2-సేరు మొత్తంగాతీయువారికి తపాలకర్చులతో 4-0-0

---

మా విలాసము:—యన్. వి. గోపాల్ అండు కో.,
నెం 63 కృష్ణప్పనాయకన్ గుంటవీధి, సౌకార్ పేట పోస్టు, మదరాసు

## మేలురకం రోమసంహారి పౌడరు.

దేహమునందు యేభాగమందయినను వెంట్రుకలను పోగొట్టదలంచి ఈపౌడరును వుపయోగించుచు వచ్చిన యెరొక్క అపాయములేక శుభ్రముగా వెంట్రుకలు వీడిపోవును. సీసా 1-కి 0-8-0 రోమసంహారిసోపు 3 బిళ్లలుగల పెట్టె 1-కి 0-12-0

## రక్తశుద్ధి అయఃకాంత ద్రావకము.



తెల్లని వెంట్రుకలు నల్లనగుట, పురుగులుకత్తిరించుటను, అధికవుష్ణమువల్ల రాలిన వెంట్రుకలను మరల పెరుగనిచ్చును, కండ్లు చేతులు కాళ్లుమంటల నుపోగొట్టును, ముఖమునకు తేజస్సుకలుగజేయును, దేహమునందుండు వుష్ణమును పోగొట్టి చేతులుకాళ్ల నడుములోగలుగుఅశక్తత నొప్పులనుపోగొట్టి బలమునిచ్చును పయిత్త్యపు వాయువులను ఒకమండలములో ఎన్నటికిని రానివ్వక బహు అకలియున్ను జీర్ణశక్తియున్ను కలిగించును, వదలిన నరములను బలపరచి దృఢమును కలుగజేయుటలో దీనికిమించిన ఔషధము యింకొకటిలేదు. గోళ్లలోను, కండ్లలోను, నెత్తురులేక, తెల్లబారియున్నవారు యీద్రావకమును ఒక మండలము 40 రోజులు సేవించిన యెడల దేహమాంద్యంతం క్రొత్తరక్తమును వ్యాపించును పైత్యపుపసిమికిని పాండు గుల్మం చేతులుకాళ్ళువాపు గుండెనొప్పి మొదలయిన వాటిని 8 రోజులలో స్వస్థపరచును. స్త్రీసంభోగము కూడదు.

20 రోజులకు రు. 1—2—0    40 రోజులకు రు. 2—0—0

## సర్వవిషసంజీవి అను
### తేలుకాటుకు మందు.



ఇది నూతనముగా కనిపెట్టబడిన సొగసైన పరమౌషధము దీనిని వుపయోగించిన 5 నిమిషములలోపల ఘోరక్రూర బాధను చల్లార్చి చల్లదనము గలిగించును, తేలుకుట్టిన తర్వాత ఆర్భటించుచు వచ్చిన మనుష్యుడు మందువేసిన తర్వాత ఆనందముతో నవ్వుచు వెళ్లును. సీసా 0-8-0 12 సీసాలు 5-0-0

## మూలరోగ సంజీవి లేహ్యము.

లోపలిమూలము, బయటమూలము చీముతోచేరిన మూలము, బెట్టమూలము, రక్తమూలము మొదలగు పాతరోగములను సకలవిధ మేహవుష్ణములనున్ను పారదోలును, మూలరోగులకుఆస్పత్రిలోతీరకున్నను ఈమయౌషధమువల్ల నివర్తియగును.డబ్బి 2-0-0

---

మా విలాసము:—యన్. వి. గోపాల్ అండ్ కో,
నెం. 63 కృష్ణప్పనాయకన్ గుంటవీధి సౌకారుపేటపోస్టు, మదరాసు.

త్వరపడుడు!!    సకలమైన మేహవ్యాధులు తీరును!!    త్వరపడుడు.

# మేహనివారణి అమృతసంజీవి నూనె.




మిత్రులారా! ఈ మేహనివారణి సంజీవినూనె సుమారు 50 సం॥ ముందు హిమాలయపర్వతములయందు ఒక మహాఋషి వల్ల కనిపెట్టబడినది ఈ ఔషధము దైవానుగ్రహమువల్ల మా పెద్దలకు వుపదేశింపబడినది. ఈ సంజీవినూనె మా చెన్నరాజధానిలో అనేకరోగులకు ఈ నూనె ఒకసారి మావద్దతీసి సేవించినవారు తమ స్నేహితులకు తెలిపించినందువల్ల వారి మూలమువల్ల రోగములు నివారణలేక రోగములచే బాధపడుచు మనస్సులోని యెట్లును తోచక గొప్ప అవస్థలో చింతించే రోగులకు యీ నూనె స్వల్పధరలో తయారుచేయడమైనది.

ఈ నూనె కొన్ని శాస్త్రసంబంధమయిన కూటయిరువదిపచ్చి మూలికలున్ను ఉప్పువగయిరా ఆకుపసరుతో తయారుచేసి అనేకరోగములను ఖండించబడిన ముఖ్యమైన ఔషధము యెటువంటి దుర్గుణమైన వ్యాధులున్నా ఇంకా పలువిధ మేహరోగములను భస్మముగా నశింపజేయు సంజీవి అమృతనూనె యని చెప్పనగును.

ఈ నూనెవల్ల నివారణమగువ్యాధులవివరం:—కంఠమాల, అర్ధకపాలం, కొరుకు ఆసనసంబంధమయిన మూలవ్యాధులు, పెట్లసవాయి, చిట్లఫిరంగి, నల్లమచ్చలు, సవాయి, గ్రంధి, మేహశామర మచ్చలు, మేహదురదలు, గజ్జి, మేహములు, పార్శ్వవాయువు, మేహవాయువు, సూతకజన్ని, కాళ్లుచేతులు పట్టుపట్టుట, ముఖముపుబ్బుట, తెల్లసెగ, పచ్చసెగ, మూత్రములోవచ్చు చెడువ్యాధులు, నడుమునొప్పులు, కుసుమ వ్యాధి, అధిక మేహమువల్లవచ్చు పచ్చకామిర్లు, మూత్రకొరుకు యేనుగు కాళ్ళవలె వుబ్బుట మొదలయిన మేహరోగములను ఖండించి రక్తశుద్ధిచేసి జనులు ఆశ్చర్యపడునట్లుగా దేహము సూర్యునివలె తేజస్సును, మన్మథునివలె పుత్రసంతానమున్ను గలుగజేయును. ఔషధమునకు పత్యనోటీసు బుడ్డితో పంపబడును. తమయొక్క వ్యాధి యెన్నిదినములుగా యున్నదిన్ని రోగముయొక్క వివరం తెలియపరచవలెను. మీ యుత్తరములు రహస్యముగా వుంచబడును.

| | | |
|---|---|---|
| దినములుగడచిన వ్యాధులకు | 5 పూటలు నూనె | 3-0-0 |
| సాధారణమయిన వ్యాధులకు | 3 పూటలు నూనె | 2-0-0 |

# కస్తూరి మాత్రలు.

ఈ మాత్రలు జలదోషము జలుబు వీట్లను తాంబూలముతోచేర్చి పుచ్చుకొనవచ్చును గర్భిణి స్త్రీలు తాంబూలముతో భుజించినయెడల సుఖముగ ప్రసవించుదురు.

0-8-0

---

మా విలాసము:—యస్. వి. గోపాల్ అండ్ కో.,

నెం 63. కృష్ణప్పనాయకన్ గుంటవీధి, సౌకార్ పేటపోస్టు, మదరాసు.